విచిత్ర విచిత్రం



# ముసలి తండ్రి

"తాతా! పెళ్లి చేసుకుంటావా?" అంటే "నాకు పిల్లనెవరిస్తారూ?" అంటాడని మనవాళ్లు నవ్వుతూ ఉంటారు. అయితే ఆస్కార్ అవార్డ్ గ్రహీత, హాలీవుడ్ నటుడు జార్జ్ కెన్నడీ తన 73 వ ఏట ఏకంగా తండ్రి అయ్యాడు. ఆరడుగుల నాలుగంగుళాలు ఎత్తుండే జార్జ్ కాలిఫోర్నియా లోని థౌజండ్ ఓక్స్ అనే ఊళ్లో తన మూడేళ్ల కూతురితో తీయించుకున్న ఫొటో ఇది. ఇతని భార్య పేరు జోన్.

# చతుర కథలు

## టూబర్డ్స్ ఎట్ ఒన్ షాట్!

రాజేశ్వరికి, కామేశ్వరికి మ్యాచింగ్ బ్లౌజ్‌లంటే తెగపిచ్చి. ముందుగా నచ్చిన చీరలు ఎంత ధర పెట్టయినా కొనుక్కుంటారు. ఊళ్లోకి చీరల ఎగ్జిబిషన్ వచ్చిందంటే ప్రదర్శన వున్న వారం రోజులలో నాలుగు రోజులు అక్కడే వుంటారు.

అయితే అక్కడితో పనయిపోదు. మ్యాచింగ్ బ్లౌజ్‌లే పెద్ద సమస్య అయి కూర్చుంటుంది. అన్ని చీరలకీ మ్యాచింగ్‌బ్లౌజ్ పీస్‌లు దొరకడం సులభంకాదు. అయినా రాజేశ్వరి, కామేశ్వరి అన్ని షాపులలోనూ కట్‌పీస్‌లు, రన్నింగ్ మెటీరియల్‌లు చూసి ఆ షాప్ లకి మోసికెళ్లిన కొత్త చీరలకి సరిపడిన బ్లౌజ్ పీస్‌లు కొనుక్కుంటారు.



కిందామీదా పడి కావలసిన చీరలు సెలక్ట్ చేసుకుంటారు.

ఇద్దరి ఫ్లాట్‌లు పక్కపక్కనే కనుక ఒకే ఆటోలో కొత్త చీరల మూటలు తెచ్చుకుంటారు. ఆటో ఖర్చు షేర్ చేసుకుంటారు. ఆ తర్వాత ఎవరి ఫ్లాట్‌కి వాళ్లు వెళ్లి కాళ్లు కడుక్కోకుండానే కొనుక్కున్న చీరలు కట్టుకుని అద్దంలో చూసుకుని మురిసిపోతారు.

అయితే అంతటితోనూ పనయిపోదు. ఆ తర్వాత బ్లౌజ్‌లు కుట్టించుకునేటప్పుడే టైలర్‌తో తలనొప్పి వస్తుంది. సహనం చచ్చిపోతుంది.

టైలర్‌లు కుట్టుకూలి పెంచేస్తున్నారు. చెప్పిన టైమ్‌కి ఇచ్చి చావడంలేదు. అయినా రాజేశ్వరి, కామేశ్వరి టైలర్‌లని జాకెట్లకోసం రాజీపడిపోయి భరిస్తున్నారు. జాకెట్ల విషయంలో ఆఖరికి 'నేచురల్ ఫిట్' టైలర్‌నే నమ్ముకున్నారు. ఉన్నవాళ్లలో ఉత్తముడయిన

నేచురల్‌ఫిట్‌టైలర్ ఉన్నట్టుండి ఒక మీటర్ తెస్తేనేకాని జాకెట్ కుట్టలేనని అనౌన్స్ చేశాడు. రాజేశ్వరికి, కామేశ్వరికి ఇద్దరికీ పచ్చివెలక్కాయ గొంతులో పడింది.

'నేచురల్ ఫిట్' టైలర్ కుట్టిన తర్వాత ఆల్టర్ చేయించుకోవలసిన అవసరం వుండదుకనుక ముందుచూపుగల రాజేశ్వరి ఒక మీటర్‌కి ఓకే అంది.

ఊళ్లో ఇక టైలర్లులేరా? వీధికొక్కరు వెలుస్తున్నారు, యాభయి సెంటీమీటర్లకి కూడా కుట్టే టైలర్ దొరక్కపోడు. ఇప్పుడు అనవసరంగా డెబ్బయి అయిదు సెంటీమీటర్ల గుడ్డ ఇస్తున్నానని కామేశ్వరి 'నేచురల్‌ఫిట్ టైలర్'కి గుడ్‌బై చెప్పింది.

రెండు రోజులు తిరిగేసరికి కామేశ్వరి 'ఒన్ మీటర్ టూ బ్లౌజెస్' టైలర్‌ని కనిపెట్టింది. వారం రోజుల తర్వాత రాజేశ్వరి ఫ్లాట్‌కి వెళ్లి "అన్ని బ్లౌజ్‌లు చెప్పిన టైమ్‌కి కుట్టి ఇచ్చేశాడా కొత్త టైలర్. బ్రహ్మాండంగా వున్నాయి అనుకో" అంది కామేశ్వరి.

కాసేపాగి "ఏ బ్లౌజ్‌కీ యాభయి సెంటీమీటర్లకన్నా ఎక్కువ తీసుకోలేదు. అద్భుతమైన ఫ్యాషన్. అదిరిపోయిందిలే" అంది కామేశ్వరి.

రాజేశ్వరి ఆశ్చర్యంగా వింటూ వుంటే "ఇక ఊరంతా ఈ ఫ్యాషన్ వ్యాపిస్తుందిలే" అంది కామేశ్వరి.

"ఏదీ అతను కుట్టిన జాకెట్ ఒకటి చూపించు" అంది రాజేశ్వరి.

"వేసుకున్నది అదేగదా!" అంది కామేశ్వరి. రాజేశ్వరి మరింత ఆశ్చర్యపోతూ వుంటే కామేశ్వరి వెనక్కి తిరిగి ఇప్పుడిదే లేటెస్ట్ ఫ్యాషన్‌లే! యాభయి సెంటీమీటర్ల ఫ్యాషన్ అంటే ఇదే చూడు" అంది.

కామేశ్వరి వీపుమీద జాకెట్ కుడి-ఎడమ భాగాల్ని విడిపోకుండా ముడేస్తూ సన్నని మ్యాచింగ్ త్రెడ్ అందంగా కనుపించిందక్కడ.

**–అడవి కొలను నైపుణ్య**

---

## బాధ్యత

"అర్జంటుగా బయలుదేరి వచ్చెయ్. రేపు ఉదయానికల్లా నువ్వు విజయవాడలో ఉండకపోతే కొంపలు మునుగుతాయ్!" అని విజయవాడలో ఉంటున్న తమ్ముడి దగ్గరనుండి ఫోన్ వచ్చింది కలకత్తాలో ఉంటున్న బాబూరావ్‌కి.

ఫోన్ పెట్టేసి ఆలోచనలో పడ్డాడు బాబూరావ్! రేపటికల్లా విజయవాడలో వుండాలంటే ట్రైన్‌లో లాభంలేదు. విమానం ఎక్కి వెళితేనేగానీ సమయానికి విజయవాడ చేరుకోలేడు.

అక్కడేదో ఆస్తి తగాదా ఉంది. అర్జంటు కాకపోతే తమ్ముడు అంత తొందరపెట్టడు. తప్పకుండా వెళ్లాల్సిందే! బాబూరావు విమానంలో ఎప్పుడూ ఎక్కడికీ వెళ్ళలేదు. ఇప్పుడు తప్పదు. ఆపసోపాలు పడుతూ సూట్‌కేస్‌లో బట్టలు సర్దుకున్నాడు బాబూరావు.

సూట్‌కేస్‌లో బట్టలు సర్దుకోడానికి ఆపసోపాలు పడడం ఎందుకు? అని అనుమానం రావచ్చు మీకు? మరేంలేదు! బాబూరావు కాస్త భారీమనిషి. ఏ చిన్నపని చేయడానికైనా భారీగానే అలసిపోవడం అతని హాబీ!

సరే! టాక్సీలో బయల్దేరి దార్లో విజయవాడకి టిక్కెట్ కొనుక్కుని ఎయిర్‌పోర్ట్ చేరుకుని విమానం ఎక్కి కూర్చున్నాడు బాబూరావు.

విమానం బయలుదేరడానికి ఇంకా



టైముంది.

కాసేపైన తరువాత-

బాబూరావు సీట్లోంచి లేచి కాక్‌పిట్‌లోకి వెళ్ళి, "సార్! విమానంలో ఇంధనం సరిపడా ఉందా?" అనడిగాడు పైలట్‌ని.




"ఓ సరిపడే దానికన్నా ఎక్కువే ఉందండి. ఏంభయంలేదు" అన్నాడు పైలట్ నవ్వుతూ.

కాసేపైన తరువాత బాబూరావ్ మళ్ళీ పైలట్ దగ్గరకు వెళ్ళి, "సార్! చక్రాల్లో గాలి ఫుల్‌గా ఉందికదండి?" అనడిగాడు.

"ఎక్కువా లేదు, తక్కువా లేదు, కరెక్ట్‌గానే ఉందండి" చెప్పాడు పైలట్ విసుక్కోకుండా.

తృప్తిపడి వెళ్ళిపోయిన బాబూరావ్ మళ్ళీ కాసేపటికి పైలట్ దగ్గరకు వెళ్ళి "ఇంజన్ మంచి కండిషన్‌లోనే ఉంది కదండి?" అనడిగాడు.

"అంతా బాగానే ఉంది. ఓవేళ అది ఆగినా స్పేరింజన్ ఉందిగానీ, ఎందుకివన్నీ అడుగుతున్నారు" అనడిగాడు పైలట్ ఆశ్చర్యంగా.

"మరేంలేదండి. నేనెప్పుడైనా బస్‌లోగానీ, కారులోగానీ ప్రయాణం చేస్తుండగా దార్లో ఆ వాహనం చెడిపోయి ఆగిపోతే అందరూ నన్నే దిగి తొయ్యమంటుంటారు అందుకని" చెప్పాడు లావుపాటి బాబూరావు.

*–కోనే నాగవెంకట ఆంజనేయులు*

---

## ఖరీదైన డ్రైవర్

అమెరికాలో హైవేలలోకి ప్రవేశించేముందు టోల్‌టాక్స్ కట్టాలి కార్లుగల వారందరూ.

అలాంటి ఓ టోల్‌టాక్స్ కేంద్రంవద్ద కాపలా వేశారు పోలీసులారోజు ప్రత్యేకంగా. ఆ కేంద్రంగుండా వెళ్లనున్న 10 కోట్లవ కారుకు ప్రత్యేకంగా లక్ష డాలర్లు బహూకరించాలనే నిర్ణయం ప్రకారం త్వరలో ఇక్కడకు 10 కోట్లవ




కారు రావాల్సి ఉంది. టోల్‌గేట్ ఆఫీసులోని కంప్యూటర్ టికెట్ మిషన్ మీద నమోదవుతున్న ంార్ల సంఖ్యను జాగ్రత్తగా గమనించగా గమనించగా చివరికి ఆ 10 కోట్లవ కారు రానేవచ్చింది.

డ్రైవర్ టోల్‌టాక్స్‌క్రింద పది సెంట్ల నాణెం ఇవ్వగానే పోలీసుల బాస్ వచ్చి చెప్పాడు,

"కంగ్రాచ్యులేషన్స్. మీరు ఈరోజు టోల్‌టాక్స్ కట్టనక్కర్లేదు. అంతేగాదు



మీ కోసం లక్ష డాలర్లకు చెక్ కూడా రెడీగా ఉంది. మీ పేరు చెపితే చెక్‌మీద రాసేసి ఇప్పుడే ఇచ్చేస్తాం" అన్నాడతను.

"ఎందుకు? " అనడిగి వివరాలన్నీ తెలుసుకుని ఎగిరిపడ్డాడు కారు ఓనర్. ఆయన కాస్త వయసు మళ్లిన వాడు. ఆయనలా ఆనందంతో ఉక్కిరి బిక్కిరవుతుండగా కార్లోని ఆయన భార్య అడిగింది "ఇది మా సొంతకారు కాకున్నా ఆ బహుమతి ఇస్తారా? "

"ఇస్తాం. అయినా ఇది అద్దె కారులా లేదే" అన్నాడు పోలీసాఫీసర్.

"కాదు, నిజానికిందాక మీరు కారాపినప్పుడే ఇది దొంగిలించిన కారని తెలిసిపోయి కాపలా వేశారేమోనని భయపడ్డాం" అన్నాడా డ్రైవర్ సీటాయన.

"ఏమిటీ? దీన్ని దొంగిలించుకొచ్చారా? " నిర్ఘాంతపోయాడా పోలీసాఫీసర్.

"మా ఆయన జోకులేస్తున్నార్లెండి. తాగి ఉన్నపుడాయనకిలా వాగడం అలవాటే" అందాయన భార్య చెక్కుకోసం ఆశగా ఎదురుచూస్తూ.

"తాగి కారు డ్రైవ్ చేస్తున్నారా? నిర్ఘాంతపోయాడా పోలీసాఫీసర్.

"చూశావా... తాగి డ్రైవింగ్ చేయొద్దంటే విన్నావుకావు. ఎందుకేనా మంచిది డ్రైవింగ్ లైసెన్స్ తీసుకొమ్మని ఎప్పట్నుంచో చెపుతున్నా పట్టించుకోనేలేదు" కోపగించుకుందామె భర్త మీద.

"డ్రైవింగ్ లైసెన్స్ కూడా లేదా? " తెల్లమొహం వేశాడా పోలీసాఫీసర్.

ఇంతలో వెనక సీట్లోని కొడుకు

తండ్రిని హెచ్చరించాడు, "ఫాదర్ మీరేం కంగారుపడక కారు స్టార్ట్ చేసేయండి. ఇందాక దార్లో ఆ బార్ ఓనర్ని కాల్చి పారేసినట్లే వీడినీ షూట్ చేసేస్తాను" అంటూ పిస్తోలు పైకి తీశాడు.

మరుక్షణం నిల్చున్నపళంగా మూర్ఛపోయాడా దిమ్మతిరిగిపోయిన పోలీసాఫీసర్.

—యం. ఊహ

## స్మైల్ ప్లీజ్!

అర్జంటుగా మా ఆవిడకు ఓ పాస్‌పోర్ట్ సైజ్ ఫొటో కావాల్సి వచ్చింది. మధ్యాహ్నం మూడు గంటల ప్రాంతంలో మా ఆవిడ జ్యోతిని తీసుకుని 'ఫ్లాష్ అండ్ ఫ్లాష్' లోకి అడుగు పెట్టాను.

గోడలమీద కొందరు నాలాంటి అనామకుల పాస్‌పోర్ట్ ఫొటోలు, శ్రమదానం



చేస్తున్న ముఖ్యమంత్రితోపాటు ఇతర సినీహీరోల 'బ్లో అప్'లు... అమ్మాయిల బారెడు పొడవు పూలజడల ఫొటోలు ఆ స్టూడియో ప్రతిభకు ప్రతీకల్లా కనిపించాయి. ఐశ్వర్యారాయ్‌ని అంత క్లోజప్‌లో ఫొటోతీసే అదృష్టం మా ఈ చిన్న టౌన్ లోని ఫొటోగ్రాఫర్‌కెలా దొరికిందా అన్న ఆశ్చర్యంతో కౌంటర్‌లో కూర్చున్న శాల్తీ వైపు చూశాను. వదులుగా వున్న టీ షర్ట్‌ను బాగా రంగువెలసిపోయిన జీన్‌ప్యాంట్‌లోకి టక్ చేసి పిల్లిగడ్డంతో, లావుపాటి కళ్లద్దాలతో దీక్షగా ఫెమినా, మేగజైన్‌ను తిరగేస్తున్న ఆ 'యంగ్‌మేన్'ను చూడగానే ఐయిశ్వర్యారాయ్ సంగతి అర్థమైన క్రియేటివ్ ఫెలో అనిపించాడు.

"మా ఆవిడకు పాస్‌పోర్ట్ సైజ్ ఫొటో కావాలి" అన్నాను కాస్త గట్టిగా.

"ప్లీజ్ కమిన్ మేడమ్" అంటూ 'అనుమతి లేనిదే లోపలికి రాకూడదు' అని బోర్డు పెట్టబడిన గదిలోకి దారితీశాడు. అతని వెనకే మేమిద్దరం కదిలాం. "మేడమ్ మీరు కాస్త తలదువ్వుకుని, పౌడర్ రాసుకుని ఫ్రెషప్ అవ్వండి" అంటూ మూలనున్న అద్దాన్ని, దాని పక్కనున్న పౌడర్ డబ్బాను చూపించాడు.

"వద్దులెండి. అంత అవసరంలేదు"





అంది మా ఆవిడ.

వెంటనే తెగ ఆశ్చర్యపోతున్నట్లు ఆవిడవైపు చూసి తరువాత నావైపు తిరిగాడు.

"ఇదేంటి సార్? మేడమ్ ఇలా అంటారు... మంచి ఫోటో కావాలనుకునే 'అభిరుచి' మనలో వుండాలి సార్. మీ ముఖం అందంగా ఫోటోలో కనబడితే మీమీద మీకు కాన్ఫిడెన్స్ పెరుగుతుంది. అసలు మన ఇండియన్స్‌లో చాలామందికి ఫోటోసెన్స్ లేదు సార్. కెమేరా ముందుకు రాగానే శవంలా బిగుసుకుపోవడం. కాస్త నవ్వితే తమ సొమ్మేదో పోతుందన్నంత భయంగా పోజు పెట్టడం. ఐ జస్ట్ డోంట్ లైకిట్. మీకు మీ ఫోటోమీద ఇంట్రస్ట్ లేకపోయినా, నాకు కనీసం నేను తీసే ఫోటో బాగారావాలన్న తపన వుంది. ఐ వాంట్ క్వాలిటీ... అందుకే మేడమ్ చెదరిన ఆ వెంట్రుకల్ని కాస్త దువ్వెనతో సరిచేసుకోండి. మొహంమీద చెమటను తుడుచుకుని పిసరంత పౌడరద్దండి. నో ఎక్స్ట్రా కాస్ట్ మేడమ్" అంటూ మా జ్యోతి అక్కడున్న దువ్వెనను అందుకునేదాకా వదల్లేదు.

తల దువ్వుకుంటూ నావైపు చూసింది. తన మొహం చాలా ప్రశాంతంగా వుంది. అది దేనికి సంకేతమో నాకు బాగా తెలుసు. పట్టరాని కోపాన్ని పళ్ళబిగువున దాచుకుంటోందన్న మాట.

ఆవిడ చూపుల్ని, నా ఆలోచనల అనాలిసిస్‌ని ఏ మాత్రం పట్టించుకోని, 'ఫోటో జీనియస్' కెమేరాని, కేబుల్స్‌ని సర్దుకుంటూ మళ్ళీ ఉపన్యాసం స్టార్ట్ చేశాడు.

"అసలు మన దేశంలో టాలెంట్‌కు స్థానం లేదు సర్. నా టాలెంట్‌ను ఎవరైనా డైరెక్టర్ గుర్తించినట్లయితే ఈపాటికి టాప్ సినిమాటోగ్రాఫర్ అయిపోయి, ఏ బంజారాహిల్స్‌లోనో, జుబ్లీహిల్స్‌లోనో సెటిలయిపోయుండేవాణ్ణి. ఏదేమైనా అంతా పాలిటిక్స్ సార్. సినిమాల్లో... రాజకీయాల్లో... క్రికెట్‌లో... ఎక్కడ చూసినా పాలిటిక్స్. ఈ దేశంలో మేధావులకు గుర్తింపు లేదు సార్"

"నేను రెడీ!" మా ఆవిడ అతని వాక్ప్రవాహాన్ని అడ్డుకుంది.

"ఓ. కె. మేడమ్" అంటూ ఆవిడని ఓ స్టూలుమీద కూర్చోబెట్టి అతను కెమేరా వెనక్కు వెళ్ళాడు.

"మేడమ్ కాస్త నవ్వండి... మరీ అంతకాదు"

"మేడమ్ కుడిభుజం కాస్త ముందుకు వచ్చేలా... అలా...ఎస్"

"మేడమ్ కళ్ళు మరీ శూన్యంగా పెట్టారు. కాస్త ఫీలింగ్స్ నింపండి" అంతకువరకు అతడి ప్రతి యిన్‌స్ట్రక్షన్‌ను పాటిస్తున్న జ్యోతి యిక నిగ్రహించుకోలేకపోయింది.

చర్రున లేచింది. "నేనేమైనా టీవీ సీరియల్‌లో యాక్ట్ చేయడానికో, పెళ్ళిచూపులకో ఫోటో పంపుతున్నాననుకున్నావా ఏంటి మిస్టర్? నాక్కావాల్సింది రేషన్‌కార్డ్‌మీద అతికించడానికి... ఓ పాస్‌పోర్ట్ సైజ్ ఫోటో" అరిచిందామె.

మర్నాడు సాయంత్రం జ్యోతి ఫ్లాష్ అండ్‌ఫ్లాష్ స్టూడియో కెళ్ళింది. అంత హంగామా చేసిన వాడు తీరా ఫోటో తీసే ముందు కెమేరాలో ఫిల్మ్‌లోడ్ చేయడం మరచిపోయాట్ట. మళ్ళీ తీస్తానంటున్నా వినకుండా పారిపోయొచ్చిందట జ్యోతి.

–పి. వెంకటరామిరెడ్డి



# చతుర

సంపుటి : 24   సంచిక : 4   మే 2001   280వ సంచిక

చాలాకాలం తర్వాత అతడా ఊరికి వచ్చాడు. అతను చెప్పిన వీధికి వచ్చాక రిక్షా అతను "ఏ కంపెనీకి వెళ్లాలిసార్?" అని అడిగాడు.

"కంపెనీయా?" అన్నాడతడు తెల్లబోతూ.

"అవున్సార్, ఇక్కడ చాలా కంపెనీలున్నాయి" చెప్పాడు రిక్షావాలా.

ఆమాట అతని చెవుల్లో ఏదో హోరును సృష్టించి భయంకర విస్ఫోటనాన్ని కలిగించి, గుండెలను కంపింపచేసిన కారణమేమిటి?

అటుపైన అతడేం చేశాడు? సమాజం అనధికారికంగా ఆమోదించిన ఆ కంపెనీలలో ఒక్కొక్క స్త్రీ వెనుక దాగివున్న కారణాలను అక్షరబద్ధంచేసిన...

గొర్రెపాటి నాగేశ్వరరావు

# మానిప్యూలు

ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

కానిస్టేబుల్ వీరాస్వామి అప్పుడే డ్యూటీ దిగాడు. తలమీంచి టోపీ తీసి టోపీని, లాఠీనీ కలిపి కుడి చంకలోకి దూర్చుకొని పోలీసుస్టేషన్ పాలీషు బండలమీద ఇనుప నాడాల బూట్లతో టకటకా శబ్దం చేస్తూ నడుస్తున్నాడు.

పోలీస్‌స్టేషన్ భవనం చాలా విశాలంగా వుంది. చెక్కలతో ప్రత్యేకించిన ఎస్సై గది దాటి రైటరు, హెడ్డూ కూర్చునే గదిలోకి వెళ్ళాడు వీరాస్వామి.

పది సంవత్సరాల క్రితం జరిగిన ఒక హత్యకేసులో హతుడిపేరు కావాలని జిల్లా పోలీస్ హెడ్‌క్వార్టర్సునుంచి వైర్‌లెస్ మెసేజి వస్తే, ఎస్.పి. దొరగారి ఆఫీస్‌కి సమాచారం పంపించే ప్రయత్నంలో వున్నాడు రైటరు!

వీరాస్వామి బూట్ల శబ్దానికి ఉలిక్కిపడి ఫైల్లోంచి తలెత్తి చూశాడు.

రికవరీ బంగారాన్ని కేసుకోసం కొంత కోర్టులో దాఖలుచేసేందుకూ, త్వరలో జరగ బోయే డి.ఎస్.పి. దొరగారి అమ్మాయి పెళ్ళికి ఆభరణాలు చేయించేందుకూ... బంగారాన్ని రెండు మూటలుగా కట్టి బల్ల మీద పెడుతున్న హెడ్డు కూడా అదే సమయంలో తలెత్తి చూశాడు వీరాస్వామిని.

"నేను వెళ్ళొస్తాను సార్!" అన్నాడు కానిస్టేబుల్ వీరాస్వామి.

"ఏంజల్ టాకీస్ దగ్గరికేనా?" అడిగాడు రైటరు నవ్వుతూ.

వీరాస్వామి సమాధానం చెప్పలేదు.

హెడ్డుకూడా కిసుక్కున నవ్వి, "దానిసిగతరగ! దాని ఆకర్షణ ఏంటోగానీ రిటైరు కాబోతోన్న నాకే తెగులు పుట్టిస్తోంది. కుర్రవాడివి. అందునా పెళ్ళికానివాడివి. ఇక నువ్వెందుకు ఆగుతావూ, దాన్ని చూడకుండా! వెళ్ళెళ్ళు... దూరంనుంచే దాని అందాలను కళ్ళతో చూడు. అంతకన్నా దానివల్ల ప్రయోజనంలేదు" అన్నాడు.

"ఏం? అది చిక్కేరకంకాదా?" అడిగాడు రైటరు మర్డరు కేసు ఫైలు బీరువాలో కుక్కుతూ.

"చిక్కే చిలకే ఐతే ఎప్పుడో పెట్టేవాడ్ని పంజరంలో. అది అలాంటిరకంకాదు. వట్టి కరోడాముండ. అయినాగానీ మనసు నిలవక దాన్నొకసారి కదిలించి చూశానుకూడా"

"ఏమన్నది సార్?" అడిగాడు కానిస్టేబుల్ వీరాస్వామి.

"మర్యాద తెలియని మకురు దున్న అది. నోరు తెరిచిందంటే బండబూతులు తప్ప మామూలు మాటలు రావు దాని నోటి వెంట. అదలా నోరు తెరవగానే నాకే అసహ్యం వేసిందంటే నమ్ము!"

రైటరూ, వీరాస్వామి కళ్ళు విప్పార్చారు.

"ఆరోజు దాన్ని అమర్యాదగా ఏమీ పిలవలేదు నేను. అందర్నీ పిలిచినట్టే 'ఒసేయ్' అని పిలిచాను. దానికే అది గయ్యిన లేచింది. చీర సహం మడిచి పిక్కలపైకి ఎగ్గట్టి బొడ్లో దోపుకుంటూ 'ఏందిరా! బొడ్డు కోసి నాకేమైనా పేరుపెట్టావా? పుస్తెగట్టి నాకేమైనా అన్నంపెట్టావా? పోలీసువైతే మాత్రం అంత కావరం పనికిరాదు. ఇంకోసారిలా ఒసేవ్ అన్నావంటే కూసాలు జార్తయ్యి జాగ్రత్త" అంది.

"ఎట్టా?" ఆశ్చర్యపోయాడు రైటరు.

"దాని రంకెలకు నలుగురూ పోగయ్యారు. కొంతమంది 'సెబ్బాష్' అన్నట్టు దానివైపు చూస్తుంటే, కొంతమంది నిజం పోలీసా! డ్రామా పోలీసా! అన్నట్టు నావైపు చూశారు. లా అండ్ ఆర్డర్ చెడిపోతుందని తల వంచుకొని వచ్చేశానుగానీ లేకపోతే దాని గోళ్ళలోకి గుండుసూదులు కొట్టేవాడ్ని. గొంతులో లాఠీ దూర్చేవాడ్ని. మూత్రం తాగించేవాడ్ని. దాని లంగాలోకి తొండల్ని వదలాలన్నంత కోపం వచ్చిందనుకో"

"ఆఫ్టాల్ ఒక సోడాలు అమ్మే ఆడది అంత అవమానం చేస్తే ఎందుకు వూరుకున్నారు సార్!" అన్నాడు వీరాస్వామి.

"చుట్టూరా జనం వుంటే అంతకన్నా ఏం





చేస్తాం. వాళ్ళతోటే మనకు చావొస్తుంది. ఏది జరిగినా ఈగల్లా అరక్షణంలో మూగుతుంటారు. అంతా పట్టిపట్టి చూస్తుంటారు. పైగా ప్రతి ఒక్క వెధవకూ రెండేసి కళ్ళు"

కొంచెంసేపు అక్కడ నిశ్శబ్దం పరచుకొంది. ఎవరూ ఏమీ మాట్లాకుండా ఎవరికి వాళ్ళు ఏదో ఆలోచనల్లో కూరుకొని పోయారు.

"సరే! ఇక నేను వెళ్ళొస్తాను సార్" అని వాళ్ళిద్దరికీ స్టిఫ్‌గా సెల్యూట్‌చేసి పోలీసు స్టేషన్లోంచి బైటికి వెళ్ళాడు వీరాస్వామి.

ఎస్సై ఇంకా స్టేషనుకు రాలేదు. జిల్లా హెడ్‌క్వార్టర్స్‌లో రేపు శుక్రవారం జరిగే క్రయిం మీటింగ్‌లో ఆఫీసర్లకు పిట్టమాంసంతో భోజనాలు పెట్టాలని నలుగురు కానిస్టేబుళ్ళనూ, రెండు ఎయిర్ గన్నులనూ వెంటపెట్టుకుని బుడకోళ్ళకోసం వూరి వెలుపలవున్న చెరువు దగ్గరికి వేటకు వెళ్ళాడు.

ఖాళీగా వున్న ఎస్సైగారి చెక్కలగది పక్కగుండా యథాప్రకారం ఇనప నాడాల బూట్లను పాలీషు బండలమీద టకటకలాడిస్తూ ముందుకు వెళ్ళాడు. వరండా మెట్లు దిగి కాంపౌండు వాల్‌మీదనుంచి రేకులు దింపిన సైకిలుస్టాండు దగ్గరికి వెళ్ళాడు. తన సైకిలు దగ్గర నిలబడి లాఠీని సైకిల్ ఫ్రేము అడ్డబద్దెకు వున్న రెండు క్లిప్పులలో ఇరికించి, టోపీని సైకిలు హేండిలుకున్న కారియర్లో పెట్టి తాళం తీశాడు.

అరనిముషంలో సైకిలును నడిపించుకుంటూ మెయిన్‌గేటు దగ్గరికి వెళ్ళాడు కానిస్టేబులు వీరాస్వామి.

గేటుదగ్గరి సెంట్రీ తన తుపాకీని గోడకు ఆనించి డిటెక్టివ్ నవల ఏదో చదువుతున్నవాడల్లా తల ఎత్తి వీరాస్వామిని చూసి పలకరింపుగా నవ్వాడు.

వీరాస్వామి కూడా అతడ్ని చూసి నవ్వుతూ, "నైట్ డ్యూటీనా?" అని అడిగాడు క్షణంసేపు ఆగుతూ.

"అవును నైటే" చెప్పాడు సెంట్రీ.

"నాగమ్మది కూడా నైట్ డ్యూటీయేనా?"

"ఆ..."

ఇద్దరూ పగలబడి నవ్వుకున్నారు.

లేడీ కానిస్టేబుల్ నాగమ్మకూ, సెంట్రీకి మధ్య సంబంధం వున్నట్టు నాగమ్మ భర్తకు అనుమానం. వాళ్ళిద్దరికీ ఒకేసారి నైట్‌డ్యూటీ పడితే అతగాడు కూడా భార్య వెంటే స్టేషనుకు వస్తాడు. సెంట్రీ ఎదురుగా వరండాలో చాప వేసుకొని పడుకుంటాడు. క్షణం కూడా నిద్రపోడు. తెల్లవార్లూ బీడీలు కాలుస్తూ సెంట్రీకి కాపలాగా వుంటుంటాడు.

"ఇంకనేం! మన నాగమ్మ మొగుడు నైట్ డ్యూటీ చేస్తాడు కదా... నువ్వు హాయిగా నిద్రపోవచ్చు" అని మళ్ళీ ఒక విడత నవ్వి అక్కడ్నుంచి కదిలాడు వీరాస్వామి. సైకిలు ఎక్కి మెయిన్ రోడ్డుగుండా ఏంజల్ టాకీస్ వైపుకు వెళ్తున్నాడు.

అసలే చలికాలం. త్వరగా చీకటి పడుతోంది. చలికి నరాలు జివ్వుమని లాగుతుంటే దారిలో కానిస్టేబులు వీరాస్వామికి ఎందుకోగానీ అనుకోకుండానే ఆ పిల్ల గుర్తొచ్చింది.

యాభై సంవత్సరాల వయసుదాటిన హెడ్డుకే అంత చాపల్యం పుట్టించిందంటే కొంచెం ఆశ్చర్యమే గానీ నేరేడును చూడగానే అలాంటి ఆశ్చర్యం, అనుమానం తొలగిపోక తప్పదు ఎవరికయినా.

'నేరేడు' అందం, అవయవాల పొందిక అలాంటిది మరి!

కానిస్టేబులు వీరాస్వామి సినిమాహాలు ఎదురుగా వున్న కిళ్ళీబంకు ముందు సైకిలు ఆపాడు. సైకిలుకు తాళంవేసి తాళం చెవిని చేత్తో పట్టుకుని మరో నాలుగు అడుగులు వేసి బంకు దగ్గరికి వెళ్ళాడు లాఠీ, టోపీతో సహా.

ఎవరో పది సంవత్సరాల వయసున్న కుర్రవాడు బంకులో కూర్చుని వ్యాపారం చేస్తున్నాడు. బంకు యజమాని శేషయ్య



కనిపించలేదు.

"అరేయ్... ఎవర్రా నువ్వు?" కుర్రవాడ్ని గద్దిస్తూ అడిగాడు కానిస్టేబులు వీరాస్వామి.

కుర్రవాడు కొంచెం బెదిరిపోయాడు వీరాస్వామి గద్దింపుకు. చేతిలో లాఠీ వుంది. పోలీసు టోపీ వుంది. గొంతులో గరుకుగా, కరుకుగా వినిపించే అధికారమూ వుంది.

"శేషయ్య మా అయ్యే... ఏం కావాలి సారూ?" అడిగాడు కుర్రవాడు.

"నీ పేరేందిరా?"

"అంజినీలు"

"ఎక్కడికి చచ్చాడ్రా... మీ అయ్య?"

"ఉచ్చొస్తే నన్ను కూకోపెట్టి లెగిసెళ్ళిండు"

"దూరంగా నన్ను చూసే వాడికి ఉచ్చొచ్చిందేంటిరా? కంతిరీ లంజాకొడుకుల్లార! మామూళ్ళు ఎగనూకాలని వుచ్చలకీ, దొడ్డికీ పోతేమాత్రం ఎట్లా తప్పించుకుంటారో నేనూ చూస్తాను" అని కానిస్టేబులు వీరాస్వామి తన చేతిలో వున్న లాఠీతో ఓ సీసామీద కొట్టబోయినవాడల్లా ఎందుకో ఆగి,

"పోలీసోళ్ళు వస్తే మర్యాద ఇయ్యాలని చెప్పలేదంటరా మీ అయ్య నీకు?" అని అడిగాడు లాఠీని గాలిలోనే వుంచి కదలకుండా చూస్తూ.

సరిగ్గా అప్పుడే ప్యాంటు గుండీలు పెట్టుకుంటూ దూరంనుంచి పరుగెత్తుకుని వచ్చాడు షాపు యజమాని శేషయ్య.

ఎడమచేతిలో చివరి గుండీ బిగిస్తూ కుడి చెయ్యి ఎత్తి "నమస్తే సార్" అన్నాడు.

"ఎక్కడికి వెళ్ళావురా?" కోపంగా అడిగాడు వీరాస్వామి.

"ఒంటేలుకు వెళ్ళాను సారూ"

"నిజంగానా?" సూది కళ్ళతో చూశాడు.

"నిజం సారూ. మీకు అబద్ధం చెప్తానా?"

కిసుక్కున నవ్వాడు వీరాస్వామి. "నిజం సారూ అని నువ్వు అంటే నాకొక విషయం గుర్తొచ్చిందిరా శేషయ్యా! నేనీ స్టేషన్లో వుద్యోగంలో చేరిన రెండో రోజే డి.ఎస్.పి. దొరగారి ఇంట్లో దొంగలుపడ్డారు"

"దొరగారి ఇంట్లోనే...?" ఆశ్చర్యపోయాడు శేషయ్య.

"అవును మరి! అందుకే ఆ కేసు మా డిపార్ట్మెంట్ కే ప్రిస్టేజి క్వశ్చనైంది. కానిస్టేబుళ్ళూ, దొరగారూ దొంగలకోసం తిరుగుతుంటే దొరగారి భార్యగారు అన్నం, నీళ్ళూ మానుకుని పూజ గదిలో దొరగారికి దొంగలు దొరకాలంటూ అమ్మవారి విగ్రహంముందు కూర్చుని ఒకటే ఏడుపు"

"ఇంతకూ దొంగలు ఏం దోచుకునిపోయారూ?"

"దొరసానిగారు అపురూపంగా చూసుకునే పచ్చల నెక్లేసు. పోనీ... దొంగలు దొరక్కపోయినా బంగారం కొట్లమీదపడి దొంగబంగారం కొన్నట్టు ఫిర్యాదొచ్చిందని బెదిరించి ఒకటికాదు, రెండు నెక్లేసులు తెచ్చిస్తామన్నా దొరసానిగారు ఒప్పుకుంటేనా? ఠాట్... కాదన్నది. పోయిన నెక్లేసే కావాలన్నది. ఎంతమంది బతిమాలినా అమ్మవారి విగ్రహాన్నొదలి బైటికొస్తేనా. ఊహూ... చివరికి ప్రాసిక్యూటరుగారి భార్యగారొచ్చి బతిమాలితే కూడా మాట వినలేదు.

దొరసానిగారు అలా అన్నం, నీళ్ళూ మాని వుగ్గబట్టి ఏడుస్తూ చిక్కి సగమైపోతోంటే డి.ఎస్.పి. దొరగారు కూడా దిగులు పడ్డారు. దొంగలకోసం గాలింపు చర్యలు ఎక్కువచేసినా ఆ దొంగచచ్చినోళ్ళు దొరికిచావలేదు. నెక్లేస్ ఆచూకీ తెలీలేదు"

"తర్వాత?" అడిగాడు శేషయ్య.

"ఎ.సి.బి. డి.ఎస్పీ, దొరగారి, దొరసానిగారు వచ్చి మా దొరసానిగార్ని ఒక గంటసేపు బతిమాలితే మా దొరసానిగారు అసలు విషయం అప్పుడు చెప్పారు.

"యావనీ?"

"ఆమెకు అది సెంటిమెంటంట. దొరగారితో దొరసానిగారికి పెళ్ళయిన మొదటినెలలో వచ్చిన పై సంపాదనతో కొని ఇచ్చారుట ఆ నెక్లేస్. కలిసొచ్చింది కాబట్టి అదే




కావాలని మళ్ళీ మారాం చేసింది దొరసాని గారు.

ఎ.సి.బి. డిఎస్పీ దొరగారి దొరసానిగారు కూడా మా దొరసానిగారి సెంటిమెంట్‌కు అమితంగా బాధపడ్డారు. మా దొరగారినే మందలించారు"

"దొరగారినే మందలించారా?"

"ఆ... ఆ లెవెల్లో మనుషులు అంతేమరి. ఎవరినీ లెక్కచెయ్యరు. "జైలునుంచి పారి పోయిన ఛార్లెస్ శోభరాజంతటివాడినే పట్టుకొన్న మీ డిపార్ట్‌మెంట్‌కు నెక్లేస్ దొంగను పట్టుకోవడం ఒక లెఖ్ఖా? మీరు ఏమైనా చెయ్యండి. వారం తిరిగేసరికల్లా పోయిన నెక్లేస్ మీ భార్య మెడలో చూడాలి నేను. అలా జరగలేదంటే మీ విషయం మా వారితో చెబుతాను. ఇక మీ ఇష్టం" అని మా దొరగారిని వాయించేసింది.

అప్పుడు నా దురదృష్టం కొద్దీ నేను అక్కడే వున్నాను. దొరగారు ఆ దొరసాని గారి వాయింపుకు బెంబేలు పడుతూ నావైపు జాలిగా చూశారు. అలా చూస్తూ చూస్తూ వున్నట్టుండి 'అమ్మ నాకొడకా' అంటూ నామీద వారు విరుచుకునిపడి నా చొక్కా కాలరు పట్టుకున్నారు.

"అదేమిటీ? మీరేం చేశారని పాపం?"

"ఏంటనుకుంటున్నావూ? అదే మరి పోలీస్ డిపార్ట్‌మెంటంటే. అందరినీ అను మానించాలి. అనుమానం పూర్తిగా నివృత్తి అయ్యాకనే వాళ్ళు దోషులుకారన్న నిర్ణయా నికి రావాలి. అందుకే డిఎస్పీ దొరగారలా అనుమానించి నన్ను కాలరు పట్టుకున్నారు" చెప్పాడు కానిస్టేబుల్ వీరాస్వామి గర్వంగా.

"అందరినీ అనుమానించాలన్నది ఎంత ప్రథమ సూత్రమయినా కానిస్టేబులునా అనుమానించేది?"

"అందులో దొరగారి తప్పేమీలేదు. ఆ రోజు నేను డ్యూటీలో చేరగానే మర్యాద కోసం దొరవారి ఇంటికి వెళ్ళి దండం పె ట్టాను. ఆరోజు ఆర్డర్లీకి జ్వరమట. డ్యూటీకి రాకపోతే దొరసాని మల్లెపువ్వులకోసం నన్ను బజారుకు పంపించింది. పూలూ, నాలుగు యాపిల్ పండ్లూ పట్టుకొని వెళ్ళాను. దొరసానికి స్వయంగా ఇచ్చాను. ఎంత నిగ్రహించుకోవాలనుకున్నా నా దృష్టి దొరసాని నెక్లేస్‌మీదనుంచి చాలాసేపు మర లలేదు. దొరగారు అంతా గమనిస్తూనే వున్నారు. ఆ మరుసటిరోజే దొంగలుపడి నెక్లేస్ దొంగలించడంతో దొరగారికి నామీద అనుమానం వచ్చింది. పోలీసే దొంగ! అనిన్నూ, లేకపోతే తెలిసిన దొంగలను నేనాపనికి పురమాయించి దొరసానిగారి నెక్లేస్ దొంగిలింపించానా? అనిన్నూ..."

"మరి దొరగారి అనుమానం ఎలా తీరిపో యింది?" అని చాలా ఉత్సాహంగా అడి గాడు శేషయ్య.

కానిస్టేబులు వీరాస్వామి వెంటనే సమా ధానం చెప్పలేదు. శేషయ్యవైపు ఓరగా చూస్తూ, "ఇద్దరికీ రెండు టీలు చెప్పు. మనం తాగుతూ మాట్లాడుకుందాం" అన్నాడు ఎటో చూస్తూ.

శేషయ్య తన బీడీ బంకు పక్కనే వున్న టీస్టాలు వైపు చూస్తూ, "రెండు టీ..." అని అరిచాడు పెద్దగా.

రెండు నిమిషాలలో ఎవరో చిన్నకుర్రాడు యినపరేకులతో తయారుచేసిన ట్రేలో రెండు గ్లాసులలో టీ, మంచినీళ్ళూ తెచ్చాడు.

శేషయ్య ట్రేలోంచి మంచినీళ్ళ గ్లాసు తీసి వీరాస్వామి చేతికి అందించాడు. అతను నీళ్ళతో పుక్కిలించి వుమ్మేసి మిగిలిననీళ్ళు తాగగానే ఖాళీ గ్లాసు అందుకుని ట్రేలోపెట్టి టీ గ్లాసు అందించాడు. తనూ టీ గ్లాసు అందుకున్నాడు. ఇద్దరూ నెమ్మదిగా టీ చప్పరిస్తున్నారు.

"ఇప్పుడు చెప్పండి సారూ... దొరగారికి మీమీద అనుమానం...?"

"ఎలా తీరింది అంటావుకదా?" అని మధ్యలోనే అందుకున్నాడు కానిస్టేబులు



వీరాస్వామి. "ఎలా తీరిందంటే మా సి.ఐ. దొరగారు దొంగలకోసం తిరిగీ తిరిగీ ఆరోజు అలసిపోయి ఇంటికి వెళ్ళారు. స్నానంచేసి అన్నంతిని దొరగారింట్లో పచ్చల నెక్లేస్ కాజేసిన దొంగలను గురించే ఆలో చిస్తూ పడుకున్నారు. దొరసానిగారు రోజూ కన్నా ఎక్కువగా గారాలుపోతూ దొరగారిని ఒకే ఒక్కకోరిక కోరిందట 'గూనోడి' జోలికి వెళ్ళొద్దని.

"గూనోడంటే... ఎవరూ?" ఖాళీ గ్లాసు లను ట్రేలో పెడుతూ అడిగాడు శేషయ్య.

"వాడొక పేరుమోసిన గజదొంగ"

"వాడికీ, సి.ఐ. దొరగారి దొరసానికీ ఏంటి సంబంధం?"

"అదంతా ఓ పెద్దకథ..."

"చెప్పండి సారూ?" బతిమాలే ధోరణిలో చూశాడు శేషయ్య. కానిస్టేబులు వీరా స్వామి ఇంకా అక్కడే నిల్చున్న టీస్టాలు కుర్రాడ్ని చూసి అదే విసురులో శేషయ్యవై పుకు తిరిగాడు. "ఆ కుర్రాడికి నువ్వు డబ్బు లిచ్చి పంపించు. లేకపోతే బాగుండదు. పోలీసోళ్లందరూ స్టాలుమీద పడి వుద్దెరగా టీ తాగి పోతున్నారని ప్రచారం చేస్తారు. వాడికి డబ్బులిచ్చి పంపించాక గూనోడి విషయం చెబుతాను" అన్నాడు.

శేషయ్య బీడీ బంకు గల్లాలోనుంచి చిల్లర డబ్బులు తీసి కుర్రాడికి ఇచ్చి పంపించాడు. ఆసక్తిగా వీరాస్వామి వైపు చూశాడు.

"గూనోడికీ దొరసానికీ ఏమిటి సంబంధం అని అడిగావుకదూ? అక్కడికే వస్తున్నాను" అని టోపీని ఒకసారి దులిపి చంకలో పెట్టుకుని "చెప్పానుకదా, గూనోడు గొప్పదొంగ అని. వాడు గుడ్లురిమి చూస్తే చాలు... గోడవున్న తాళాలు పగిలిపో తాయి. చేత్తో తాకితేచాలు బ్యాంకు తలు పులు బద్దలవుతాయి. అందుకే మేమం దరం వాడ్ని ముద్దుగా 'గూనోడు' అని పిలుస్తుంటాం. గూనోడుగనక.

"శేషయ్యా! నిజం చెప్పాలంటే నిజాయి తీలో కూడా గూనోడే మేలయినవాడు. ఆర్డర్లీ దగ్గర్నుంచి అధికారులదాకా ఎప్పుడు ఎవరికి బంగారం కావాలన్నా గూనోడితో ఒక్కమాట చెబితేచాలు, రాత్రికి రాత్రే ఎక్కడో కన్నం వేస్తాడు. చిక్కినంత బంగారం తెస్తాడు. తన అవసరాలకు కొంత ఉంచుకొని మిగిలిందంతా మాకే యిచ్చేస్తుంటాడు.

అలాంటి లావాదేవీలవల్లనే వాడు దొరసా నికి కూడా బాగా పరిచయం అయ్యాడు. ఆ పరిచయంతోనే గంటక్రితం సి.ఐ. దొరగారి దొరసానిగారి దగ్గరికి వచ్చి తాగిన మైకంలో తెలియక డి.ఎస్.పి. దొరగారి ఇంట్లో దూరి దొరసాని పచ్చల నెక్లెస్ కాజేశానని, పొద్దున్నే పేపరు చూస్తే అప్పుడు విషయం తెలిసిందనీ వాపోయాట్ట.

పైగా ఏ ఇల్లు ఎవరిదో కూడా తెలియ కుండా యీ వెధవ కరెంటుకోత ఒకటని విసుక్కున్నాడట కూడా. డి.ఎస్.పి. దొరగా రికి తెలిస్తే గుల్లబారకొడతారని భయంతో వాడు సి.ఐ. దొరగారి దొరసానిగారి దగ్గర తన గోడు వెళ్ళబోసుకున్నాడట"

"తర్వాత ఏమైంది?"

"అసలే అసలు దొరసాని పచ్చల నెక్లేస్‌కోసం అన్నం, నీళ్ళూ అంటకుండా పూజగదిలో అమ్మవారి పాదాల దగ్గరే కూర్చున్నది కదా, అదొక బాధ... ఎ.సి.బి. డిఎస్పీ దొరగారి దొరసానిగారు బెదిరించి వెళ్ళింది మరొకబాధా... అలా బాధలతో సతమతమవుతున్న అసలుదొరగారికి ఫోన్ చేసి జరిగింది చెప్పారు సి.ఐ. దొరగారు.

వారిప్రాణం అప్పుడు కుదుటపడింది. గూనోడిని కొట్టననీ, అర్జంటుగా నెక్లెస్ తెచ్చి యిచ్చి దొరసానిగారి చాత నిమ్మకాయనీళ్ళు తాగించి నిరాహారదీక్ష విరమించేట్టు చెయ్య వలసిందిగానూ గూనోడికి తన మాటగా చెప్పమని అసలు దొరగారు రెండో దొరగా రికి చెప్పారు. వారు ఆ విషయాన్ని తన దొరసానికి చెబితే, దొరసాని ఆ విషయాన్ని





గూనోడికి చేరవేసింది"

"అబ్బా... చాలా కథ నడిచిందే? "

"దీనికే అంత ఆశ్చర్యం ఎందుకూ? అసలుకథ ముందుంది. గూనోడు ఏం చేశాడో తెలుసా? "

మరికొంచెం ముందుకు జరిగి చెవులు రిక్కించాడు శేషయ్య.

"ఒక సిగరెట్టు కొడితే తాగుతూ చెప్తాను"

శేషయ్య నూగుబీడీలు, గొట్టాల్లూ, చాక్లెట్లూ వున్న సీసాలమీద నుంచి బంకులోకి వొంగి చార్మినార్ సిగరెట్టొకటి తీసి ఇవ్వబోయాడు.

కానిస్టేబులు వీరాస్వామికి ఒళ్ళంతా కంపరం ఎత్తింది. కోపంగా శేషయ్యవైపు చూస్తూ "నేనేం తెల్లవాడికాలంలో వుద్యోగంలో చేరిన పోలీసును కాదు. బీడీలకు, చార్మినారు సిగరెట్లకూ చేతులు చాచేందుకు. నోరు మూసుకుని గోల్డ్ కింగొకటి ఇవ్వు" అని గద్దించాడు.

శేషయ్య చేతిలో వున్న సిగరెట్లను బంకులో పెట్టి గోల్డ్‌కింగ్ సిగరెట్టు ఒకటి తీసి వీరాస్వామి చేతిలో పెట్టాడు.

"అగ్గిపెట్టె ఏదిరా? "

అగ్గిపెట్టె యిచ్చాడు శేషయ్య.

సిగరెట్టు వెలిగించి గట్టిగా ఓ దమ్ములాగి "ఏం చేశాడంటే అసలు దొరగారు చెప్పినా ఇంకొకడు చెప్పినా పోలీసు మాటలు నమ్మనన్నాడు. అసలు దొరగారు సి.ఐ. దొరగారి దొరసానిగారి దగ్గరికి వచ్చి గూనోడ్ని కొట్టనని మూడుసింహాలమీద ప్రమాణం చేస్తే పచ్చలనెక్లెస్ ఎక్కడ వుందో అప్పుడు చెబుతానని కబురుచేశాడు"

"మరి డిఎస్పీ దొరగారలా ప్రమాణం చేశారా? "

"అంత తెలికేంకాదు దొరగారంటే. డిఎస్పీ అనుకున్నావా, మజాకనుకున్నావా? వారెందుకు వెళ్తారూ"

"వెళ్ళకపోతే గూనోడు వూరుకున్నాడా? "

"వాడిముఖం. వాడు పోలీసులకు పత్తా దొరక్కుండా ఎక్కడో దాక్కున్నాడు. పచ్చల నెక్లెస్ గూనోడి ఇంట్లోనే వుంటుందని దొరగారు మమ్మల్ని పంపిస్తే వాడి ఇంటిమీద రైడ్‌చేశాం. అంగుళం అంగుళం గాలించాం".

"దొరికిందా? "

"ఏంటి దొరికేది? వాడు రాసిపెట్టిన వుత్తరం దొరికింది. చెప్పినట్టు చెయ్యకపోతే దొరసానిగారి నెక్లెస్‌తో సహా రాష్ట్రం విడిచి పెట్టి వెళ్ళిపోతానని అందులో రాశాడు. పైగా టైం కూడా ఇరవై నాలుగు గంటలే పెట్టాడు"

"అప్పుడయినా దొరగారు ప్రమాణం చేశారా? "

"అంత తెలికేంకాదు దొరగారంటే. వారు సి.ఐ. దొరగారినే తమ బంగళాకు పిలిపించారు. అప్పుడు చేశారు ప్రమాణం. ఆ తరువాత ఒక గంటకే కనిపించాడు గూనోడు. నెక్లెస్ ఏదిరా అంటే పోలీసులకు దొరక్కుండా సి.ఐ. గారింట్లో ఫ్లవర్‌వాజులో పెట్టానని చెప్పాడు. అందరమూ కలిసి సి.ఐ.గారి ఇంటికి వెళ్ళాం. ఫ్లవరువాజులోంచి నెక్లెస్ తీసి అదే జీపులో తెచ్చి అసలు దొరసానిగారికి యిస్తే ఆవిడగారు అప్పుడు విడిచిపెట్టారు అమ్మవారి పాదాలను. పూజగదిలోనుంచి బయటకు వచ్చి అప్పుడు ఎంగిలిపడ్డారు" చెప్పాడు వీరాస్వామి.

"మరి అలా మూడుసింహాలమీద ప్రమాణం చేసిన దొరగారు మాటకు కట్టుబడి వున్నారా? గూనోడ్ని కొట్టారా? "

"డిఎస్పీ దొరగారంటే మజాకాకాదు. మాటమీదే నిలబడ్డారు. గూనోడ్ని ఒక్క దెబ్బకూడా కొట్టలేదు గానీ వాడు చెయ్యని మరో కేసులో ఇరికించి వాడ్ని రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపించారు" అని కానిస్టేబుల్ వీరాస్వామి తల ఎత్తి సినిమాహాలు వైపు చూశాడు.

అప్పుడే బెల్లు మోగింది.

'ఒక మొగుడు ముగ్గురుపెళ్ళాలు' చిత్రం



# ఏరిన ముత్యాలు

★ ప్రణాళిక లేని కార్యక్రమం ప్రయోజన శూన్యమైనది. కార్యనిర్వహణలేని ప్రణాళిక ఉత్పత్తి శూన్యమైనది.

–స్వామి చిన్మయానంద

★ మీకు కష్టాలు వచ్చినప్పుడు హిమాలయంలా స్థిరంగా నిలబడండి. ఇతరుల కష్టాలకు గంగలా కరిగి ప్రవహించండి.

–శామ్యూల్‌జాన్‌సన్

★ సిద్ధాంత బలంగల ప్రతి పనీ అవహేళన, ప్రతిఘటన, ఆమోదం వంటి మూడు దశలగుండా పయనించాల్సిందే.

–వివేకానంద

★ అష్టమదాలకు మించిన మదం విద్యామదం. అవి అంతరిస్తేనే ఆత్మతత్త్వం అలవడుతుంది.

–బెర్నార్డ్‌షా

★ విషాయాన్ని హృదయస్థం చేసుకోవాలి. కంఠస్థం చేసుకుంటే చాలదు.

–ల్లాయిడ్ జార్జ్

★ చదువు రెండు రకాలు. ఒకటి బతకడం నేర్పేది. మరొకటి బతుకంటే ఏమిటో తెలిపేది.

– జేమ్స్‌ఎలెన్

★ నీచులకు అదృష్టం అబ్బితే గర్వంతో ప్రపంచాన్నే హీనంగా చూస్తారు.

–ప్లూటార్క్

★ ఉత్తమ గ్రంథాలు పిత్రార్జితములాంటివి.

–నార్ల

★ తన వ్యక్తిత్వాన్ని కోల్పోయిన వ్యక్తికి మిగిలేదేమీ ఉండదు.

–బాబా ఆమ్టే

★ అహంవల్ల ఏర్పడే అంధకారం అసలు చీకటికంటే ఎంతో దట్టమైనది.

–గాంధీజీ

★ ఏ పరిస్థితుల్లో వున్నా నీ కర్తవ్యం నీకు గుర్తుంటే జరగవలసిన పనులవే జరిగిపోతుంటాయి.

–వివేకానంద

★ వదంతులు వినవద్దు. ఒకవేళ వినవలసివస్తే వాటిని నమ్మవద్దు.

–జాన్.ఎఫ్.కెనడి

★ సంసిద్ధంగా వుంటే సగం యుద్ధం సాగించినట్లే.

–పీలే

★ మానవుని జీవితంలో బాహ్యంగా ధర్మం, ఆంతరంగికంగా జ్ఞానం ఆవశ్యకం.

–రవీంద్రనాథ్‌ఠాగూర్

★ లోక వ్యవహారాలను ధర్మబద్ధంగా నిర్వహించగలవాడు నాయకుడు.

–చర్చిల్

సేకరణ: పి.వి.రమణకుమార్

ఆడుతోంది ఆ హాలులో.

ఏంజల్ టాకీస్ దగ్గరకూడా జనం టిక్కెట్లకోసం బారులుతీరి నిలబడ్డారు. టిక్కెట్టు దొరక్కపోతే అదృష్టం చెయ్యిజారిపోతుందన్నంతగా ఒకళ్ళనొకళ్ళు తోసుకుంటున్నారు. ఆ తొక్కిసలాటలో అంతా గందరగోళంగా వుంది.

కానిస్టేబులు వీరాస్వామి అదేం పట్టించుకోలేదు. అతడి మనసంతా నేరేడు దగ్గరుంది. అక్కడికే బయలుదేరాడు.



నేరేడు అసలుపేరు నీలవేణి. ఎవరో 'నేరేడు' అన్న ముద్దుపేరు పెడితే ఆ పేరే స్థిరపడిపోయింది.

నేరేడు ఇంటర్‌దాకా చదివింది. ఆ తరువాత చదువుకు స్వస్తిచెప్పి సోడాలు అమ్ముతూ కుటుంబాన్ని పోషిస్తోంది. ఆమెకు తండ్రిలేడు. తనకు జన్మనిచ్చిన తల్లికి కూడా తనే ఆధారమైంది. తనకూ వయసు వచ్చిందనీ, వివాహం చేసుకుని వెళ్ళిపోవాలనీ ఎన్నడూ అనుకోలేదు.

అనుక్షణం అమ్మను గురించిన ఆలోచనలే ఆమెకు! అమ్మను సుఖపెట్టాలి... అంతే!

నేరేడు వయసు ఇరవై సంవత్సరాలు. నలుపురంగే అయినా ఆ నలుపులో ఏదో మెరుపు వుంది. అది కేవలం యౌవనంవల్ల వచ్చిందికాదు. కొంతమంది ఆడవాళ్ళు నల్లగా వుంటే మరీ బాగుంటారు.

నియాన్ లైటు కాంతిలో నేరేడు మంచు రజనుల్లో వికసించిన నల్లకలువలా మెరుస్తోంటే కానిస్టేబులు వీరాస్వామి కొంచెంసేపు అలా గుడ్లప్పగించి చూస్తూ నిల్చున్నాడు శిలా ప్రతిమలా.

వీరాస్వామి పడుతున్న అవస్థకు తనలో తానే గుంభనంగా నవ్వుకుంటూ "సోడా కొట్టేదా? " అని అడిగింది నేరేడు.

"నేరేడూ! గొంతు ఆరిపోతోందో, లేదో గానీ మొత్తానికి చలిగా వున్నమాట మటుకు నిజం. ఈ కాలంలో చలి తీరాలంటే కావాల్సింది సోడాకాదు. సోయగాలు పోయే అందమైన ఆడపిల్ల"

"అట్టాగా! అట్టాగయితే అర్జంటుగా ఎవర్నయినా చూసి పెళ్ళిచేసుకో. చలి, బులపాటం రెండూ తీర్తాయి"

"ఎవరో ఎందుకూ? నాకు నువ్వంటే ఇష్టం" అన్నాడు వీరాస్వామి కొంటెగా నేరేడు వైపు చూస్తూ.

నేరేడు కొంచెంసేపు ఆలోచించింది. "అయితే నువ్వు నన్ను పెళ్ళి చేసుకుంటావా? ముహూర్తం చూసి అందరి ముందూ పుస్తెగట్టి ఏలుకుంటావా? నువ్వు పోలీసోడివి. దాష్టీకంతో చలాయించుకునేవాడివి. నెలనెలా జీతం, రోజూ పై సంపాదనా కలిగినోడివి. అధికారం చలాయిస్తూ అందర్లోకీ దర్జాగా బతికేవాడివి. అట్టాంటి నువ్వు సినిమాహాలు దగ్గర సోడాలు అమ్మే నన్ను మనువాడతావా వీరాస్వామీ? నన్ను మనువాడినా అమ్మను విడిచిపెట్టి నేనుండను. నన్నూ, అమ్మనూ పోషిస్తావా వీరాసామీ? "

"కలిసి వుండాలంటే పెళ్ళే చేసుకోవాలా? " అని అడిగాడు వీరాస్వామి వంకరగా నవ్వుతూ.



"అంటే? " నొసలు చిట్లించి అడిగింది నేరేడు.

"నేను నిన్ను ఉంచుకుంటాను..."

"నన్నే పెళ్లి చేసుకొని, పెళ్లి చేసుకోబోయే మరోదాన్నే వుంచుకోరాదూ"

కానిస్టేబులు వీరాస్వామికి కోపం నషాళానికి అంటింది. చేతిలోవున్న లాఠీతో సోడా బండి చక్రాలమీద బలంగా కొట్టి ఇంకా కక్ష తీరక "ఒసేయ్ నేరేడూ! మగాడ్ని గనుక దిక్కులేని దానివని నిన్ను చేరదియ్యాలని అనుకొన్నానుగానీ, నాకు దిక్కులేక కాదు. నన్ను పెళ్లి చేసుకోవాలంటే నువ్వు వెయ్యి జన్మలెత్తాలి. సోడాలు అమ్ముతూ బతికే నువ్వెక్కడ? పోలీసు వుద్యోగిని నేనెక్కడ? ! నీకూ నాకూ నక్కకూ నాకలోకానికీ వున్నంత తేడా వుంది. ఏదో మనసులో వున్న కోర్కెను చెప్పానుగానీ నిన్ను పెళ్లి చేసుకొనేంత వెధవనుకాను. నీకే అంత కావరం అయితే, ఇక మొలతాడు కట్టిన మగాడ్ని నాకెంత కావరం వుండాలే పొగరుమోతు లంజా" అన్నాడు నిలువెల్లా కంపించిపోతూ.

"చాల్లే ఇంక చెప్పవాకు నీ మగతనం గురించి. మొలతాడు కట్టిన ప్రతివాడూ నిఖార్సయిన మగాడే అయితే మొలతాళ్లు అమ్మేటి దాసరోళ్లు మగాళ్లకే మగాళ్లు కావాలి మరి. అంతోటి మగాడివి మరి ఆడదే పుస్తెగట్టమంటే ఆడంగి నాయాల్లా ఎందుకని నీళ్లు నములుతూ నిల్చున్నావ్? చాటుగా పాలు తాగి వెళ్లే దొంగపిల్లిలా నన్నుంచుకొని రాత్రిళ్లు మాత్రం నాతో జత కడతానని ఎందుకు కూశావ్? గిట్టలతో నేలను గీరుతూ ఏదైనా ఆవు దగ్గరికి రాగానే తోక ముడిచి పారెళ్లే కొజ్జా ఎద్దుకూ నీకూ తేడా ఏంటిరా యధవ నాయాలా" అంటూ దుమ్మెత్తి పోసింది నేరేడు.

వీరాస్వామి కంగుతిన్నాడు. నేరేడు నోరు మంచిది కాదని హెడ్డు చెప్పినా వినకుండా అలా వాగినందుకు తననుతానే నిందించుకొని "నువ్వు ఏమంటావో అని అలా అడిగానుగానీ నిజంగా అలా ఎందుకు అంటాను నేరేడూ! బాగా బేరం చేసుకో. అమ్మని బాగా చూసుకో. ఎవరైనా నీ జోలికి వస్తే కాకితో కబురెట్టు. ఈ కానిస్టేబులు వాల్తాడు. నీకు అన్నింటికీ నేనున్నాను ఫో!" అని "ఒక సోడా కొట్టివ్వు" అని అడిగాడు స్వరం పూర్తిగా తగ్గించి.

నేరేడుకు ఎలా గుణపాఠం చెప్పాలా? అని ఆలోచిస్తున్నాడు మనసులోనే!

★ ★ ★

సాయంసంధ్య! ఆకాశంలో వెండి మబ్బులూ, నీలిమబ్బులూ కలసి దొంగాట ఆడుతున్నాయి. వెండి మబ్బులను నీలి మబ్బులూ నీలి మబ్బుల్ని వెండి మబ్బులూ మార్చిమార్చి ఆక్రమించుకొని బందీలుగా చేస్తూంటే ప్రకృతి కాంతిమంతమవుతూ అంతలోనే మెరుపును కోల్పోయింది.

రికార్డు డ్యాన్సర్ల వీధిలోనుంచి నెలకో వంద రూపాయల అద్దెకు లభించిన పాడుబడిన ఓ మట్టి మిద్దెలోని ఓ ఇరుకు గది అది. గది మధ్యలో నూనె దీపం మందంగా వెలుగుతూ ఎరుపూ, నలుపూ కలగలిసిన కాంతిని ప్రసరిస్తోంది.

పేడతో అలికిన మట్టి గోడలు క్రమంగా శిథిలమవుతూ పెచ్చులు వూడిపోయి ఎప్పుడైనా కూలి పడిపోయేందుకు సిద్ధంగా వున్నాయి. గోడలకు పడిన కంతలలోనుంచి బలిసిన ఎలుకలు కొన్ని ఘర్షణ పడుతూ కిచకిచా అరుస్తూ బయటకు దూకి పారిపోతున్నాయి.

ఒక మూల ఇంకా రాజుకోని కట్టెల పొయ్యీ... దాని పక్కనే వంట చెరకు చిదుగులూ, వెదురు బొంగు ముక్కను దండెంగా వేలాడగట్టి దానిమీద వేసిన రెండో మూడో చిరుగుల పాత చీరలూ, జాకెట్లూ... వాటి పక్కనే పాపాయి పొత్తి గుడ్డలూ.

ఓ చాటలో గుప్పెడు బియ్యం, పొయ్యీ చిదుగులూ, అవి రాజేసేందుకు అగ్గిపుల్లా

అన్నం వండేందుకొక జర్మన్ సిల్వర్ గిన్నె, బియ్యం కడిగి ఎసరుపెట్టి పొయ్యిమీద వండేందుకు కుండనిండా నీళ్లు.

అన్నం వండుకొని ముంతలో ఇంకా వున్న చింతకాయ తొక్కు కలుపుకొని కడుపునిండా అన్నం తినొచ్చు

"ఈ పూటకు అన్నం వుంది" అన్న ధైర్యంతో హాయిగా శ్వాసపీల్చుకొంది రోజా. బియ్యం కడిగి పొయ్యిమీద పెట్టి చిదుగులతో పొయ్యి అంటించాలని వెళ్లింది.

సరిగ్గా అప్పుడే గుడ్డ ఉయ్యాలలో పడుకొని కలత నిదుర పోతోన్న పాపాయి వులిక్కిపడి లేచి ఏడుపు లంకించుకొంది.

రోజా గుండె ఝల్లుమంది.

పాపాయి ఇందాకనే తన గుండెను కుమ్మి కుమ్మి స్తనాలను పీల్చుకొని ఎంతో ప్రయాసతో లేత పెదాలు తడుపుకొంది. దాహమైతే తీరివుంటుందేమోగానీ కడుపు మాత్రం నిండి వుండదు.

పొయ్యిలో దూర్చి వెలిగించేందుకు తుంపిన చిదుగులను అక్కడే విసరికొట్టి పాపాయి దగ్గరికి పరుగు తీసింది రోజా. ఉయ్యాలగా కట్టిన పాతచీర వత్తిడి తగిలి చినిగిపోకుండా పాపాయిని చాలా జాగ్రత్తగా ఉయ్యాలలోనుంచి బయటకు తీసి హృదయానికి హత్తుకొంది.

పాల డబ్బా అయిపోయిందన్న విషయం ఆమెకు తెలుసు. అది ఖాళీ అయిన తరువాతనే పాపాయికి ఇందాక తన స్తనాలను అందించింది. అవి కూడా వట్టిపోయినవే. అయినా మరో మార్గం కనిపించలేదు పాపాయిని అలా మభ్యపెట్టటం మినహా. ఎంత విషాదం మిగిల్చింది కాలం! ఆ రోజుల్లో...

"రవ్వల రాణి... నాట్యమయూరి... స్టేజ్ ఫ్లవర్ రోజా ఇప్పుడు మీ ముందుకు వస్తున్నది" అని మైకులో వినిపించగానే జనం సంతోషంతో చప్పట్లు చరిచేవాళ్లు. ఈలలు వేసేవాళ్లు. ఆమె డాన్సు చూడకపోతే జీవితం వృధా అన్నంతగా ఆమెకోసం ఎదురు చూసేవాళ్లు.

రికార్డు డ్యాన్సర్ల వీధిలో దాదాపు ఓ ఇరవై డాన్సు ట్రూపులున్నా డాన్సు ప్రోగ్రాం జరిపించాలని అనుకొనే వాళ్లందరూ ముందుగా రోజా ట్రూపు కోసమే ఎగబడేవాళ్లు.

రోజా చాలా అందంగా వుంటుంది. సన్నటి నడుమూ ఒంపులు తిరిగిన శరీరం. నాట్యానికి అనుకూలమైన శరీర సౌష్టవంతో ఆమె స్టేజిమీద నర్తిస్తుంటే ప్రేక్షకులు పరవశించిపోయేవాళ్లు. రికార్డు డాన్సేకాదు రోజా స్వయంగానూ పాటలు పాడేది. డాన్సులు చేసేది. అదే ఆ రంగంలో రోజాకు ప్రథమ స్థానం కల్పించటంలో ప్రధాన పాత్ర వహించింది.

ఆధునికులు సినిమా యాక్టర్లనూ, సినిమా పాటలను ఆదరించినంతగా రికార్డు డ్యాన్సర్లను ఆదరించకపోయినా ఇంకా వాళ్లలో కొంతమంది ఆ రంగంలోనే వుంటున్నారు. వృత్తి కళాకారులుగా జీవితాలు వెళ్ళదీస్తున్నారు. ప్రభుత్వం కూడా వాళ్ళను చిన్నచూపే చూస్తోంది. సినిమాల్లో నటించే వాళ్ళను వృత్తి కళాకారులుగా గుర్తించింది కానీ వాళ్ళను మాత్రం పూర్తిగా విస్మరించింది.

రోజా బాగా రాణింపులో వున్నప్పుడు ఆమెను వివాహం చేసుకొన్నాడు డాన్సు పార్టీ కాంట్రాక్టరు చంద్రం. ఆ వీధిలో వున్న చాలామంది కాంట్రాక్టర్లలో చంద్రం కూడా ఒకడు.

డాన్సర్లను వాళ్ళ పేరును బట్టి, డిమాండును బట్టి చంద్రంలాంటి కాంట్రాక్టర్లు సంవత్సరానికి కొంత పారితోషికం నిర్ణయించి వాళ్ళతో రాతపూర్వకంగా అగ్రిమెంటు కుదుర్చుకుంటారు. ప్రదర్శనలకు వెళ్ళేందుకు వాహనాలు, వాద్యాలు, డ్రస్సులు అన్నీ కాంట్రాక్టర్లే సమకూరుస్తారు. ప్రదర్శనలకు, డ్యాన్స్ పార్టీకి వచ్చే ఆదాయం

మొత్తం కాంట్రాక్టర్లే అనుభవిస్తూ డాన్సర్లకు మాత్రం కొద్దిపాటి పారితోషికాన్ని సంవత్స రానికింత అని నిర్ణయించి ఇస్తుంటారు.

తమకు పెట్టుబడి లేకా, వాయిద్యాలూ, వాహనాలూ, ఇతర సౌకర్యాలూ సమకూర్చు కోలేకా డ్యాన్సర్లు అనివార్యంగా కాంట్రాక్ట ర్లతో అలా ఒప్పందం కుదుర్చుకొని వాళ్ళు విసిరే ఎంగిలి మెతుకులతో దయనీయమైన జీవితాలు గడుపుతుంటారు. అర్ధాకలితో అలమటిస్తూ వేదికలమీద మాత్రం తళుకు బెళుకుల డ్రస్సులతో నృత్యాలు చేస్తూవుం టారు. కాంట్రాక్టర్ల దోపిడికి గురిఅయ్యే వాళ్ళిక శ్లేష్మంలో పడిన ఈగలే. ఆ దోపిడి రొంపిలోంచి బైటికి రాలేరు.

అలాంటి పరిస్థితులలో రోజాను పెళ్ళిచే సుకొంటానని కాంట్రాక్టరు చంద్రం అడి గాడు. పెళ్లి అంటే ఒక పురుషుడి ఆలంబన దొరుకుతుంది స్త్రీకి. జీవితంలో ఒక భద్రతా భావం ఏర్పడుతుంది.

కాంట్రాక్టర్ల దోపిడీకి ఎటూ గురవుతూ తమ శక్తిని వాళ్ళకి దోచిపెట్టి అర్ధాకలితో నికృష్టమైన జీవితాలను గడిపేకన్నా అలాంటి ఆలంబనను చూసుకోవటమే మంచిది అన్న భావం సహజంగానే రోజాకు కూడా కలిగింది. అతడి ప్రతిపాదనను అంగీకరించింది.

ఇద్దరికీ వివాహమైన కొంతకాలం వాళ్ళ దాంపత్యం ఆనందంగానే సాగింది. సంవత్స రానికి రోజాకు పారితోషికం చెల్లించే అవ సరం లేకుండాపోవటమే కాక ఆమె నృత్యప్ర దర్శనల వల్ల వస్తోన్న డబ్బంతా చంద్రానికే మిగులుతుంది.

అర్ధాకలి బాధ తీరి హాయిగా భర్తచాటు భార్యలా జీవితం గడచిపోతుందన్న ఆనందం రోజాది అయితే, ఆమెవల్ల తనకు అదనపు లాభం వస్తుందన్న ఆనందం చంద్రానిది.

ఇద్దరూ ముందే ఆశించిన అలాంటి ప్రయోజనాలకు భంగం వాటిల్లనంతవరకూ ఆనందానికీ భంగం వాటిల్లలేదు.

ఒకప్పుడు చంద్రం కాంట్రాక్టులో ఉండి రికార్డు డాన్సులు వేసిన 'రమణి' అనే అమ్మాయి ఆ తరువాత మద్రాసు వెళ్ళి సిని మాలలో చిన్న చిన్న వేషాలు వేస్తూ క్రమంగా గుర్తింపులోకి వచ్చింది. ఆమె హావభావ ప్రకటనా చాతుర్యాన్నీ, నటనాకౌ శలాన్నీ, నృత్యంలో ఆమెకు వున్న అనుభ వాన్నీ, మెళకువలనూ తమిళులు గుర్తిం చారు. తమిళ ప్రొడ్యూసరు ఒకరు రమణిని తను తీయబోయే సినిమాలో హీరోయిన్‌గా బుక్ చేసుకొన్నాడు.

ఆమె సినిమాలలో చిన్న చిన్న వేషాలు వేస్తూ రాణిస్తున్న దశలోనే చంద్రం చాలా సార్లు మద్రాసు వెళ్ళాడు. రమణితో సంబంధ బాంధవ్యాలను పెంచుకొని చివ రికి ఆమెను పెళ్ళి చేసుకొన్నాడు.

అప్పటికే గర్భవతిగా వుంది రోజా. కడుపు పెరిగేకొద్దీ ఆమెను అందరూ డాన్సు ప్రోగ్రాంలకు బుక్ చెయ్యటం మానివేశారు. రోజురోజుకూ ఆమె ప్రాభవం అడుగంటి పోతూ కొత్తగా డ్యాన్సు పార్టీ పెట్టిన కుమారి 'దిల్ ఖుష్' ప్రాభవం సంతరించుకో సాగింది.

ఎక్కడ విన్నా దిల్ ఖుష్ గురించిన చర్చలే.

ఎక్కడ చూసినా దిల్ ఖుష్ డాన్సు ప్రోగ్రాంలే.

రవ్వలరాణి... నాట్యమయూరి... స్టేజ్ ఫ్ల వర్ ఇప్పుడు రోజా కాదు, దిల్ ఖుష్... రోజా పేరే క్రమంగా మరుగున పడిపో తోంది.

చంద్రం రమణిని పెళ్లి చేసుకొన్నాడనీ, ఏదో ఒకరోజు ఇక్కడినుంచి భిచాణా ఎత్తి మద్రాసు వెళ్ళిపోతాడనీ ఊళ్లో ప్రచారం పెట్టాడు మరో డాన్సుపార్టీ కాంట్రాక్టరు రవి.

రవి చంద్రంకన్నా ముందుగానే రోజా వెంటపడ్డాడు. అప్పటికి రోజాకు అలాంటి





ఆలోచన లేక తిరస్కరించింది. ఆ తరువాత చంద్రం కూడా అలాగే వెంటపడ్డాడు అంగీకరించింది.

ఒకవిధంగా 'పెళ్లి చేసుకొందాం' అని రవి ఆమె వెంటపడటంవల్లనే పెళ్లి అనే భావన ఆమె హృదయంలో మొలకెత్తిందేమో. ఆ భావన ఎదిగి వృక్షంగా పెరిగి పుష్పించి ఫలించిన సమయంలో చంద్రం వచ్చాడు. ఫలం అతనికి దక్కింది.

తను రవిని తిరస్కరించానన్న అక్కసుతో అతనలా ప్రచారం చేస్తున్నాడని రోజా కొంతకాలం భ్రమలో మనసును నిబ్బర పెట్టుకొంది. కానీ అది నిజమని రూఢిగా తెలియగానే భ్రమలన్నీ తొలగిపోయి భర్తతో లడాయి వేసుకొంది.

అలాంటి అవకాశం కోసమే ఎదురుచూస్తున్న చంద్రం రోజా తనతో తగువుపడి అవమానించిందని చెప్పి అందరి దగ్గరా సానుభూతిని అప్పనంగా పొందాడు. రాత్రి కిరాత్రి విలువైన సామాన్లూ, డబ్బూ తీసుకొని చెప్పాపెట్టకుండా మద్రాసు వెళ్ళిపోయాడు.

వేపచెట్టుకు తియ్యటి వేపపండ్లు కాసినట్టే 'పెళ్లి' అన్న చేదు అనుభవం నుంచి తియ్యటి అనుబంధంగా పాపాయి మిగిలింది రోజాకు... అంతే!

జ్ఞాపకాల అలలలో సుళ్ళు తిరుగుతూ రోజా ఒక్కసారిగా బాహ్యప్రపంచంలోనికి వచ్చింది. పాపాయిని మరింత ఆర్తిగా గుండెకు హత్తుకొంది. ఎంత హాయిగా వుందీ...! కానీ పాపాయికి ఇప్పుడు కావాల్సింది జోలపాటలూ, లాలిపాటలూ కాదు, మమతానురాగాలు కాదు, వెన్నెలలో ఆరుబయట విహారాలు కాదు-

పాపాయికి గుక్కెడు పాలు కావాలి. పాలడబ్బా కొని తేవాలి. అది చాలా జరూరు.

పాలడబ్బా కావాలంటే ఏం చెయ్యాలి?

డబ్బు కావాలి. డబ్బు... డబ్బు తీసుకొని వెళితే పాలడబ్బా అమ్ముతారు. దానిని తెచ్చి పాలు తాగిస్తే పాపాయి నిక్షేపంగా బతుకుతుంది.

ఇప్పుడు కావాల్సింది ఏమిటి?

డబ్బు కావాలి డబ్బు. అంతే!

రోజాకు జంగయ్య జ్ఞాపకం వచ్చాడు.

చంద్రం తనను మోసంచేసి మద్రాసు పారిపోయిన మరుసటిరోజే, తాము అద్దెకు వుంటున్న ఇంటియజమాని ఇల్లు ఖాళీ చెయ్యమని అంటే అప్పటికప్పుడు జంగయ్య దగ్గరికి వెళ్ళింది రోజా. ఐదువందల రూపాయలు కావాలని అడిగింది.

పాత ఇంటికి అద్దెబకాయి చెల్లించాలి. తక్కువలో చిన్నగది ఒకటి అద్దెకు తీసుకోవాలి. అన్ని లెక్కలూ చూసింది రోజా. ఆ రెండు పనులూ జరిగి కనీసం కొద్దిరోజులు అన్నానికి గడిస్తే చాలు. ఆ తర్వాత ఏదో ఒకటి ఆలోచించవచ్చునని అనుకొని డబ్బు కోసం అతని దగ్గరికి వెళ్లింది.

జంగయ్య కొంచెం ముఖపరిచయం వున్న తనే కాదు. ముక్కూ మొహం తెలియని వాళ్లు వెళ్ళి అడిగినా డబ్బు ఇవ్వటంలో వెనుకాడడు. కాకపోతే ఏదైనా విలువగల వస్తువు తాకట్టు పెట్టాలి. నూరురూపాయలు తీసుకొంటే నెలకు పది రూపాయల వడ్డీ చెల్లించాలి. అంతే...

చంద్రం ఇల్లంతా వూడ్చి డబ్బూ, సామాన్లూ పట్టుకొని పోయాడుగానీ అటక మీద వున్న హార్మోనియం పెట్టె మాత్రం మర్చిపోయి వెళ్ళాడు. రోజాకు అది గుర్తొచ్చింది. వెంటనే రిక్షా పిలిచి హార్మోనియం పెట్టెను రిక్షాలో పెట్టుకొని జంగయ్య ఇంటికి వెళ్ళింది.

అది బాగా ఖరీదయిన హార్మోనియం పెట్టె. ఆపైన దాన్ని బజారులో తెగనమ్మినా వెయ్యి రూపాయలు ఇస్తారు.

జంగయ్య దానిని పరీక్షించి చూశాడు. రోజా చేతనే వాయింపించి అది బాగానే వుందన్న నిర్ణయానికి వచ్చాడు. దాని విలు

వను మనసులోనే అంచనా వేసుకొని "ఎంత కావాలి?" అని అడిగాడు.

"ఐదువందలు" చెప్పింది రోజా.

"ఎన్నాళ్ళలో విడిపించుకొంటావ్?"

"ఇప్పుడే చెప్పలేను"

"అలా అంటే ఎలా?"

"ఉన్న పరిస్థితి అది"

"నా పరిస్థితి కూడా ఆలోచించు. నువ్వో వందేళ్లు ఆగి అప్పుడు వచ్చి నా హార్మోనియం పెట్టె నాకు కావాలంటే ఎలా?"

"మీకు అలాంటి భయం వద్దు"

"అంత ధైర్యంగా ఎలా చెబుతున్నావ్?"

"వంద సంవత్సరాలకు మన ఇద్దరమూ బతికి వుండం"

జంగయ్య చాలాకాలం తరువాత నవ్వాడు. "మొత్తానికి భలేదానివి నువ్వు" అని. "వడ్డీ ఎంతో తెలుసా?" అని అడిగాడు.

"తెలియదు"

"నూటికి నెలకు పది రూపాయలు. వడ్డీ మాత్రం ప్రతినెలా ఇవ్వాలి. అసలు కొంచెం నిదానంగా ఇచ్చినా పర్వాలేదు"

"అలాగే... నాకు ఐదు వందలివ్వండి"

"సంవత్సరంలో విడిపించుకోకపోతే నేనే అమ్మేస్తాను"

"అలాగే" అని తల వూపింది రోజా.

జంగయ్య లోపలికి వెళ్ళి బీరువాలోనుంచి డబ్బు తెచ్చి రోజాకు ఇచ్చాడు. హార్మోనియం పెట్టెను రిక్షాలోనుంచి దింపించి ఇంట్లో పెట్టించాడు.

రోజా డబ్బు తీసుకొని ఇంటికి వెళ్లింది. ఒక గంటలోనే పాడుపడ్డ మిద్దెలో ఆమెకు గది దొరికింది. వెంటనే ఇల్లు మారిపోయింది. ఆ తరువాత పాపాయి పుట్టడం, తల్లి గర్భంలోనుంచి బైటికొచ్చి అద్భుతమైన ప్రపంచాన్ని అబ్బురంగా చూస్తూ అంతలోనే ఆకలితో 'కేర్' మంటూ ఏడుపు ప్రారంభించటం... అంతా చకచకా జరిగిపోయింది.

ఇప్పట్లో జంగయ్య దగ్గర తాకట్టు పెట్టిన హార్మోనియం పెట్టెను విడిపించుకొనే అవకాశమే లేదు. తరువాత ఎప్పుడైనా జీవితంలో ఏవో అనూహ్యమైన అద్భుతాలు జరిగి డబ్బు చేతికి అంది దానిని విడిపించుకొన్నా దాని అవసరం తనకు లేదు. ఇక తనకు హార్మోనియం పెట్టెతో అవసరం లేదన్న నిర్ణయానికి వచ్చి జంగయ్య ఇంటికి బయల్దేరింది రోజా ఏడుపుల పాపాయినీ, దాని ఆకలినీ చంకన ఎత్తుకొని మోస్తూ.

ఏదో ఒక ధరకు హార్మోనియం పెట్టెను జంగయ్యకే అమ్మాలి. అతనికి ఇవ్వవలసిన అసలూ, దానికి విధించిన వడ్డీ, అంతా పోను మిగిలిన డబ్బు అడిగి తెచ్చుకోవాలి. పాపాయికి పాలడబ్బాలు కొనాలి.



విద్యార్థులకు డిగ్రీ పరీక్షలు దగ్గరకొచ్చాయి. చైతన్య చాలా శ్రద్ధగా చదువుతున్నాడు. మంచి మార్కులతో డిగ్రీ పాసుకావాలని, జీవితాన్ని అందంగా నిర్మించుకోవాలనీ ఎదురుచూస్తున్నాడతను.

చైతన్యది ఓ పల్లెటూరు. అదే ఊళ్లో ఇంటర్ పాసయ్యాడు. అక్కడ జూనియర్ కాలేజి తప్ప డిగ్రీ కాలేజి లేదు. పైచదువుల కోసం పట్నం వెళ్ళి కాలేజిలో చేరాడు. కాలే





జికి దగ్గరలో ఒక రూమ్ తీసుకొని హోటల్లో భోజనంచేస్తూ చదువు కొనసాగి స్తున్నాడు.

పానకాలు కూడా చైతన్య ఊరివాడే. అత నితోపాటే ఇంటర్ పాసై డిగ్రీలో చేరాడు పట్నం కాలేజిలో. ఇద్దరూ అదే రూమ్‌లో వుంటున్నారు.

పానకాలు చదువులో, తెలివితేటల్లో చాలా చురుకుగా వుంటాడు. కానీ చూపు లకు మాత్రం ఎంతో అమాయకంగా కనిపి స్తాడు. అలంకరణకు అసలు ప్రాధాన్యత ఇవ్వడు. ఎన్నో ఏండ్లుగా నూనె రాయ కుండా జనపనారలా వుండే తల వెంట్రు కలూ, కనీసం ఇస్త్రీకి కూడా నోచుకోని చవు కరకం బట్టలు ధరించి క్లాసులకు వెళ్ళటం, ఎప్పుడూ శూన్యంలోకి చూస్తూ ఏదో ఆలో చించటం అతని అలవాటు.

చైతన్య, పానకాలు డిగ్రీ మొదటి సంవత్స రంలో చేరిన కొత్తల్లో సీనియర్ విద్యార్థులు వాళ్ళను కళాశాల గేటు దగ్గరే ఆపారు ఒక రోజు. పుస్తకాలు నెత్తిమీద పెట్టుకొని వాటిని చేతులతో పట్టుకోకుండా అవి కింద పడిపోకుండా అన్ని క్లాసురూమ్‌లకూ తిరగా లని నిర్బంధం చేశారు.

పానకాలు చాలా కంగారుపడ్డాడు. వాళ్ళను చూసి భయంతో ఒణికిపోయాడు.

వాళ్ళు చెప్పినట్టు చెయ్యకపోతే కొడతా రన్న భయంతో పుస్తకాలు తలమీద పెట్టు కొని జాగ్రత్తగా నడుస్తూ రెండే రెండు క్లాసు రూమ్‌లకు వెళ్లాడు.

అందరూ అతడ్ని చూసి ఘొల్లుమని నవ్వారు. బల్లలు చరిచి ఆనందించారు. అతని శరీరం కంపించింది. మొత్తం అలా అతను తిరగవలసిన రూమ్‌లు ఇరవైకిపైనే వుంటే ఐదవరూమ్ దగ్గరే పుస్తకాలు కింద పడిపోయాయి.

సీనియర్లు హేళనగా నవ్వారు. చప్పట్లు చరిచారు. మళ్ళీ పుస్తకాలు పానకాలు నెత్తి మీద పెట్టి మొదటి రూమ్‌నుంచి తిరగమని ఆజ్ఞాపించారు.

పానకాలుకు కన్నీళ్లు కురిశాయి. భయంతో గడగడా ఒణికిపోతూ పుస్తకాలను నెత్తిన పెట్టుకొని అలాగే నడవసాగాడు.

అతనికి కాపలాగా కొంతమంది వుండి మిగిలినవాళ్లు చైతన్య దగ్గరికి వెళ్ళారు.

"ఏందిరా అలా చూస్తున్నావ్?" సుధీర్ అనే అతను క్రూరంగా చూస్తూ అడిగాడు చైతన్యను.

సుధీర్ చాలా బలిష్టంగా వున్నాడు. కండలు తిరిగిన భారీకాయంతో అప్పటికే విద్యాదశ పూర్తయి జీవితంలోకి వెళ్ళినవా డిలా వయసు మీరినట్టే కనిపించాడు.

అతడివేపు చూసిన చైతన్యకు నవ్వొ చ్చింది. అంత టెన్షన్లో కూడా అదోలా నవ్వాడు. డార్విన్ పరిణామ సిద్ధాంతంపట్ల చైతన్యకు అప్పుడు కుదిరింది పూర్తి నమ్మకం!

"అడిగితే సమాధానం చెప్పవేంరా, వాడు నీ ఫ్రెండా?" అన్నాడు సుధీర్ మళ్ళీ.

"అవును..."

"వెరీగుడ్. అలా అయితే స్నేహితులిద్ద రినీ ఒకేవిధంగా రాగింగ్ చేస్తే మజా వుండదు. నీ ఫ్రెండు పుస్తకాలు నెత్తిన పెట్టుకొని హరిదాసులా క్లాసు కాస్లుకూ తిరు గుతున్నాడు. నువ్వలా తిరగవద్దుగానీ మరొక పనిచెయ్యి" అని చైతన్యను రాగింగ్ ఎలా చెయ్యాలా? అన్న ఆలోచనలో పడి పోయాడు సుధీర్.

అతడి మిత్రబృందం అంతా బాస్ ఏం చెబుతాడా అని ఎంతో ఆసక్తిగా సుధీర్‌వైపు చూస్తూ నిల్చున్నారు.

"ఇంతకూ మీరిలా మమ్మల్ని ఎందుకు వేధిస్తున్నారు?" అడిగాడు చైతన్య.

"వేధింపు కాదురా ఫూల్ ఇది. రాగింగ్ అంటారు దీనిని. అది కూడా తెలియదంటే కచ్చితంగా నువ్వో పల్లెటూరి బైతువి అయి వుంటావు. ఏ వూరురా నీది?" క్రూరంగా చూస్తూ అడిగాడు సుధీర్.

"మాది... మాది..."

"ఆc... మీది? "

"భారతీపురం" చెప్పాడు చైతన్య.

బాస్ అంచనా అలా కరెక్టని తేలిపోగానే సుధీర్ బృందం ఎగతాళిగా నవ్వింది చైతన్యను చూస్తూ.

సుధీర్ ఆలోచన ఒక కొలిక్కి వచ్చింది. "నీ పేరు ఏమిటిరా? " అడిగాడు.

"చైతన్య"

"అబ్బా... చైతన్యవా? అయితేనేంగానీ ఇకనైనా పల్లెటూరి బైతుతనం వదిలిపెట్టి చైతన్యం తెచ్చుకోరా ఫూల్. బస్తీ సంస్కారం నేర్చుకో" అని "నీ ప్యాంటు లోపల డ్రాయరుందా? " అడిగాడు.

"ఉన్నది" చెప్పాడు చైతన్య.

"అబ్బా... పల్లెటూరి బైతులు కూడా డ్రాయర్లు వేసుకొంటారా? "

గ్లాసులు దొర్లినట్టే అందరూ గలగలా నవ్వారు.

"...షర్టు విప్పరా ఫూల్" ఆజ్ఞాపించాడు సుధీర్.

చైతన్య మౌనంగా చొక్కా విప్పాడు. దూరంగా చూపులు సారించి చూశాడు, పానకాలు కోసం.

పానకాలు పుస్తకాలు నెత్తిమీద పెట్టుకొని అవి కిందపడకుండా జాగ్రత్తగా కొన్ని గదులకు వెళ్ళటం, ఆ క్లాసుల్లోని విద్యార్థులు, లెక్చరర్లూ పగలబడి నవ్వటం, అది చూసి కంగారులో అతను పుస్తకాలు కిందపడవెయ్యటం జరుగుతోంది.

పానకాలును మళ్ళీ మళ్ళీ మొదటి గది నుంచి వాళ్ళలా తిప్పుతూ వేధిస్తూనే వున్నారు. కాలేజి ప్రిన్స్‌పాలూ, కొంత మంది కమిటీ సభ్యులూ ఆఫీసుగదిలో కూర్చొని కొత్త అడ్మిషన్లు జరుపుతూ ఫీజులకూ, డొనేషన్లకూ వేరేవేరే రసీదులు రాసి ఇస్తున్నారు, గల్లాపెట్టె దగ్గరనుంచి కదల కుండా.

ఎవ్వరూ పానకాలు విషయం పట్టించుకో లేదు.

సరిగ్గా అప్పుడే ఎవరో ఇద్దరు కొత్తగా కాలేజిలో చేరిన అమ్మాయిలను మరికొంత మంది అమ్మాయిలూ, అబ్బాయిలూ కలిసి రాగింగ్ పేరుతో రకరకాలుగా హింసలు పెడుతూ కనిపించారు.

"బనియన్ కూడా విప్పు" గద్దించాడు సుధీర్.

చైతన్య నెమ్మదిగా బనియన్ విప్పి పక్కనే వున్న క్రోటన్ మొక్కల మీదికి విసిరివేశాడు.

అక్కడ రాగింగుకు గురి అవుతోన్న అమ్మాయిలు ఏడుస్తోన్న శబ్దం గాలివాలుకు చిన్నగా వినిపిస్తోంది. పానకాలు మళ్ళీ మొదటి గదినుంచి తిరగటం ప్రారంభించాడు.

"ప్యాంటు కూడా విప్పరా గcవార్" అరిచాడు సుధీర్.

చైతన్య నెమ్మదిగా ఒక్కో ప్యాంటు బటన్ వూడదీస్తూ "ఇలా రాగింగ్ చెయ్యటం ఎందుకో చెబుతారా... ప్లీజ్" అడిగాడు సుధీర్‌వైపు చూస్తూ ఎంతో జాలిగా.

"నీకన్నీ అర్థమయ్యేటట్లు చెప్పాలంటే మాకంత వ్యవధి లేదు. త్వరగా ప్యాంటు విప్పు" అన్నాడు సుధీర్ అసహనంగా.

"పాపం... ఆ అమ్మాయిలు ఏడుస్తున్నారు. మా పానకాలు పరిస్థితి కూడా అలాగే వుంది. ఎందుకిలా మమ్మల్ని వేధిస్తున్నారు? " అని అమాయకంగా అడిగాడు చైతన్య మరో గుండీ విప్పుతూ.

సుధీర్ పగలబడి నవ్వాడు. అలా నవ్వుతూంటే అతడి కదలికలకు కళ్ళజోడు మళ్ళా ముక్కుమీదకి జారింది.

"చెప్పాను కదూ ఇది హింస కాదు రాగింగని. రాగింగు అంటే కొత్తగా చేరిన విద్యార్థినీ విద్యార్థులకు కాలేజి అన్నా, స్టూడెంట్సు అన్నా భయం పోవటానికి ఇలా చేస్తుంటాం" అని చెప్పాడు సుధీర్ చూపుడు వేలుతో కళ్ళజోడు పైకి నెడుతూ.





"రాగింగు అంటే దాని వెనుక అంత మంచి ఉద్దేశం వుందా? " ఆశ్చర్యపోయాడు చైతన్య.

"అవును మరి. అందుకే ఇలా చేస్తుంటాం. ఇక్కడే కాదు అన్ని కాలేజి ల్లోనూ అంతే"

"ఒక్కమాటకు దయచేసి సమాధానం చెబుతారా? " కొంచెం సందేహిస్తూనే అడి గాడు చైతన్య.

"అడగరా ఫూల్" పిల్లి ఎలుకవైపు చూసి నట్టే చైతన్యవైపు చూస్తూ అన్నాడు సుధీర్.

"నిజం చెప్పాలంటే నాకు కాలేజి అంటే భయం కలగలేదు. ఇంతమంది స్టూడెం ట్స్‌ను చూస్తున్నా ఒణుకు పుట్టటంలేదు. అయినా రాగింగు చేసే మిమ్మల్ని చూస్తుంటే వణుకు పుడుతోంది. భయం వే స్తోంది. అంటే మీరు మాకు మంచి చేస్తు న్నామన్న పేరుతో చెడు చేస్తున్నట్టు కాదా? "

సుధీర్ ఆశ్చర్యంగా చూశాడు. క్షణం తరు వాత తన బృందం వైపు చూస్తూ, "ఎంత మాట అన్నాడో విన్నారటరా? " అన్నాడు అదోలా నవ్వుతూ.

"వాడితో మనకు మాటలు ఎందుకు బాస్. ప్యాంటు విప్పించి క్లాసులకు తిప్పుదాం" అని బాస్‌వైపు చూశాడు బృందంలో ఒకడు.

అందరూ ఘొల్లున నవ్వారు.

"ప్యాంటు త్వరగా విప్పరా లం...కొ డకా!" హెచ్చరించాడు సుధీర్ చైతన్యను కోపంగా చూస్తూ.

చైతన్య మరో గుండీ విప్పేందుకు గుండీ మీద వేళ్ళు పెడుతూ "అంత కోపం ఎందుకు సార్? ఏదో అలా అమ్మాయిలూ, మా పానకాలూ ఏడుస్తుంటే మనసుకు కష్టంవేసి అలా అడిగాను అంతే. మీరం దరూ కోపంగా చూస్తుంటే నాకు భయంగా వుంది. నాలాగానే వాళ్ళు కూడా భయపడి ఏడుస్తున్నారు సార్.

"మీకేం... మీరు కడుపు నిండిన మహా రాజులు. బాగా చదువుకున్నా, చదువుకోక పోయినా కావాల్సిన డిగ్రీలు డబ్బుతో కొను క్కుంటారు. ఉద్యోగాలూ ఖరీదు చేస్తారు. మీ ఇళ్ళలో మూలుగుతున్న డబ్బు కట్టలను వాత్సల్యం పేరుతో మీవాళ్లు మీకు పంపి స్తుంటే మీరు గోల్డుచైన్లు వేసుకొని, హిప్పీల్లా జుట్లు పెంచుకొని చింబోతుల్లా వేషాలు వేసుకొంటారు. రాగింగు పేరుతో రాక్షసా నందం పొందేందుకు వస్తారుగానీ చదువు కోరు. చదువుకొనేవాళ్ళను చూసి ఓర్చుకో లేరు. అందులో మీ తప్పు ఎంత మాత్రమూ లేదుగానీ కోపం తెచ్చుకొని నన్ను భయపెట్టొద్దు.

"ఆ తప్పంతా మీలాంటివాళ్ళకు జన్మనిచ్చి బలాదూరుగా తిరుగుతూ చదువు గురించి పట్టించుకోకుండా వుండే మీకు డబ్బు కట్టలు పంపించి బాధ్యత తీరిందని చేతులు దులు పుకొనే మీ తల్లిదండ్రులది.

"ఏం చేస్తాం! మీలాంటి నిష్ప్రయోజకు లను ఒక జీవితకాలం పోషిస్తూ ఎందుకూ కొరగానివాళ్ళను చేస్తూ కూడా కడుపుతీపి పేరిట ఆదరించే అమ్మలూ నాన్నలూ మీ భవిష్యత్తు గురించి ఆలోచించటంలేదు.

"అవునుకదా సార్? ఇలా అడిగానని ఏమీ అనుకోకండి. ఆగ్రహించకండి. మీరు ఆగ్రహించారంటే మీ ముందు నేను ఎంత సార్, పల్లెటూరి బైతును" అని చైతన్య సుదీ ర్ఘంగా తన ఆవేదన అంతా వ్యక్తంచేసి ప్యాంటు చివరి గుండీమీద చెయ్యివేసి-

"ప్యాంటు కూడా ఇంకా విప్పాల్సిందేనం టారా? " అని అడిగాడు వినయంగా.

అవతల ఎవరో ఒక విద్యార్థి ఇద్దరు అమ్మాయిల జడలను కలిపి ముడివేస్తు న్నాడు. సీనియర్ విద్యార్థినులు కొంత మంది ఆ అమ్మాయిల ముఖాలనిండా బొట్టు బిళ్లలు రంగు రంగులవి అతికిస్తు న్నారు.

పానకాలు ఇక కదలలేక పుస్తకాలను

దూరంగా విసరికొట్టి "చంపండి, కొట్టండి గానీ నేను మాత్రం తిరగలేను" అన్నట్టు అక్కడే కింద కూలబడిపోయాడు నిస్సహాయంగా.

కడుపంతా తెములుక్కొని పెద్దగా కేకరించి "థూ..." అని ఉమ్మేశాడు.

అటువైపే చూస్తూ నిల్చున్న చైతన్య చెంపమీద బలంగా చేత్తో చరిచాడు సుధీర్. చెంప పేలిపోయింది. ఆ శబ్దం దూరంగా వున్న క్లాసు రూములదాకా వినిపించింది.

"ప్యాంటు విప్పమంటే ఉపన్యాసం ఇస్తావటరా నా కొడకా" అన్నాడు సుధీర్ మరో దెబ్బ కొట్టేందుకు చెయ్యి ఎత్తుతూ.

"ఇంతగా ప్రాధేయపడి చెప్పినా మనసు మార్చుకోలేదా మీరు? " అని అడిగాడు చైతన్య జాలిగా.

"ఇప్పు బే!" అరిచాడు సుధీర్.

ఎంత చెప్పినా అతను వినిపించుకోడని అర్థమైంది. ఇక చెప్పినందువల్ల ప్రయోజనం వుండదని కూడా అర్థమైంది. నెమ్మదిగా ప్యాంటు కూడా విప్పి దూరంగా విసిరేశాడు చైతన్య. శరీరాన్ని అంటుకొని వున్న డ్రాయరు మాత్రం అతడి తొడలదాకా కప్పి వుంచింది.

అప్పుడు గమనించాడు సుధీర్. ఆ పల్లెటూరి బైతు అలా అర్థనగ్నంగా నిలబడి వుంటే పంచలోహాలతో తయారుచేసిన విగ్రహంలా వున్నాడు. గుండెలోని అనంతానంతమైన ధైర్యానికి దర్పణం పడుతూ విశాలమైన కళ్లు.

"ఇంకేం చెయ్యాలి? ఇలా అర్థనగ్నంగా? " అడిగాడు చైతన్య.

అప్పటిదాకా హేళనగా నవ్వుతూ, జోకులువేసి ఆనందిస్తూ బాసు చుట్టూ నిల్చున్న బృందం అంతా ఎందుకోగాని మౌనంగా ఉంది.

సుధీర్ చైతన్య అడిగినదానికి సమాధానం చెప్పలేదు. అతడిని ఇంకా ఏం చెయ్యగలం? అని ఆలోచిస్తున్నాడు మనసులో.

"ఇలా నన్ను చూస్తుంటే మీకు ఆనందంగా వుందా? మీ ఆకారాలు చూస్తుంటే మగవాళ్ళే అన్న అనుమానం కలుగుతుంది. కానీ ఆనందించేతీరు చూస్తుంటే అది నిజం కాదేమో అనిపిస్తున్నది. ఒక మగవాడిని అర్థనగ్నంగా నిలబెట్టి ఆనందించేవాళ్ళను మగవాళ్లు అనరు. ఏమీ అనుకోకుండా చెబుతారా మీరు ఆడాళ్ళా? " అని అడిగాడు చైతన్య.

విస్ఫోటనం తరువాత కొద్దిక్షణాలు చెవులు గళ్ళుపడే నిశ్శబ్దమే అక్కడ ఆవరించింది.

ఆఫ్టరాల్ ఒక పల్లెటూరి బైతు ఆధునిక సమాజానికి మచ్చుతునకల్లాంటి తమనే అంతమాట అంటాడా? వాడు నిజంగానే అన్నాడా లేకపోతే అది భ్రమా! అన్నంత విస్మయంగా చూస్తూ నిల్చున్నారు అందరూ.

సుధీర్ నెమ్మదిగా తేరుకొన్నాడు. ఆగ్రహంతో కంపించిపోతూ ముక్కుమీదికి జారిన కళ్ళజోడును చూపుడువేలుతో పైకి జరుపుకొని అమాంతం చైతన్యమీదికి దూకాడు.

అతడి కదలికలను ముందుగానే అంచనా వేసుకొన్నాడేమో ఒడుపుగా పక్కకు తప్పుకొని మెరుపువేగంతో సుధీర్ మెడనరాల మీద చెయ్యిని స్టిఫ్‌గా పెట్టి కత్తివేటు వేసినట్లు ఒక దెబ్బ బలంగా కొట్టాడు చైతన్య.

"కెవ్"మని కీచుగా అరిచాడు సుధీర్. అతడి గొంతు తడి ఆరిపోయింది. కళ్ళ ముందు అంధకారం, ఆ అంధకారంలో కొన్ని మెరుపులూ కనిపించాయి.

"పల్లెటూరి దెబ్బ సార్ ఇది. కొంచెం బలంగా వుంటుంది. కాయకష్టం చేసే చేతులుకదా, అలాగే వుంటాయి. ఓర్చుకోవాలి మరి. తప్పదు కదా సార్? " అని సుధీర్ దవడమీద పిడికిలితో గుద్దాడు చైతన్య.

సుధీర్ ముక్కు రంధ్రాల గుండా రక్తం కారసాగింది.




అతడి మిత్ర బృందంలో అప్పుడు వచ్చింది కదలిక. తమ బాసును చైతన్య అలా కొట్టడం, అతడి ముక్కువెంట రక్తం కారటం అలా వుంచి ఆడపిల్లలు కూడా జరిగింది చూశారన్న బాధే వాళ్ళను ఎక్కువగా కలతపెట్టింది.

వాళ్లందరూ ఒకేసారి చైతన్యమీద విరుచుకొని పడ్డారు.

చైతన్య వాళ్ళను ఎంతమాత్రం ఖాతరు చెయ్యలేదు. మరో రెండు దెబ్బలు సుధీర్ మీద వేసి అప్పుడు తలపడ్డాడు వాళ్ళతో.

అక్కడ అమ్మాయిలను 'రాగింగు' చేస్తున్న కుర్రవాళ్లు కూడా అక్కడ్నించి కదలి చైతన్యమీద దాడికి బయలుదేరారు. సాటి అమ్మాయిలనే రాగింగ్ పేరుతో అబ్బాయిలతో కలిసి అంతవరకూ వేధించిన అమ్మాయిలు శిలల్లా నిలబడిపోయారు.

కింద కూలబడి తనలో తను కుమిలిపోతూన్న పానకాలు తల ఎత్తి చూశాడు. జరుగుతోంది ఏమిటో అతనికి అర్థమైంది.

అతడి కళ్లు తళుక్కున మెరిశాయి. ఆవేశం, ఆవేదన కడుపులోంచి బైటికి తన్నుకొని వస్తుంటే చివాలున పైకి లేచాడు. వేగంగా ముందుకు వెళ్ళాడు. డొనేషన్లతో కొత్తగా గదులు కట్టేందుకు తోలించిన ఇటుక రాళ్ళగుట్ట దగ్గరికి వెళ్ళి రాళ్లను చేతుల్లోకి తీసుకొని సుధీర్ బృందంమీదికి బలంగా విసరసాగాడు నిర్విరామంగా.

రాళ్లు తగిలి కొంతమంది తలలకు గాయాలయ్యాయి. కొంతమంది కాళ్ళూచేతులకు తగిలిన దెబ్బలకు కెవ్వున అరుస్తూ చేష్టలుడిగి వింతగా పానకాలువైపు చూస్తున్నారు.

అప్పటికే సుధీర్ బృందం బాగా అలసిపోయింది. దానికితోడు పానకాలు విసురుతూన్న ఇటుకరాళ్ళ వాన ఒకవైపూ, చైతన్య విజృంభణ మరోవైపూ,

వాళ్ళందరూ గాయాలు తగిలిన భయంతో పారిపోయేందుకు దారులు వెతుకుతూ వుంటే అడ్మిషన్లవేళ ఆ పూటకు అయిపోయి, లెడ్జర్లు మూసివేసి బీరువాల్లో పెట్టి క్యాషును భద్రం చేసుకొని బైటికి వచ్చారు కమిటీ మెంబర్లూ, కాలేజి ప్రిన్సిపాల్.

"డియర్ స్టూడెంట్స్! కాలేజిలో ఇలా ముష్టియుద్ధాలు చెయ్యటం మంచిదికాదు. అందరూ ఇళ్ళకు వెళ్ళిపోండి" అన్నాడు ప్రిన్సిపాల్ వాళ్లతో.

అదే అవకాశంగా భావించారు సుధీర్, అతడి బృందం. క్షణం ఆలస్యం చెయ్యకుండా తలలు వంచుకొని అక్కడినుంచి వెళ్ళిపోయారు. అమ్మానాన్నలు ప్రేమతో వాళ్ళకు కొనిపెట్టిన హీరోహోండాలు, రకరకాల ద్విచక్రవాహనాలూ స్టాండులోనుంచి రొదపెడుతూ కదిలాయి. సరాసరి వాళ్ళు ఇంగ్లీషు సెక్సు సినిమా ఆడుతూన్న లీలామహల్‌కు వెళ్ళిపోయారు. బాగా దెబ్బలు తగిలిన వాళ్ళనుమాత్రం దారిలో ఓ నర్సింగ్‌హోం దగ్గర దించి వెళ్ళారు.

"ఏమిటి గొడవ?" ఇంకా అక్కడే నిల్చున్న చైతన్యనూ, పానకాలునూ చూస్తూ అడిగాడు ప్రిన్సిపాల్.

అంతలో రాగింగుకు గురి అయిన అమ్మాయిలు కూడా వాళ్ళ దగ్గరికి వచ్చారు.

"మరేమీలేదు సార్... ర్యాగింగ్ అంటూ వాళ్ళు చాలా ఘోరంగా మమ్మల్ని వేధించారు" చెప్పాడు చైతన్య.

ప్రిన్సిపాల్ పల్చగా నవ్వాడు. "చూడ బ్బాయ్, నువ్వు కాలేజికి కొత్తవాడిలా వున్నావు. రాగింగ్ అంటే తెలియకనే ఇలా నువ్వు అనవసరంగా వాళ్లతో ఘర్షణపడ్డావు గానీ ఇలాంటిది అన్నిచోట్లా సర్వసాధారణమైపోయింది. తలవొంచుకున్నారంటే కొంతకాలం రాగింగు చేసి వాళ్ళే విసుగుపుట్టి వూరుకుంటారుగానీ ఇలా ఎదురుతిరిగితే రెచ్చిపోతారు" చెప్పాడు ప్రిన్స్‌పాల్.

ఆహా... ఎంత గొప్ప సందేశం... అనుకున్నాడు చైతన్య.

"మీరేనా సార్ మాకు ఇలా చెప్తోంది? " అడిగాడు చైతన్య.

"ఉన్న విషయం చెప్పాను. అదీ నీ మంచికే. అలాంటివాళ్ళతో తగవులు పెట్టుకొంటే ప్రాణాలు కూడా తీస్తారు" హెచ్చరించాడు ప్రిన్సిపాల్.

"వాళ్లు ప్రాణాలు తీస్తారని భయపడి వాళ్ళు చెప్పినట్టు మనం చెయ్యాల్సిందేనా సార్? "

"అంతేమరి. మన వ్యవస్థ అది. అంతకన్నా ఏమీ చెయ్యలేం"

"మీరు కాలేజీ ప్రిన్స్‌పాల్. అలాంటివాళ్ళను అరికట్టాల్సిన బాధ్యత మీకు లేదా? "

"నేనూ మనిషినే. వాళ్ళు అలా చేస్తే నన్నూ సహించరు"

"అందుకని వాళ్ళకు తల వొంచుతారా? "

"తప్పదు మరి"

"వాళ్ళు చెప్పింది చేస్తారా? "

"చెయ్యాలి మరి"

"మీ అమ్మాయిని ఒక రాత్రికి పంపించమంటే పంపిస్తారా? "

ప్రిన్సిపాల్ గుండె ఝల్లుమంది. "ఏయ్, ఏమిటా మాటలు? " అన్నాడు కోపంగా.

"బాధ్యతాయుతమైన పీఠాలమీద కూర్చున్నవాళ్ళు తమ సుఖమయ జీవితంకోసం అడుగు అడుగునా తలలు వొంచుకుంటూ అధమాధములకు నీరాజనాలు పలుకుతూ అధికారం, పదవులు, ఆదాయం, స్వకుటుంబ శ్రేయస్సూ మాత్రమే గుర్తుంచుకొని, అన్యాయాన్ని విస్మరిస్తూ జీవితాలు వెళ్ళదీయాలన్న లౌక్యమే ఈ అనర్థాలకు కారణం గానీ వ్యవస్థ కాదు. అది చెడిపోలేదు. మీలాంటివాళ్లు చెడగొడుతున్నారు.

సార్! పానకాలు అమాయకుడు. బొద్దింకను చూసినా భయపడేవాడు. లోకం తెలియనివాడు. అలాంటివాడే దౌర్జన్యం, పీడన హద్దులు దాటగానే అసంతృప్తిని బహిర్గతం చేసేందుకు ఒక చిన్న చర్య మాత్రమే చేపట్టాడు. కాండ్రించి ఉమ్మేశాడు అంతే. ఆ తరువాత అతడి చేతిలో ఇటుకరాళ్లు కనిపించాయి ఆయుధాలకు మారుగా. ఇలాగే కొనసాగితే రేపు అతడి చేతిలో కత్తో, పిస్తోలో ప్రత్యక్షం కాదన్న గ్యారంటీ ఏముంది సార్?

అప్పుడు సభ్యసమాజంలోని మీలాంటివాళ్ళందరూ వాడిది హింసామార్గం అని గోల పెడతారు. హింసకు ప్రతిహింసకే వాడిచేతిలోకి వచ్చిన ఆయుధం అన్న సత్యాన్ని గుర్తించరు. ఇలా అన్నానని మీరు ఏమీ అనుకోకండేం! చట్ట ధిక్కారానికీ, ప్రతిహింసకూ మూలకారణం హింస... దోపిడీ... దౌర్జన్యం. శాంతిని స్థాపించాలంటే మూలకారణాలను నిర్మూలించాలేగానీ ఆ కారణాలకు కారణమైన వాళ్ళే శాంతి వచనాలు చెప్పటం ఆత్మవంచన అవుతుంది సార్..."

"షటప్!" అని పెద్దగా అరిచాడెవరో కమిటీ మెంబరు.

"నా నోరు నొక్కుతారా సార్? "

"వీడి అడ్మిషన్ రద్దు చెయ్యండి. వీడ్ని కాలేజినుంచి బైటికి పంపించండి" అన్నాడు శేషగిరి.

"నేను కట్టిన ఫీజులూ, డొనేషన్ పేరుతో నా దగ్గర వసూలు చేసిన డబ్బులూ తిరిగి ఇచ్చేయండి. నేను కూడా వెళ్ళిపోతాను. మీలాంటి నపుంసకులు నడిపే కాలేజిలో చదువుకోను" అన్నాడు పానకాలు.

"మేం కూడా వెళ్ళిపోతాం. మా డబ్బు మాకు ఇవ్వండి" అని అడిగారు అమ్మాయిలు కూడా.

అక్కడి విద్యార్థుల అరుపులు కాలేజి అంతా ప్రతిధ్వనించాయి. అన్ని క్లాసు రూముల్లోనుంచి అలాంటి అరుపులే వినిపించసాగాయి.

"చూశారా సార్! భయపడే మా వంటి సామాన్యులదే మెజారిటీ ఇప్పుడు. మమ్మల్ని విస్మరించి పీడకులకు ప్రాధాన్యత ఇస్తే ఫలితం ఎలా వుంటుందో చూశారు కదా! ఉడుత జాతి భయపడేది నిజమే.

కానీ అవి కూడా ఉనికి కోసం జీవనపోరాటం చేస్తూంటాయి. లేకుంటే ఆ జాతి ఎప్పుడో అంతరించిపోయేది. మీరే చూడండి సార్, ప్రతిచోటా ఎన్ని ఉడుతలో! చివరికి మీ కాలేజి గదుల్లో కూడా" అని అదోలా నవ్వాడు చైతన్య.

అక్కడ నిశ్శబ్దం.

ఓ కమిటీ మెంబరు ప్రిన్సిపాల్ చెయ్యి పట్టుకొని దూరంగా తీసుకొని వెళ్లాడు.

ఇద్దరూ ఇటుకరాళ్ల గుట్ట వెనక్కు వెళ్ళి నిల్చున్నారు.

"స్టూడెంట్స్ అందరూ వెళ్ళిపోతే మన కాలేజి వ్యాపారం ఏం కావాలి? లక్షల్లో నష్టం వస్తుంది. మళ్ళీ మనం మొదటికి రావాలి. ఆయిల్ మిల్లులో, దాల్ మిల్లులో పెట్టుకోవాలి. అది ఆలోచించకుండా వాళ్ళతో ఘర్షణ పడతారేం? " అన్నాడు కమిటీ మెంబరు ప్రిన్సిపాల్తో.

"ఏంచేద్దాం? "

"శేషగిరిని ఇక మాట్లాడనివ్వద్దు. అతడి దుడుకుతనం వల్లనే ఇంత దూరం వచ్చింది. అసలే అడ్మిషన్ల బేరాలు మందంగా వున్నాయి. నిన్నగాక మొన్న జూనియర్ కాలేజిలో కొత్త కోర్సుల కోసం లక్షల్లో లంచాలు ఇచ్చాం. డిగ్రీ కాలేజి వ్యవహారం జూనియర్ కాలేజికి కూడా వ్యాపించిందంటే మనం నెత్తిన చెంగేసుకొని వెళ్లాలి. లాభాలు గూబల్లో కొస్తాయి"

"నన్నేం చెయ్యమంటారు? "

"స్టూడెంట్సుకు ఎలాగో నచ్చచెప్పి గొడవ సద్దుమణిగేట్టు చూడు"

"అలాగే" అన్నాడు ప్రిన్సిపాల్. కమిటీ సభ్యుడివైపు చూస్తూ, "మన జూనియర్ కాలేజికి ఏమేమి కొత్త కోర్సులు వస్తున్నాయి? " అడిగాడు.

"సి.యి.సి- ఎం.యి.సి. ఇ.యం. టి.యం..."

"మొదటి రెండూ సరేగానీ, చివరి రెండూ కోర్సులు కావు. ఇ.యం. అంటే ఇంగ్లీషు మీడియం, టి.యం. అంటే తెలుగు మీడియం అని అర్థం!"

"అదేందోలేగానీ మొత్తానికి మన జూనియర్ కాలేజి అన్ని కాలేజిలకన్నా ఫస్టుంటుంది. ఇంటర్ కోర్సులన్నీ వుంటాయి మన కాలేజిలో!" అన్నాడు కమిటీ సభ్యుడు గర్వంగా.

అతగాడి భాషా పరిజ్ఞానానికి నవ్వుకున్నాడు ప్రిన్సిపాల్. అక్కడ్నించి కదిలి విద్యార్థుల దగ్గరికి వెళ్ళాడు. "జరిగిందేదో జరిగింది. ఇకముందు మన కాలేజిలో అలాంటివి జరగవని హామీ ఇస్తున్నాను. దయచేసి అందరూ ప్రశాంతంగా ఇళ్ళకు వెళ్ళండి" అని చెప్పాడు.

"మాకు కావాల్సింది చదువేగానీ ఘర్షణలు కాదుసార్. మాకు ప్రశాంతంగా చదువుకునే అవకాశం కల్పించండి" అన్నాడు చైతన్య.

"అలాగే! అంతా నాదీ బాధ్యత. మీరిక ఇళ్ళకు వెళ్ళిపోండి" చెప్పాడు ప్రిన్సిపాల్.

"ఇళ్లకు వెళ్ళటం ఏమిటి? క్లాసులు జరగవా? "

"క్లాసులా? కాలేజిలోనా? " అని ఒక్క క్షణం ఆగి "అక్కడ జరుగుతున్నవి క్లాసులు కావు. పరిచయాలు చేసుకొని హాజరువేసి పంపించటం మాత్రమే. మీ పరిచయం ఎటూ ఇలా అయింది గనుక మీరిక వెళ్లిపోవచ్చు" అని చైతన్యకు మళ్ళీ మాట్లాడే అవకాశం ఇవ్వకుండా ప్రిన్సిపాల్ వెళ్ళిపోయాడు, కమిటీ మెంబర్లతో సహా.

రాగింగుకు గురి అయిన అమ్మాయిలంతా అక్కడినుంచి వెళ్ళిపోయారు.

"మనం కూడా రూముకు వెళ్దామా? " పానకాలును చూస్తూ అడిగాడు చైతన్య.

పానకాలు ఎందుకో సందేహిస్తూ అక్కడే నిల్చున్నాడు.

"ఏమిటలా ఆలోచిస్తున్నావ్? "

"రూముకు వెళ్తే ఎలా? మనకు క్లాసులు జరగవా? " అని చైతన్య ముఖంలోకి



చూశాడు పానకాలు.

"కాలేజిలో క్లాసులు జరగవు" అన్నాడు చైతన్య యదార్థాన్ని తెలియజేస్తూ.

"ఏం? ఎందుకని? "

"మనం ట్యూషన్లలో చేరాల్సిందే!"

"చేరకపోతే? "

"చేరని వాళ్ళను పరీక్షల్లో తప్పిస్తారు"

పానకాలు, చైతన్య మౌనంగా అక్కడ్నించి కదిలి వెళ్ళిపోయారు.

★ ★ ★

కాలేజిలో అప్పుడు రాగింగు ముఠాకు వ్యతిరేకంగా పానకాలు, చైతన్య ఎదురు తిరిగినప్పటినుంచి అలాంటి తరహా రాగింగు పూర్తిగా ఆగిపోయింది. ఎవ్వరూ విద్యార్థులను వేధించిన సంఘటనలే లేవు. కొత్తగా చేరిన విద్యార్థులకు స్వాగతం చెబుతూ మెయిన్ గేటు దగ్గర బ్యానర్లు కట్టటం, విద్యార్థులను ఆప్యాయంగా పలకరిస్తూ వాళ్ళతో స్నేహపూర్వకంగా కలసిపోవటం, అందరూ కలిసి చర్చించుకొని వాళ్ళ సమస్యలకు పరిష్కారాలు కనుగొనటం.

అలా కాలేజిలో విద్యార్థుల మధ్య స్నేహపూర్వకమైన చక్కని వాతావరణం ఏర్పడింది.

విద్యార్థులలో అలా మంచి మార్పు వచ్చిందిగానీ అధ్యాపకుల్లో యింకా రాలేదు. ట్యూషన్లు చెప్పటం వాళ్ళు మానుకోలేదు. కాలేజి క్లాసుల్లో పాఠాలు చెప్పటంలేదు. ట్యూషన్లలో చేరకపోతే పరీక్షలలో తప్పిస్తామనే హెచ్చరికలతో వాళ్ళ బ్లాక్‌మెయిలింగ్ కొనసాగుతూనే వుంది.

అధ్యాపకుల దోపిడిని అరికట్టేది ఎలా? అని ఆలోచించాడు చైతన్య. కాలేజి క్లాసుల్లో పాఠాలు చెప్పితీరాలని వాళ్ళను నిలదీయవచ్చు వాళ్ళ ట్యూషను క్లాసులమీద దాడి చెయ్యవచ్చు కానీ అందుకు విద్యార్థులు యింకా సిద్ధంకాలేదు. అంత చైతన్యం వాళ్ళకు రాలేదు. అలా చేస్తే పరీక్షలలో వాళ్ళను కావాలని తప్పిస్తారన్న భయమే అందుకు కారణం.

చైతన్య, పానకాలు ట్యూషన్లలో చేరకుండ సొంతంగానే చదువుకుంటున్నారు. విద్యార్థులలో ట్యూషన్లకు వ్యతిరేకంగా పోరాటం చెయ్యాలన్న ఆలోచన రావాలని ఎదురుచూస్తున్నారు.

చైతన్య డిగ్రీ రెండవ సంవత్సరంలో వున్నప్పుడు ఒకసారి కాలేజిలో 'నేటి విద్యా విధానం' అన్న అంశం మీద డిబేట్ కాంపిటీషన్ జరిగింది. చైతన్య ఆ వేదికను వినియోగించుకొని నేటి విద్యావ్యవస్థమీద తనకు వున్న అసంతృప్తినంతా వెళ్ళగక్కాలని పోటీలో పాల్గొన్నాడు.

చైతన్యకు ప్రథమ బహుమతి వచ్చింది.

చైతన్య మాట్లాడుతూ విద్యార్థుల నుండి డొనేషన్ల పేరుతో, బిల్డింగు ఫండు పేరుతో, యింకా రకరకాలుగా విద్యార్థులను ఆర్థికంగా దోపిడి చేస్తున్న కళాశాలల యాజమాన్యాలను తీవ్రంగా విమర్శించాడు.

విద్య, విజ్ఞానంలో అందరికన్నా ఎక్కువగా అభివృద్ధి చెంది ప్రపంచ దేశాలకే తలమానికంగా నిలవాలని తాపత్రయపడవలసింది పోయి విద్యను ఖరీదైన అమ్మకపు సరుకుగా మార్చి మనదేశం విద్యను అధికులైన నిరుపేదలకు అందుబాటులో లేకుండా చెయ్యటాన్ని అపహాస్యం చేశాడు.

అతను అలా విద్యా వ్యాపారం గురించి ఘాటుగా విమర్శించిన ప్రతి మాటకూ అందరికన్నా పెద్దగా చప్పట్లు చరిచింది కాలేజి కమిటీ సభ్యులే.

చైతన్య ఆశ్చర్యపోయాడు!

ఇంతటి గోముఖ వ్యాఘ్రాలు వున్న మరో దేశం భూగోళం మొత్తంమీద వుంటుందా? అన్న అనుమానం కలిగింది.

★ ★ ★

గతించిన సంఘటనలు ఒక్కొక్కటే గుర్తు చేసుకొంటూ కూర్చున్నాడు చైతన్య. పరీక్షలు వచ్చేశాయి. ఆరోజు కెమిస్ట్రీ పరీక్ష అయిపోయింది. తెల్లవారితే ఫిజిక్స్ రాయాలి.





# రచయితలకు




- ★ 'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, 'చతురకతలు', 'చతుర ప్రపంచం'వంటి శీర్షికలు కాక కేవలం నవలమాత్రమే అచ్చులో 100 పేజీలు ఉంటుంది. నవలనుబట్టి పేజీల సంఖ్య పెంచడంగాని, తగ్గించడంగాని వుండదు గనుక రచయిత(త్రు)లు తమ వ్రాతప్రతిని అచ్చులో 100 పేజీలకు తక్కువ కాకుండా వుండేలా చూసుకుని పంపవలసి వుంటుంది.
- ★ **ప్రచురించిన నవలలో ఓ పూర్తి పేజీని తమ చేతివ్రాతలో రాసి చూసుకుని, ఆమేరకు తమ నవల అచ్చులో 100 పేజీలకు సరిపోయేలా ప్లాన్‌చేసుకుని 'చతుర'కు అనుకూలంగా వుండేసైజులో పంపడం మంచిపద్ధతి.**
- ★ **అవిధంగా నవలలు 'చతుర'కు సరిపడా లేకపోయినట్లయితే ఆయా నవలలు పరిశీలనార్హాలు కావని గమనించగోరుతున్నాం.**
- ★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటే తగు పోస్టేజిని జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగాని, ఇతరత్రాగాని పోయినసందర్భాల్లో మా బాధ్యత వుండదు.
- ★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ విషయం తెలియపరచడం, లేనిపక్షంలో తిప్పిపంపడం జరుగుతుంది.
- ★ **ప్రతి నవలకు అందజేసే రు: 3000/– పారితోషికం ఏనెల 'చతుర'లో ప్రచురిస్తే ఆనెల మొదటివారంలోనే పంపబడుతుంది.**

**ఎడిటర్:**

# చతుర

**'ఈనాడు' కాంపౌండ్ హైదరాబాద్-500 482.**




ఈ శీర్షికద్వారా ప్రతినెలా 'చతుర'లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్ళీ చెప్పకుండా, అవసరమైనమేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒకవైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర' ఈనాడు కాంపౌండ్, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

**మాకు సకాలంలో అందిన సమీక్షలలో ఎన్నికచేసిన అయిదు ఉత్తమ సమీక్షలకు రు. 100/- ప్రథమ బహుమతి, రు: 75/- ద్వితీయ బహుమతి, రు: 50/- చొప్పున మూడు తృతీయ బహుమతులను అందజేస్తున్నాం. పాఠకుల పరిశీలనాశక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.**

★ కొందరు బహుమతి విజేతలు తమ బహుమతి తాలూకు చెక్కు అందలేదనీ, అడ్రసు మారిందనీ రాస్తున్నారు. బహుమతి మొత్తాలు ప్రతినెలా మొదటివారంలోనే పంపుతున్నాం. అడ్రసుల విషయంలో కూపన్‌లో రాసేటప్పుడే జాగ్రత్తపడటం మంచిది. ఈ విషయంలో ఉత్తర ప్రత్యుత్తరాలు సాధ్యంకాదు.

కూపన్

**మే నెల చతుర నవల దూదిపూలు**

సమీక్షకుని పేరు : ......................................

చిరునామా : ......................................

......................................

......................................

......................................

ఫిజిక్సు పుస్తకం తెరుస్తూ పానకాలు కోసం చూశాడు.

ఏదో పని వుందని చెప్పి బజారుకు వెళ్ళిన పానకాలు యింకా తిరిగి రాలేదు.

పాపం అమాయకుడు. ఈరోజు కెమిస్ట్రీ పరీక్ష బాగా రాసిన ఆనందంలో రేపు రాయవలసిన ఫిజిక్స్ గురించి ఆలోచించటం లేదేమో అనుకొన్నాడు మనసులో.

ఏదో మైకు బండి పెద్ద శబ్దంలో వచ్చి చైతన్య రూము ముందే ఆగింది. రెండు సినిమా పాటల రికార్డులు మైకులో వేసి వీధిలోని వాళ్ళు అందరిచేతా బలవంతంగా వినిపించి అప్పుడు మైకు అందుకొన్నాడు ఎనౌన్సరు. మైకుతో పోటీ పడుతూ గొంతు చించుకొని అరుస్తున్నాడు.

"రండి... త్వరపడండి. నూతనముగా తయారు చేయబడుతున్న మా కంపెనీ సబ్బు బిళ్ళలు అతివల చర్మ సౌందర్యానికి మరింత మెరుగులు దిద్దుతున్నాయి. సినీ తార సౌందర్య చర్మ సౌందర్యంలా మీరూ చర్మ సౌందర్యం పొందాలనుకొంటున్నారా? అయితే మా బండి వద్దకు రండి. సబ్బులు కొనండి. మూడు సబ్బులు కొన్నవారికి బొట్టు బిళ్లల ప్యాకెట్టు ఉచితం!"

కర్ణకఠోరంగా వినిపిస్తున్న ఆ మైకు శబ్దానికి చెవులు చిల్లులుపడుతున్నాయి.

చదువుతున్న ఫిజిక్స్ పుస్తకాన్ని దూరంగా విసిరికొట్టాడు చైతన్య. అంతలో ఒక సినిమా బండి, దాని వెనుకనే లాటరీ టిక్కెట్ల బండి. ఆ రెండూ ఓ అరగంట వీధిని హోరెత్తించి వెళ్ళగానే.

"రండి. చూడండి. మీ అభిమాన థియేటర్‌లో రోజుకు నాలుగు ఆటలుగా ప్రదర్శించబడుతున్న గొప్ప హారర్ చిత్రం 'ఐ లవ్ యూ పిశాచీ' కనీ వినీ ఎరుగని రీతిలో అడుగు అడుగునా రక్త ధారలు కురుస్తూ ఒళ్ళు గగుర్పొడిపించే గొప్ప తెలుగు చిత్రం"

చైతన్య కుర్చీలోంచి లేచి బైటికి వెళ్ళి తొంగిచూశాడు.

సినిమా బండి కూడా వెళ్ళిపోయిందిగానీ సబ్బులబండి మాత్రం యింకా అక్కడే వుంది. దాని చుట్టూ చేరి చాలామంది ఆడవాళ్ళు సబ్బులు కొంటున్నారు. ఆ బండి యిప్పట్లో కదిలేట్టులేదు.

అసలే పరీక్షలకాలం. రకరకాల ప్రచారాలతో మైకులు అలా హోరెత్తిస్తుంటే పిల్లల చదువు ఎలా సాగుతుందా అన్న ఆలోచన, జ్ఞానం ఎవ్వరికీ లేదు. వాటిమీద నియంత్రణ లేదు. అడిగే నాథుడు వుండడు.

ఛీ...ఛీ... యిది నరకం.

పక్క పోర్షన్లోంచి టీ.వీ. బిగ్గరగా వినిపిస్తోంది "సారే జహాసె అచ్ఛా... హిందూ సుతాన్హమారా! హమారా"

గుండె పోటు మనుషులు వున్నా వాళ్ళు ఆ శబ్దాలకు గుండె ఆగి చావాల్సిందేగానీ మైకులను ఆపరు కదా... ఇక ఆఫ్టాల్ విద్యార్థుల పరీక్షలు ఎంత వీళ్ళకు!

రిక్షా ఒకటి వచ్చి ఇంటి ముందు ఆగింది. రిక్షాలోంచి దిగాడు ఇంటి ఓనరు కన్నప్ప. చైతన్యను చూసి ఆనందంగా నవ్వాడు.

"బజారునుంచా? " పలకరించాలి గనుక అడిగాడు చైతన్య.

"అవును... మైకు కోసం వెళ్ళాను" అని. "అబ్బాయ్! నువ్వు మైక్ సెట్టు దించుకొని నీ ఏర్పాట్లు నువ్వు చేసుకో! ఇదే మన ఇల్లు" అని చైతన్య వేపుకు తిరిగి, "ఇప్పుడు మా ఇంట్లో భజన ప్రోగ్రాం వుంది. మీరూ రావాలి" అన్నాడు ముఖం విప్పారుస్తూ.

"భజనా? " నొసలు చిట్లించాడు చైతన్య.

"అవును, భజనే! నాకు పోటీగా కొబ్బరికాయల కొట్టు పెట్టిన గురవయ్య మొన్న అయ్యప్ప భజన పెట్టాడు. వాడికి పోటీగా నేనిప్పుడు సాయిబాబా భజన పెడుతున్నాను. వాడు భజన పాటగాడ్ని లోకల్ వాడినే తెస్తే నేను గుంటూరు నుంచల్లా రామరాజుగార్ని పిలిపించాను. వాడు రెండు స్పీకరు గొట్టాలు పెడితే నేను నాలుగు పెడుతున్నాను" అని చెప్పాడు



కన్నప్ప.

మైకు సెట్టు అతను రిక్షాలోనుంచి సామాన్లు దించుకొన్నాడు. హడావుడిగా గోడలమీదికి ఎక్కి నాలుగు దిక్కులకూ వినిపించేట్టు నాలుగు స్పీకరు గొట్టాలు బిగించాడు. వాటి వైర్లను మైకుకు సెట్ చేసుకొని వాల్యూమ్ బాగా పెంచి "ఊఫ్... ఊఫ్" అని ఊదాడు.

మైకు బ్రహ్మాండంగా మోగుతోంది. "మైక్ టెస్టింగ్! మైక్ టెస్టింగ్!" అని అరిచాడు ఆనందంగా.

అప్పటికే పట్టుచీరలు కట్టుకొని అందంగా ముస్తాబయిన చాలా మంది భక్తులూ, వాళ్ళ వెనకాలే భర్తలూ అక్కడికి వస్తూ కని పించారు.

భజన కార్యక్రమం రాత్రి పదకొండు గంటలదాకా సాగుతుందని చైతన్యకు తెలుసు. ఆ పూటకిక చదువు సాగనట్టే! ఏం చెయ్యాలో అర్థంకాలేదు. దీనంగా చూస్తూ అక్కడే నిల్చున్నాడు.

ఆరోజు కొబ్బరి కాయల కొట్టు గురవయ్య ఏర్పాటు చేసిన అయ్యప్ప భజన కూడా మైకులో వినిపించింది అక్కడికి. ఆ భజ నలో కీర్తనలు పాడింది స్థానిక గాయకుడే పాంచజన్యం. సినిమా పాటల ఫక్కీలో అతను చాలా భక్తి కీర్తనలు పాడాడు ఆరోజు.

భజన రాత్రి పదకొండు గంటలదాకా సాగింది. చివరికి అతగాడు పాత కాలపు హిట్ సాంగ్ 'పయనించే ఓ చిలుకా ఎగి రిపో...' మాదిరి అయ్యప్ప భజన కీర్తన పాడాడు!

"శయనించే అయ్యప్పా... లేచిపో... భజనైపోయెను నేడూ. చద్దీ, భిక్షా ముక్కున గరచీ... భజనను పెట్టితినోయీ! రావాలీ సిరి-నా వెనువెంటా... సంపదె నా చేదోడూ..."

వహ్వా...వహ్వా... క్యా గానా హై! అదర గొట్టాడు పాంచజన్యం. కాకపోతే 'చద్దీ భిక్షా ముక్కున కరచీ భజనను పెట్టితినోయీ' అని పదేపదే అదే చరణం పాడి ఎత్తిపొడు స్తుంటే అయ్యప్ప కరుణామయుడు గనుక సరిపోయింది గానీ అదే యమధర్మరాజైతే వెంటనే యమపాశం మెడలకు బిగించి లాక్కొని వెళ్ళేవాడు పాడిన వాడిని, పాడిం చిన వాడిని కూడా.

ఇప్పుడు జరగబోయే భజన దానికి పోటీ భజన. పైగా గాయకుడు గుంటూరు నుంచి వచ్చాడు. ఎన్ని విచిత్రాలు చేస్తాడో చూడాలి!

భక్తులు కుదురుగా కూర్చున్నారు. కొంచెం సేపటికి అనుకున్నట్టే ఆర్భాటంగా భజన కార్యక్రమం మొదలైంది. అందరూ కళ్ళూ, చెవులూ విప్పార్చి వింటున్నారు. రామరాజు మైకు అందుకొని "ఇది ఛాలెంజి భజన" అని అనగానే మైకు యిక పలకనని మొరాయించింది.

"ఏమీ లేదు, మైకు వైరూడిందంతే" అంటూ మైకు కుర్రవాడు ఊడిన వైరును మళ్ళీ బిగించాడు. మైకు గరగరలాడింది. "మైక్ టెస్టింగ్! మైక్ టెస్టింగ్" అని అరి చాడు. అంతా బాగానే వుంది.

"ఇప్పుడు బ్రహ్మాండమైన హిట్ చిత్రం 'షోలే'లోని హిట్ సాంగ్ 'మెహబూబా... మెహబూబా' మాదిరి సాయిబాబా భజన కీర్తన. పాడుతున్న వారు గుంటూరు రామ రాజు!" అని చెప్పి క్షణం విరామం తరు వాత కీర్తన అందుకొన్నాడు!

"వూ...వూ...వూ...హు' సాయ్‌బాబా... సాయ్‌బాబ్బా... సాయ్‌బాబ్బా... సాయ్ బాబ్బా! వూ...వూ...వూ...హు! శిరిడీలో నువ్వున్నావు. గుంటూర్లో నేనున్నానూ... గుంటూర్లో నేనున్నానూ. శిరిడీలో నువ్వు న్నావూ! వూ...వూ...వూ...హు!"

అలా ఎంతకూ 'వూ...' అని వూదుతూ మధ్యమధ్యలో ఎవరు ఎక్కడ వున్నదీ అడ్ర సులు చెప్పి పీడిస్తూ రామరాజు వేధి స్తూంటే వారూ కరుణామయులు గనుక





సరిపోయిందిగానీ లేకుంటే కళ్ళు పేలిపో యేవే.

చైతన్యకు యిక అక్కడ వుండబుద్ధికా లేదు. చెవులు హోరెత్తిపోతున్నాయి. మెదడు మూసుకొని పోతోంది.

అలా సినిమాహాలుదాకా వెళ్ళి టీ తాగి వద్దాం అనుకొన్నాడు. అక్కడ్నించి కదలి వెళ్ళి గదికి తాళంవేసి బయలుదేరాడు.

ఇల్లు దాటి కొంచెందూరం వెళ్ళగానే పాన కాలు కలిశాడు.

"ఎక్కడికి వెళ్ళావ్? " అడిగాడు చైతన్య.

"బజారుకు!"

"ఎందుకూ? "

"ఇంక్ బాటిల్ తెచ్చుకోటానికి"

"అలా వెళ్ళి కొంచెం టీ తాగి వద్దాం పద" అన్నాడు చైతన్య ముందుకు నడుస్తూ.

పానకాలు అతడ్ని అనుసరించాడు. ఇద్దరూ కలసి సినిమాహాలు దగ్గరికి వెళ్ళారు. టీ స్టాలు ముందు టీ తాగుతూ నిల్చున్నారు.

అప్పుడు చెప్పాడు పానకాలు నింపాదిగా "చైతన్యా! మనం ట్యూషన్లలో చేరలేదని లెక్చరర్లకు చాలా కోపంగా వుందిట. నీకూ, నాకూ ప్రాక్టికల్స్‌లో మార్కులు తగ్గించి వెయ్యాలని అనుకొన్నారుట..."

"ఎవరు చెప్పారు నీతో? " అడిగాడు చైతన్య.

"ఎవరో ఒకరు చెప్పారులే... పేరెందుకు గానీ విషయం మాత్రం అది"

"నమ్మదగిన మనిషేనా చెప్పింది? "

"ఆc..."

"ఎవరూ? "

"పేరు చెప్పనని అన్నాను కదా!"

"నీ ముఖం. నువ్వు చెప్పేదంతా అబద్ధం"

"తల్లితోడు. కావాలంటే చెప్పాడో లేదో మన కాలేజిలో గంటలు కొట్టే తాతను అడుగు"

చైతన్య కిసుక్కున నవ్వాడు. "ఇంత అమాయకుడివి యీ సమాజంలో ఎలా బతుకుతావు పానకాలూ? " అన్నాడు బాధగా.

పానకాలు కూడా నిశ్శబ్దంగా నవ్వాడు.

టీ తాగటం పూర్తిచేసి ఖాళీ గ్లాసులూ, డబ్బులూ యిచ్చి టీ స్టాలు దగ్గరనుంచి తిరిగి రూముకు బయలుదేరారు.

కొంచెం దూరం వెళ్ళగానే సుధీర్ మోటారు బైక్‌మీద వెళుతూ వాళ్ళను చూసి బైక్ ఆపాడు. "హాయ్ చైతన్యా" అని పలు కరించాడు.

అతను రాగింగ్ విషయంలో గతంలో చైతన్యతో గొడవపడ్డా అది అతను మన సులో పెట్టుకోలేదు. అప్పటినుంచి రాగింగ్ జోలికి కూడా వెళ్ళలేదు. చైతన్యగానీ, పాన కాలుగానీ ఎక్కడైనా కనిపిస్తే స్నేహపూర్వ కంగానే పలుకరిస్తున్నాడు.

"ఎక్కడికి వెళ్తున్నావ్? " అడిగాడు చైతన్య.

సమాధానం వెంటనే చెప్పలేదు సుధీర్. చెప్పాలా, వొద్దా అన్న సందిగ్ధంలో పడి పోయి "ఎక్కడికా... ఎక్కడికా" అంటూ నసిగాడు.

"చెప్పకూడనిదయితే చెప్పొద్దులే!"

"అది కాదు విషయం. చెప్తే నువ్వు ఏమ నుకుంటావో అని ఆలోచిస్తున్నానుగానీ చెప్పక తప్పదు కదా" అని కొంచెం స్వరం తగ్గించి "రికార్డు డాన్సర్ల వీధికి వెళుతు న్నాను" అన్నాడు.

"అందులో చెప్పకూడనిది ఏముంది? "

"అది కాదు విషయం. ఆ వీధికి వెళ్ళి చాలా వివరాలు సేకరించాలి. మొత్తం డ్యాన్సు పార్టీలు ఎన్ని వున్నాయో, ఎంత మంది డ్యాన్సర్లున్నారో. వాళ్ళ పేర్లూ, డోరు నంబర్లతోసహా అడ్రసులూ కావాల్సొచ్చింది మాకు"

"అవ్వన్నీ మీకు ఎందుకూ? ఏం అవ సరం వచ్చింది? " ఆశ్చర్యంగా చూస్తూ అడి గాడు చైతన్య.



సుధీర్ ఎందుకో తల ఎత్తి దూరంగా చూశాడు. సినిమాహాలు దగ్గర నేరేడు సోడాలు అమ్ముతూ కనిపించింది.

"బ్రదర్! రాత్రంతా మందుకొట్టాం. దాహంగా వుంది. మనం అలా వెళ్ళి నేరేడు బండి దగ్గర సోడాలు తాగుతూ మాట్లాడు కొందాం" అన్నాడు.

మోటారు బైక్‌ను పక్కకు నెట్టుకొని వెళ్ళి శేషయ్య బీడీ బంకు దగ్గర ఆపి స్టాండు వేశాడు. తాళం కూడా వేసి తాళంచెవిని జేబులో పెట్టుకొని నేరేడు దగ్గరికి దారితీ శాడు.

చైతన్య, పానకాలు అతనివెంట సోడా బండిదగ్గరికి వెళ్ళారు.

"మూడు సోడాలు కొట్టు" చెప్పాడు సుధీర్.

"మూడు ఎందుకూ! నేనూ, పానకాలూ యిప్పుడే టీ తాగాం. రూముకు వెళుతుంటే నువ్వు కలిశావు. మాకు సోడాలు వద్దుగాని నువ్వు తాగు" అన్నాడు చైతన్య.

"ఒక సోడా యివ్వు నేరేడూ" అని నేరేడువైపు చూపులు గుచ్చుతూ అడిగాడు సుధీర్.

అతనికి చాలా కాలంగా నేరేడు తెలుసు. అవసరంలేకపోయినా పనిగట్టుకొని వెళ్ళి అప్పుడప్పుడూ నేరేడు అందాలను కళ్ళతో తాగుతూ కేవలం సోడా తాగాలన్న మిషతో ఆమెను చూస్తూ వుండటం అతనికి అల వాటు.

నేరేడు సోడా కొట్టి సుధీర్‌కు అందిం చింది నవ్వుతూ.

ఒక గుక్క సోడా తాగి సీసాను చేతులు మధ్య విచిత్రంగా కవ్వం చిలికినట్టే తిప్పుతూ. "ఈ చీరలో నువ్వు భలే బాగు న్నావు నేరేడూ" అన్నాడు సుధీర్.

చాలామంది నోళ్ళనుంచి అలాంటి మాటలే వింటూ అలా వినేందుకు అల వాటు పడింది నేరేడు. సుధీర్ కూడా అలా చాలాసార్లు అన్నాడు. అలా అనటానికి, తను అందంగా ముస్తాబై మంచి చీరకట్టు కొని తలనిండా పూలుపెట్టుకొని కనిపించ టానికీ సంబంధంలేదు!

తను స్నానం చెయ్యకుండా వచ్చినా, రంగు వెలిసిన పాత చీర, చిరుగుల జాకెట్టూ వేసుకొని కనీసం మొఖాన యింత బొట్టు అయినా పెట్టుకోకుండా పుసి కళ్ళతో కనిపించినా అలాగే అంటారు. ఎంత మాత్రమూ నిబద్ధత వుండదు వాళ్ళు అలా అనటంలో. సమావేశాల్లోనూ, సభలలోనూ జాతీయగీతం పాడినంత కృతకంగా వుంటుంది.

"మైనరుబాబు యివ్వాళ చాలా హుషా రుగా వున్నాడు... ఎందుకనో?" అంది నేరేడు సోడాలు సర్దుతూ.

"నిన్ను చూడగానే వచ్చింది హుషారు" అన్నాడు సుధీర్ నవ్వుతూ.

వాళ్ళిద్దరూ అలా మాట్లాడుకొంటుంటే చైతన్య ఎందుకో తలతిప్పి నేరేడు వైపు చూశాడు. ఇంద్రనీలంలా అందంగా కనిపిం చింది.

అలా చూడటం సభ్యత కాదనుకొని సుధీ ర్‌వైపుకు తిరిగి "ఇందాక డ్యాన్సర్లు విషయం ఏదో చెప్పబోయి ఆగావు. ఏమిటది?" అడి గాడు చైతన్య.

"ఓ... అదా! మేము కొంతమంది సంఘ సంస్కర్తలం కలసి రికార్డు డ్యాన్సులమీద ధ్వజమెత్తాం. డ్యాన్సులను నిషేధించమని ప్రభుత్వాన్ని డిమాండు చేస్తూ ఉద్యమం కూడా చేపట్టాం" చెప్పాడు సుధీర్.

"ఎందుకని?"

"అదొక పెద్ద కథ..."

ఎటో చూస్తూ నిల్చున్న నేరేడు చివాలున వాళ్ళవైపుకు తిరిగింది. సుధీర్‌కేసి తీక్ష ణంగా చూస్తూ "ఆ కథ ఏమిటో నాకు తెలుసులే! నువ్వు గేదె పుండుకు ముక్కుతో మందు రాస్తున్నానని చెప్పే కాకిలాంటి వాడివి. కాకమ్మ కథలు ఎన్నయినా చెబు తావు నీకేం!" అంది ఎకసెక్కెంగా.





చైతన్య, పానకాలు అయోమయంగా చూశారు. సుధీర్‌తో ఆమె అలా ఎందుకు అందో అర్థంకాలేదు వాళ్ళకు.

సుధీర్ ముసిముసి నవ్వులు నవ్వుతూ ఖాళీ సోడా సీసా, డబ్బు నేరేడుకు యిచ్చి "అడగటం మర్చేపోయాను. మీరిద్దరూ యిలా వచ్చారేం? సినిమాకు వెళ్తున్నారా?" అని అడిగాడు చైతన్యను.

చైతన్య 'కాదు' అన్నట్టు తల అడ్డంగా వూపాడు. "రేపు ఫిజిక్సు పరీక్ష పెట్టుకొని ఎలా వెళ్తాం సినిమాకు?" అన్నాడు.

సుధీర్ ఆశ్చర్యంగా చూశాడు అతనివైపు. "రేడియోలో వార్తలు వినలేదా?" అడిగాడు.

"లేదు... ఏమిటి విశేషం?"

"మన పరీక్షలు వాయిదా పడ్డాయి. నిన్న జరిగిన కెమిస్ట్రీ పరీక్ష కూడా రద్దు చేశారు"

"ఎందుకని?" నిర్ఘాంతపోతూ అడిగాడు చైతన్య.

"పరీక్షా పత్రాల లీకేజి!" చెప్పాడు సుధీర్.

వాళ్ళు ఆశ్చర్యపోయారు. క్రమంగా వాళ్ళ మనసుల్లో ఆందోళన చోటుచేసుకొంది. ట్యూషన్లకు వెళ్ళకుండానే మంచి మార్కులతో పరీక్షలు పాసుకావాలని పట్టుదలతో చదివారు ఇద్దరూ. జరిగిన కెమిస్ట్రీ పరీక్ష చాలా బాగా రాశారు. అలాంటిది యిప్పుడు పరీక్షలు రద్దు కావటం వాళ్ళకు బాధ అనిపించింది.

"ఎవరో ప్రైవేటు రెసిడెన్షియల్ కాలేజి వాళ్లూ, అధికారులూ కుమ్మక్కయి ప్రశ్నపత్రాల వ్యాపారం చేశారట. అందువలన పరీక్షలు రద్దు అయ్యాయని చెప్పారు"

"నిజమా?" పాలిపోయిన ముఖంతో చూస్తూన్నాడు చైతన్య.

"నిజం కాకపోతే ఆకాశవాణి ఎందుకు పలుకుతుంది! నిజమే అది."

"ఆశ్చర్యంగా వుంది కదూ?"

"అందులో ఆశ్చర్యం ఏముంది? అలా పరీక్షా పత్రాలు లీకు కావటం మనకు యివ్వాళ కొత్తేమీకాదు. చాలా కాలంగా జరుగుతున్నదే. అది వజ్రాల వ్యాపారం కన్నా లాభసాటి వ్యాపారం. ఎవరు మాత్రం చెయ్యకుండా వూరుకుంటారు, డబ్బు విలువ తెలియని సోమరిపోతులు తప్ప?"

చైతన్య రక్కున తల ఎత్తి అతనివైపు బాధగా చూశాడు. సమస్యపట్ల అతగాడికి వున్న అవగాహనకు మనసు వికలమైంది చైతన్యకు.

"మళ్ళా ఎప్పుడు జరుపుతారుట పరీక్షలు?" అడిగాడు.

"త్వరలో...!"

"అంటే?"

"తెలీదు... అంతవరకే చెప్పారు రేడియోలో. థాంక్‌గాడ్, నిన్న కెమిస్ట్రీ పరీక్ష అంత ఛండాలంగా రాశాను. దిద్దేవాడు పెద్ద మనసు చేసుకొని దిద్ది ఉదారంగా మార్కులు వేసినా పదికి మించి వేసే అవకాశం లేదు. ఆ పరీక్ష కూడా రద్దయింది. అయాం వెరీ హేపీ..."

"నీలాంటి కారణ జన్ములకు ఎప్పుడూ హేపీనే! నేనూ, పానకాలూ పరీక్ష బాగా రాశాం. మాలాంటి వాళ్ళ సంగతి ఏమిటి?"

"బాగా రాయగలిగిన వాళ్ళు ఎన్నిసార్లు పరీక్షలు పెట్టినా బాగానే రాయగలరు. మీకేం బాధ. ప్రభుత్వం మాలాంటి వాళ్ళ విషయం కూడా పట్టించుకోవాలి కదా! 'గవర్నమెంట్ ఫర్‌ది పీపుల్... బైది పీపుల్' అని వినలేదూ? మేం కూడా మనుషులమే!" అని వెళ్ళిపోయాడు సుధీర్ నవ్వుతూ.

చైతన్య, పానకాలూ ఒకళ్ళ ముఖం ఒకళ్ళు చూసుకొన్నారు. ఇద్దరి ముఖాలూ వాడిపోయి వున్నాయి.

"షిట్! ఇది ఒక నరకం" అన్నాడు చైతన్య కోపంగా.



అయ్యరు టీ స్టాల్లోంచి "సారే జహాసె అచ్ఛా" అని వినిపిస్తోంది రేడియోలో.



నేరేడుని ఆకలి చూపులు చూస్తూ సోడాబండి పక్కనే వున్న బార్బర్‌షాపు దగ్గర చెక్కబల్లమీద కూర్చొని వున్నాడు కానిస్టేబులు వీరాస్వామి చాలా సేపటి నుంచి.

సుధీర్‌తో కలిసి చైతన్య, పానకాలూ, నేరేడు సోడా బండి దగ్గరికి వెళ్ళినప్పుడు మాత్రం అతను వాళ్ళను చూడలేదు. గడ్డి లారీ వొస్తే దానిని ఆపి మెయిన్ రోడ్డు మీంచి వెళ్ళకూడదని, బైపాస్ రోడ్డులో ఊరి చుట్టూ తిరిగి వెళ్ళాలనీ చెప్పేందుకు రోడ్డు మీదికి వెళ్ళాడు.

లాఠీతో లారీ టైరుమీద కొట్టి డ్రయివరును భయపెట్టి వాడి దగ్గర పది రూపాయలు గుంజి మెయిన్‌రోడ్డుగుండానే వెళ్ళేందుకు అనుమతించి వచ్చేసరికి అతగాడికి తలప్రాణం తోకకువచ్చింది.

"ఉస్... అబ్బా!" అంటూ తలమీంచి టోపీ తీసి చెక్కబల్లమీద విసిరేసి కూర్చోగానే 'షిట్! యిది నరకం' అన్న చైతన్య మాటలు సోడాబండి దగ్గరనుంచి వినిపించాయి.

కానిస్టేబులు వీరాస్వామి ముఖం చిట్లించి అటువైపు చూశాడు. అలా అంది ఎవరో గ్రహించాడు. తను లారీ ఆపి డ్రయివరు దగ్గర డబ్బులు గుంజటం అతను చూశాడా? డబ్బులు గుంజి లారీని మెయిన్‌రోడ్డుమీంచి వెళ్ళేందుకు అనుమతించింది గమనించాడా?

అంతే అయివుంటుంది. అందుకే అతనలా 'యిది నరకం' అనివుంటాడు. కానిస్టేబులు వీరాస్వామినే అంతమాట అంటాడా వాడు! వాడికి పోలీసు అంటే ఏమిటో ఒకసారి తెలియచెప్పాలి. ఇక జీవితంలో మళ్ళీ ఎప్పుడూ పోలీసుల విషయం పట్టించుకోడు.

అయినా కుర్రకారు, చదువుకొనే బుడతలకు కూడా పోలీసులంటే భయం, గౌరవం లేకుండా పోయింది. అది కుర్రవాళ్ళ తప్పేం కాదు, పోలీసులదే! అందరినీ మర్యాదగా చూడటం, ఎవరికి ఏం కష్టం వచ్చినా హుటాహుటిన వెళ్ళి వాలటం... వాళ్ళ కష్టాలు తీర్చటం.

'అలగా జనానికి' అలా సేవలు చేస్తూనే కదా డిపార్టుమెంటు అందరికీ అలుసైపోయింది!

తెలంగాణాలో 'ఖట్‌మల్' అంటారు జనం. పోలీసులు నల్లులా? ఎవర్ని కుట్టి లేక కొట్టీ రక్తం కళ్ళ చూస్తున్నామని? ఎవరిని నల్లుల్లా వేధిస్తున్నామని?

ఛత్! పోలీసుల మంచితనాన్ని జనం అసమర్థత అనుకొంటున్నారు.

ఇంకా తెలంగాణా కొంచెం నయం. 'ఖట్‌మల్' అని అయినా పిలుస్తుంటారు. కోస్తా వాళ్ళు అసలు పిలవనే పిలవరు. దూరంగా తొలగిపోతారు. రాయలసీమ వాళ్ళు మరీనూ...! అసలు దగ్గరికే రానివ్వరు. తుపాకులు చూపిస్తారు.

ఇంతా జరుగుతున్నది పోలీసుల మంచితనంవల్లనే కదా? పోలీసుల మానవతా దృక్పథంవల్లనే కదా?





ఇకనైనా మారాలి పోలీసులు. మానవత్వం మరచిపోవాలి. మంచితనం కట్టిపెట్టాలి. అందర్నీ లాఠీలతో కుళ్ళబొడవాలి. వాళ్ళ లంగాల్లోకీ, ప్యాంటుల్లోకీ తొండల్ని వొదలాలి. వాళ్ళ గోళ్లలో గుండుసూదులు గుచ్చాలి. వాళ్ళ నోళ్లలో మూత్రంపోసి ముక్కు మూసి గుటకలు వేయించాలి. వాళ్ళ పెళ్ళాలను వాళ్ళ కళ్ళముందే బట్టలు వూడదీసి నగ్నంగా నిలబెట్టాలి. ఓపిక వుంటే రేప్ చెయ్యాలి. వాళ్ళ భర్తల్ని అడవుల్లోకి తీసుకెళ్ళి తుపాకులతో కాల్చించాలి. వాళ్ళ శవాలను పోష్టుమార్టం, సాక్ష్యం లేకుండా అడవి కట్టెలతో పోలీసులే తగలబెట్టాలి. వాళ్ళ శ్రాద్ధ కర్మల్ని పోలీసులే పెట్టాలి. దొంగనాకొడుకులు!

అంతే... అంతే!

లాకప్పు గదిలో వున్న ఆడదాన్ని అర్ధరాత్రి బైటికి తీసి బలవంతంగా పోలీసులు మానభంగం చేశారట. తాటికాయంత అక్షరాలతో అన్ని పత్రికలలో వేశారు. అదీ ఒక వార్తే? పైగా పోలీసులందరూ తాగొచ్చి మానభంగం చేశారుట!

సారాయి ప్రభుత్వాన్ది. లాకప్పు గది ప్రభుత్వాన్ది. లాకప్పు గది వున్న పోలీసుస్టేషను ప్రభుత్వాన్ది. మానభంగం చేసిన పోలీసువాళ్ళు ప్రభుత్వం వాళ్ళు. ఈ ప్రజల కోసం నానా పాట్లూ పడుతూ ఇరవై ఏడు వేల కోట్ల రూపాయలకు అప్పులపాలైనా యింకా ప్రేమ చావక యీ ప్రజలకోసం పనిచేస్తున్న ప్రభుత్వంలో, దాని పోలీసుస్టేషన్‌లో, దాని లాకప్పు గదిలో పోలీసులు అది అమ్మిస్తున్న సారాయి తాగి ఒక్క మానభంగంతో అంతమంది సరిపెట్టుకొంటే దానికి యింత రాద్ధాంతం చెయ్యాలా? పత్రికల్లో వెయ్యాలా? అసెంబ్లీలో అడగాలా?

విశ్వాస రాహిత్యం అంటే అదే మరి. ఇలాంటి విశ్వాసం లేనివాళ్ళను మానభంగం చేసి వదలకూడదు. మానభంగం చెయ్యాలి, లాకప్పుడెత్తూ కావాలి.

పైగా ఆడదాన్ని అర్ధరాత్రి తాగొచ్చి మానభంగం చేశారని రాస్తారా వీళ్ళు! తాగకపోతే మానభంగం చెయ్యటంలో మజా ఏముంటుంది? అంతమాత్రం కామన్సెన్సు వుండద్దూ ఒక వార్త రాసేప్పుడు? అర్ధరాత్రి అలా చేశారుట, అందునా ఆడమనిషిని!

ఆడమనిషిని కాకుండా మగమనిషిని రేప్ చేస్తారా? అంత కర్మ ఏం పట్టింది పోలీసులకు, కో అంటే కోటిమంది ఆడాళ్ళు. అర్ధరాత్రి కాకుండా పట్టపగలు చేస్తారా మానభంగం? అది కూడా తెలియదు యీ పత్రికలవాళ్ళకు. ఎలా రాయాలో వాళ్ళకు తెలియదు సరికదా! 'సురక్ష'ను చూసయినా నేర్చుకోరు.

చావనీ... ఏం చేస్తాం. ఎదుటివాడి అజ్ఞానాన్ని జ్ఞానంగా అంగీకరించినంత కాలం మన గౌరవానికి భంగం రాదు. అజ్ఞానాన్ని అజ్ఞానం అని చెప్పినప్పుడే పేచీ!

పులిమీద పుట్రలా ఆ వెధవ లాకప్పుడెత్తొకటి! మొన్న జరిగిన అసెంబ్లీ ఎలక్షన్లప్పుడు రెండు కులాల వాళ్లూ కొట్టుకొని తీరా ఒక ఎరుకలోడ్ని చంపారు. ఎరుకలోడి మర్డరు కేసులో యానాదోడ్ని తెచ్చి నాలుగిచ్చుకొంటే వాడు ఢామ్మున చచ్చూరుకున్నాడు.

ఆ చచ్చినోడిది వీక్ బాడీ... నరాల బహీనత... గుండె లబ్... డబ్ అని కొట్టుకోదు. మనలాగా శ్వాస ఒకసారి పీల్చింది బైటికి వెళ్ళటం, మళ్ళీ మళ్ళీ గాలిపీల్చి వదలటం, వాడికి అట్టాలేదు. లాఠీ దెబ్బలు పడంగానే లోపలికి పీల్చిన గాలిని బైటికి వొదిలాడో లేదోగానీ, మళ్ళీ మాత్రం శ్వాస పీల్చలేదు. పీలుస్తానంటే పోలీసులేమైనా వొద్దన్నారా? పీల్చకుండా చచ్చిందానికి పోలీసులు ఏం చేస్తారూ?

దానిక్కూడా పెద్ద రాద్ధాంతం. అందరూ పోలీసువాళ్ళను ఆడిపోసుకొనే వాళ్ళేగానీ వాస్తవం ఆలోచించేవాళ్ళున్నారా? పోలీసులూ, రిటైరైన పోలీసులూ, హోంమంత్రీ, ఆయనకాపదవియిచ్చిన ముఖ్యమంత్రీ తప్పు!



వాడికి ఇంట్లో వాళ్ళు పౌష్టికాహారం పెట్ట లేదు. అందుకే వాడు వీకయ్యాడు. అందుకే నరాల బలహీనతొచ్చింది. అందుకే గుండె ఆగిపోయింది. వాడినలా బలహీనంగా తయారుచేసిన వాడి ఇంట్లో వాళ్ళను అనాలి. పోలీసుదెబ్బలకు తట్టుకోలేనంతగా తయారు చేసిన వాళ్ళను బొక్కలో తొయ్యాలి.

బాస్టర్డ్స్.

అదలా వుంచి గుండె బలహీనంవల్ల కాకుండా వాడు పోలీసు దెబ్బలకే చచ్చాడు అనుకొందాం. గుండె బలహీనత, నరాల వీక్నెస్సూ లేదనే అనుకొందాం. మనిషి బలంగా మైక్‌టైసన్లా వున్నాడనే అను కొందాం. పోలీసులు కొడితేనే చచ్చాడు అనుకొందాం.

మరైతే వాడూ ఒకడ్ని కొట్టి చంపాడన్న అనుమానం మీదనే కదా లాకప్పుకు తెచ్చింది. వాడ్ని పోలీసులు కొట్టి చంపితే తప్పా?

ఛీ... ఛీ... నీతిలేని లోకం యిది. దీనికి లాఠీతో గుణపాఠం చెబితేనే తప్ప పోలీసు లంటే భయపడరు!

చివాలున చెక్కబల్లమీదినుంచి లేచి నిల్చు న్నాడు కానిస్టేబులు వీరాస్వామి. టోపీ తల మీద పెట్టుకొని లాఠీ అందుకొని గబగబా నడుస్తూ నేరేడు సోడా బండి దగ్గరికి వెళు తూనే.

"ఎవర్రా నువ్వు? ఎవర్ని నరకం అంటు న్నావ్?" అడిగాడు చైతన్యవైపు తీక్షణంగా చూస్తూ.

ఒక పోలీసు అలా దగ్గరికి వచ్చి మాట్లా డటం పానకాలు జీవితంలో అదే మొదటి సారి. కొంచెం భయంగానూ, కొంచెం ఆశ్చ ర్యంగానూ వీరాస్వామివైపు చూశాడు.

అతను అలా మాట్లాడటం నేరేడుకు వింతగా అనిపించలేదు. కానిస్టేబులు వీరా స్వామే కాదు. ఏ కానిస్టేబులయినా వాళ్ళు మాట్లాడే విధానం అలాగే వుంటుందని నేరే డుకు తెలుసు.

అంతే కాదు, అలాంటి వాళ్ళ స్వభావానికి తోడు వీరాస్వామి ప్రతి రోజూ సోడా కావా లనో-సోడా సీసాలు కడిగే నీళ్ళ బకెట్లోంచి నీళ్ళు తీసికొని చేతులు కడుక్కోవాలనో పది రూపాయల కాయితమో ఐదు రూపాయల కాయితమో చేత పట్టుకొని చిల్లర కావాలనో అలా ఏదో ఒక మిషమీద తన దగ్గరికి వస్తుంటాడు ప్రతిరోజూ.

ఒక్కొక్కసారి దాష్టీకం చూపిస్తూ సోడా బేరం బాగా వున్నప్పుడు 'బండిదగ్గర అంత మంది గుమికూడకూడదు. అలా గుమికూ డితే ట్రాఫిక్కుకు అడ్డం' అంటూనో దగ్గరికి వచ్చి లాఠీతో బండి చక్రాలమీద దడదడా కొట్టి జనాన్ని బెదరగొడుతుంటాడు.

'ఏయ్ నేరేడూ! సోడా బండి దూరంగా పెట్టుకో. డిఎస్పీ దొరగారి దొరసానిగారు సినిమాకు వొస్తున్నారు' అంటాడు ఒకరోజు. 'సిఐ దొరగారి దొరసానిగారు వస్తున్నారు' అని బండిని దూరంగా తానే లాక్కొని పోతాడు మరొకరోజు.

ఒక్కోసారి నిజమే చెబుతాడు కానిస్టే బులు వీరాస్వామి. అతను చెప్పినట్టే ఎవరో ఒక పోలీసు దొరసాని గవర్నమెంటు జీపు లోనో, పెట్రోలింగు వాహనంలోనో, ఆ రెండూ అందుబాటులో లేనప్పుడు పోలీసు వ్యాన్లోనో వచ్చి సినిమా హాల్లోకి వెళ్ళి కూర్చుంటారు, సినిమా చూస్తూ.

ఇప్పుడు కూడా కానిస్టేబులు వీరాస్వా మిని అలాగే అంచనా వేసింది నేరేడు. అతను చైతన్యను అలా కోపంగా అడగ టంతో అది నిజంగానే కోపం అనుకోలేదు.

తనను తనివితీరా దగ్గరగా చూడాలని అతనలా చైతన్యమీద కోపం నటిస్తూ వొచ్చా డని అనుకొంది నేరేడు.

"చాల్లేయిక వూరుకో. పాపం అతనేమ న్నాడని అలా రెచ్చిపోతున్నావ్?" అంది నిర్లక్ష్యంగా.

కానిస్టేబులు వీరాస్వామి నేరేడువైపు




నొసలు చిట్లించి చూస్తూ "నీకు అనవసర మైన విషయాలలో జోక్యం కల్పించుకోవద్దు" అని వెంటనే చైతన్యవైపుకు తిరిగి "చెప్పవే మిరా, నరకం అని ఎవర్ని అన్నావ్?" అడిగాడు గుడ్లు మిటకరించి చూస్తూ.

కానిస్టేబులు అలా ఎందుకు ప్రవర్తిస్తున్నాడో? అలా నిష్కారణంగా ఎందుకు అతిగా ప్రవర్తిస్తున్నాడో చైతన్యకు అర్థంకా లేదు.

అతని వైఖరికి కొంచెం ఆవేశం కూడా వొచ్చింది. "నరకం అని ఎవరినీ అనరు అంటే 'నరకాసురుడు' అంటారు గాని. ఒక ప్రదేశాన్నో, ఒక వ్యవస్థనో అంటారు నరకం అని" చెప్పాడు చైతన్య.

"నేనా లారీ దగ్గరికి వెళ్ళటం చూశావా నువ్వు?" అడిగాడు వీరాస్వామి చైతన్యను.

"లారీనా...?"

"నేను డ్రయివరుతో మాట్లాడానని తెలుసుకదూ నీకు?"

"తెలియదు. నేను చూడలేదు" అన్నాడు చైతన్య.

వీరాస్వామి పరీక్షగా చైతన్య కళ్ళలోకి చూశాడు. అతని మనసులోని భావాలను గ్రహించాడు.

ఆశ్చర్యం, కొంత కోపం తప్ప చైతన్య కళ్ళలో ఎలాంటి యితరమైన భావాలూ కనిపించలేదు కానిస్టేబులు వీరాస్వామికి.

స్టార్ట్ విత్ డౌట్- ఎండ్ విత్ సర్టెనిటీ! చైతన్యను అనుమానించాడు. అతని కళ్ళలోని భావాలను చదివి అతను తను లారీ డ్రయివరుతో జరిపిన లావాదేవీ చూళ్ళేదని నిర్ధారణ చేసుకొన్నాడు.

అంతటితో అతడి కోపం చల్లారిపోయింది గానీ వెంటనే తల వొంచుకొని వెళ్ళిపోతే పోలీసు బెట్టు పోతుందని అనుకొని "నీ పేరేంటి?" అని అడిగాడు చిన్నగా.

"చైతన్య"

"ఏం చేస్తుంటావ్?"

"డిగ్రీ చదువుతున్నాను"

"ఏ కాలేజి?"

చెప్పాడు చైతన్య.

"ఇతను ఎవరు?" పానకాలును చూస్తూ అడిగాడు.

"నా క్లాస్‌మేట్... పేరు పానకాలు"

"సరేగానీ యిందాక 'షిట్! ఇదొక నరకం' అన్నావు దేన్ని గురించి?"

"మన దేశంలో వున్న పరిస్థితులను గురించి"

"దేశభక్తి లేదా నీకు?"

"ఉంది"

"ఉంటే అలా ఎందుకు అన్నావ్?"

"ఉంది గనుకనే అన్నాను, చెడిపోయింది దన్న బాధతో"

"మీ కాలేజిలోనే చదువుతున్న సుధీర్ తెలుసా నీకు?"

అప్పుడు మళ్ళీ కల్పించుకొని "యిందాక అందరూ కలిసే వచ్చారు. సుధీర్... అదే మన మైనరుబాబు కూడా వచ్చాడు. వీళ్ళందరూ స్నేహితుల్లాగానే వున్నారు" చెప్పింది నేరేడు సోడాలమీద కప్పిన వరిగడ్డి మీద నీళ్ళు చిలకరిస్తూ.

"మరి సుధీర్ ఏడి?" అడిగాడు వీరాస్వామి.

"రికార్డు డ్యాన్సర్ల వీధికి వెళ్ళాలని చెప్పి వెళ్ళిపోయాడు" చెప్పాడు చైతన్య.

కానిస్టేబులు వీరాస్వామి అదోలా నవ్వి "అయితే గురుడు పట్టిన పట్టు విడవకుండా అదే ప్రయత్నంలో వున్నాడన్నమాట. పట్టుదల అంటే అలా వుండాలి. అందుకే సుధీరంటే నాకు చాలా యిష్టం"

"సుధీర్ మీకు తెలుసా?" అతడ్ని అడిగాడు చైతన్య.

నేరేడు చివాలున తలెత్తింది. చైతన్యవైపు చూస్తూ,

"తెలుసా? అని అడుగుతావేం, వీళ్ళందరూ ఒకటే తోడుదొంగలు" అంది.

"మైనరుబాబంటే ఎవరూ?" నేరేడును అడిగాడు చైతన్య.

"సుధీర్‌నే మైనరు బాబు అంటుంటాం!" అని, "అతను మీ స్నేహితుడే అయినా అతను చేసే నిర్వాకాలను గురించి మీకేమీ తెలిసినట్టు లేదు. అలాంటి వాళ్ళతో స్నేహం చాలా ప్రమాదం. కొంచెం జాగ్రత్తగా వుండండి"

"అతను మాకు స్నేహితుడేమీ కాదు. ఒకే కాలేజిలో చదివే వాళ్ళం గనుక పరిచయం వుంది అంతే!"

"అంతవరకే వుండండి, మీకే మంచిది. మైనరుబాబు యిందాక నీతో డాన్సులు జరగకుండా ఆపించాలని ప్రయత్నం చేస్తున్నట్లు చెప్పాడు కదా, అతనలా ఎందుకు చేస్తున్నాడో తెలుసా? "

"తెలీదు"

నేరేడు ఏదో చెప్పబోయింది. సరిగ్గా అప్పుడే "నేరేడూ!" అని పిలిచాడు కానిస్టేబులు వీరాస్వామి.

"ఏమిటి? " అడిగింది నేరేడు.

"అందరికీ చెప్పి మా జాతకాలు బైటపెడితే ఒప్పుకోను!"

"ఒప్పుకోక ఏం చేస్తావ్? "

"ఎన్‌కౌంటర్ చేస్తాను. నిన్ను లాకప్పులో చంపినా ఎవ్వరూ అడిగేవాళ్ళు లేరు జాగ్రత్త" అని నవ్వుతూ కదిలాడు వీరాస్వామి. రీవిగా నడుస్తూ శేషయ్య బీడీబంకు దగ్గరికి వెళ్ళిపోయాడు.

"సుధీర్‌ను మైనరుబాబు అని ఎందుకు అన్నానో చెప్పనా? " అంది నేరేడు చైతన్య వైపు చూసి నవ్వుతూ.

చైతన్య ఆసక్తిగా చూశాడు చెప్పమన్నట్టు.

"ఇళ్ళలో పెద్దవాళ్ళు డబ్బు కూడబెట్టి లెక్కాజమాలేకుండా కొడుకులకు యిస్తుంటే ఆ డబ్బుతో, బంగారం గొలుసులు మెళ్ళో వేసుకొని మోటారు సైకిళ్ళమీద తిరుగుతూ, తాగుతూ, తింటూ అమ్మాయిలను వేటాడే బలాదూరు వెధవలను అలా అంటాం మేం. అందుకే సుధీర్‌ను కూడా అలాగే పిలుస్తుంటాం"

చైతన్య ఆమెకేసి ఆశ్చర్యంగా చూశాడు! సోడాలు అమ్మే ఒక అమ్మాయి అలాంటి వాళ్ళను అంత బాగా అంచనా వెయ్యగలిగిందంటే ఈ సభ్యసమాజం ఎంత అసహ్యించుకొంటోందో వాళ్ళను! అయినా వాళ్ళు అలాంటి జీవితం గడిపేందుకే సిద్ధపడుతున్నారంటే వాళ్ళ జన్మ తీరులోనే ఏదో లోపం వుండాలి అనుకున్నాడు మనసులో.

"మీకు మైనర్‌బాబు గురించి తెలియదన్నారు కదూ? చెబుతాను వినండి!" అంది నేరేడు.

చైతన్య, పానకాలు చెవులు రిక్కించారు.

★ ★ ★

జంగయ్యకు 'సోషలిజం' అంటే వల్లమాలిన అభిమానం. అది మన దేశానికి వచ్చే దాకా ఆర్థిక అసమానతలు తొలగవనీ, అవి తొలగిపోనంతకాలం అవసరాలక్కూడా డబ్బులేని మనుషులూ, అవసరాలు లేకపోయినా డబ్బు దాచుకొనే మనుషులూ... అలా సమాజంలో రెండు రకాల మనుషులు వుండటం అనివార్యం అంటాడు జంగయ్య.

ఒక మనిషి అవసరంలో వున్న మరో మనిషికి వడ్డీలకు డబ్బు యిచ్చే పరిస్థితిని వ్యవస్థే కల్పించింది గనుక వ్యవస్థ మారే దాకా వడ్డీ వ్యాపారం ఎవరు చేసినా అది వ్యక్తుల తప్పేమీ కాదని వాదిస్తుంటాడు జంగయ్య.

ఒక్క సోషలిజం పట్లనే కాదు, పరిణామ సిద్ధాంతంమీద కూడా అతనికి మంచి అవగాహన ఉంది. గొర్రెదాటుగా కాకుండా స్వతంత్రంగా ఆలోచించి సిద్ధాంతంపట్ల తనదైన అవగాహన కలిగి వున్నాడు జంగయ్య. అతడు మార్క్స్‌తో విభేదించేది అక్కడే!

- ప్రతి మనిషికీ తిండి, బట్ట, ఇల్లు కావాలంటే వర్గ పోరాటం జరిగి శ్రామికులు ఆ పోరాటంలో జయించి అధికారంలోకి రావాల్సిన అవసరం ఎంతమాత్రమూ లేదం




టాడు.

అందుకు తనను తానే ఓ సజీవ సాక్ష్యంగా చూపిస్తూ కేవలం పదివేల రూపాయల పెట్టుబడితో వడ్డీ వ్యాపారం ప్రారంభించిన తను ఎలాటి వర్గపోరాటమూ చెయ్యకుండానే యీనాడు ఆర్థికంగా బలపడడాన్ని సోదాహరణగా వివరిస్తుంటాడు. పరిణామ క్రమంలో అంచెల వారీగా ఎదిగిన వైనాన్ని చెబుతుంటాడు.

ఆ రాత్రి జంగయ్య యింట్లో కోడికూర వండారు.

దీపాలు వెలిగించీ వెలిగించకముందే కడుపునిండా భోంచేసి చెయ్యి కడుక్కొని వరండాలోకి వెళ్ళి నిల్చున్నాడు జంగయ్య. 'బ్రేవ్'మని త్రేనుస్తూ తన ఇంటి కాంపౌండులోనే అద్దెలకు యిచ్చిన గదుల వైపుకు చూస్తూ పేరుపేరునా అందరినీ పిలిచాడు.

పెద్ద కాంపౌండు వాలూ... దానిలో వరుసగా పది సంసారాలకు సరిపోయే పోర్షన్లు, ప్రతి పోర్షనుకూ అన్నిరకాల వసతులూ వున్నాయి. ఒక పోర్షన్లో తను వుంటూ మిగిలిన వాటిని అద్దెకు యిచ్చాడు జంగయ్య.

ఆ ఇళ్లలో అద్దెకు చేరిన వాళ్ళు పగలంతా బైటికి వెళ్లి ఎవరి విధులు వాళ్ళు నిర్వర్తించి సాయంత్రం వేళకు కొంపలకు చేర్తుంటారు. వాళ్ళందరినీ వరండాలో పోగేసి కనీసం వారానికి మూడుసార్లయినా సోషలిజం గురించి చెప్పటం అతడి అలవాటు.

జంగయ్య కేకలు విని అన్ని పోర్షన్లలో నుంచీ సుమారు ఓ పదిమందిదాకా జంగయ్య దగ్గరికి వెళ్ళారు. జంగయ్య ఇంటి వరండాలో పరచివున్న చాపలమీద కూర్చున్నారు.

జంగయ్య చెప్పబోయేది యేమిటో అందరికీ ముందుగానే తెలుసు. అయినా వినక తప్పదు. యింటి ఓనరు కదా! అర్థాంతరంగా యిళ్ళు ఖాళీచేయించాడంటే నానా యిబ్బందులు ఎదురవుతాయి. అందుకే వాళ్ళందరూ కాన్వెంటు పిల్లల్లా బుద్ధిగా కూర్చున్నారు.

వాళ్ళందరి ఎదురుగా వున్న వాలు కుర్చీలో సగం వాలిపోయి, సగం కూర్చొని యధావిధిగా మాట్లాడటం ప్రారంభించాడు జంగయ్య.

పాపాయిని ఎత్తుకొని చాలాసేపటనుంచి వరండామెట్ల పక్కనే నిలబడి వుంది రోజా. ఆమెను ఎవ్వరూ గమనించలేదు. ఒకళ్లో ఇద్దరో గమనించినా ఆమె కూడా జంగయ్య సోషలిజం గురించి చెబుతోంటే వినటానికి వచ్చిన ఎవరో అభాగ్యురాలని అనుకొన్నారంతే.

నిజానికి రోజా వచ్చి చాలాసేపైంది. జంగయ్యను ఎలాగైనా ఒప్పించి తన హార్మోనియం పెట్టె అతగాడికే తెగనమ్మాలనీ, అతను దయతలచి కొంచెం డబ్బు ఇస్తే వెంటనే బజారుకు వెళ్లి పాపాయికి పాల డబ్బాలు కొనాలనీ వచ్చిందామె. తీరా వచ్చేసరికి అతగాడు తనలాంటివాళ్లకు సంబంధంలేని విషయాలు చెబుతుంటే అక్కడే నిలబడిపోయింది.

అందరినీ పంపేసి జంగయ్య నెమ్మదిగా వాలు కుర్చీలోనుంచి లేచాడు. ఇంట్లోకి వెళ్లబోతూ ఎందుకో తల ఎత్తి చూశాడు. రోజా కనిపించింది.

ఆమె హార్మనీపెట్టె విడిపించుకొని తీసుకు వెళ్లేందుకు వచ్చిందా? ఆమెకు డబ్బు అందే మార్గంలేదు. సంవత్సరం తరువాత వస్తువు సొంతం చేసుకోవచ్చని అనుకొంటే అర్థాంతరంగా ఇలా వచ్చింది ఏమిటి? అని క్షణం ఆలోచించి "అక్కడే నిల్చున్నావేం?" అన్నాడు జంగయ్య.

రోజా నెమ్మదిగా నడుస్తూ వరండాలోకి వెళ్లింది.

"డబ్బు తెచ్చావా?" అడిగాడు.

"మీతో పనుండి వచ్చాను" అంది తల వంచుకొని.

ఆమె డబ్బు తీసుకొని రాలేదని గ్రహిం

చాడు జంగయ్య.

నిజమే! ఆమె డబ్బుతో వచ్చి వుంటే అలా తల దించుకోదు. గర్వంగా తల ఎత్తి చూస్తూ నా వస్తువు నాకు ఇవ్వండి అని అడిగేది.

ఖాతాదారులు వడ్డీ వ్యాపారుల దగ్గరికి కేవలం రెండే రెండు విధాలుగా వస్తారు. ఒకటి, ఇంతకుముందే తాకట్టు పెట్టిన వస్తువు మీద మరికొంత డబ్బు ఇవ్వమని బతిమాల్తారు. రెండు, ఆ వస్తువు ఒదులు కుంటానుగానీ తృణమో ఫణమో ఇచ్చి పంపించమని ప్రాధేయపడతారు.

రోజా ఎందుకు వచ్చిందబ్బా?

అదే వస్తువు మీద ఆమెకు మళ్లీ కొంత డబ్బు ఇచ్చే అవకాశమే లేదు. ఎటూ అది తన సొంతం అవుతుందిగనుక దానిమీద ఒక్క రూపాయి అదనంగా ఇచ్చినా అది నష్టమే.

ఇక ఆమె హార్మోనియం పెట్టె ఒదులుకుంటానని చెప్పి కాస్తో కూస్తో డబ్బు అడగాలి. అలా అడిగితే ఏదో ఒక మార్గంచేసి ఆమెను పంపించాలి. వస్తువును సొంతం చేసుకోవాలి.

"ఏమిటి ఇలా వచ్చావ్ మరి? " అడిగాడు నవ్వుతూ.

"డబ్బు కావాలి"

"నీకు ఇవ్వటానికి అభ్యంతరం ఏముంది" అని రోజా ముఖంలోకి చూస్తూ "వస్తువు తెచ్చావా? " అని అడిగాడు జంగయ్య.

"తేలేదు"

గయ్యిన లేచాడు జంగయ్య! "దీపాలు పెట్టిన తరువాత బంగారం తెచ్చినా నేను ఎవ్వరికీ డబ్బు ఇవ్వను... సెంటిమెంటు. అయినా ఆడకూతురువికదా అని జాలిపడి ఇవ్వాలనుకున్నాను. అలాంటిది నువ్వు వస్తువే తేలేదంటే ఎలా? నా మంచితనానికి క్కూడా హద్దొకటి వుంది. అది దాటి వెళ్లను నేను" అంటూ చిరాకుగా చూశాడు జంగయ్య.

రోజా మరో అడుగు ముందుకు వేసి జంగయ్య దగ్గరికి వెళ్లి నిల్చుంది. జాలిగా చూస్తూ "చాలా అవసరం. అందుకే వచ్చాను ఇంత చీకటిపడినా" అంది.

"డబ్బు ఎవరికిమాత్రం అవసరం వుండదూ! వెళ్లు వెళ్లు. నాకు నిద్రవస్తోంది" అన్నాడు ఆవులిస్తూ.

రోజా తల ఎత్తింది. దీనంగా చూసింది. చేతిలో పాపాయి లేకపోతే అమాంతం కిందికి వాలి అతడి కాళ్ల మీద పడిపోయేదే గానీ అవకాశంలేక ఒక చేత్తో పాపాయిని పట్టుకొని మరో చెయ్యి ఎత్తి నమస్కరిస్తూ,

"అయ్యా... దయతలచండి. పాపనెత్తుకొని చల్లగాలికి తీసుకొని వస్తోంటే పాపాయికి కొంచెం కునుకు పట్టి నిద్రపోయిందిగానీ ఇందాకటిదాకా ఒకటే ఏడుపు. దానికి పాలులేవు. ఆకలికి అల్లాడిపోతోంది. పాలడబ్బా కొందామన్నా చేతిలో చిల్లిగవ్వ లేదు. అందుకే మీ దగ్గరికి వచ్చాను" అంటూ దుఃఖం కడుపులోంచి తెమిలిందేమో, గుడ్లనీళ్లు గుడ్లలో కుక్కుకొంది రోజా.

జంగయ్య అదోలా చూశాడు. ఆ చూపులో ఆమెపట్ల చాలా చులకన భావం కనిపించింది.

"కన్నపిల్లకు పాలు ఇవ్వకుండా పాలడబ్బాల కోసం ఎగబట్టం ఈ రోజుల్లో ఫ్యాషనైంది. పిల్లలకు తల్లి పాలు ఇస్తే అందం తగ్గుతుందని భయం. కన్న బిడ్డల కడుపులు మాడ్చి అందం దాచుకొని ఎవరిని ఉద్ధరించాలో.

"ఛీఛీ... ప్రపంచం పాడైపోతోంది. నువ్వంటే డాన్సరువి గనుక నీక్కొన్ని ఆటంకాలూ, ఇబ్బందులూ వుండేమాట నిజంకానీ మొగుళ్లు రెండు చేతులతో సంపాదిస్తుంటే చలువ పెట్టెలు బిగించిన బంగళాల్లో మెత్తని పరుపులు పరచిన డబుల్ కాట్ మీద కౌబాయ్ పుస్తకాలు చదివేవాళ్లు కూడా అలాగే తయారయ్యారు. పిల్లలకు పాలు ఇవ్వరు. డబ్బాపాలు కలిపి సీసా నిండా




పోసి దాని పీక పిల్లలనోట్లో పెడితేసరి. వాళ్ల బాధ్యత తీరినట్టే.

"జంతువులు కూడా కన్నబిడ్డలకు హాయిగా తల్లిపాలు ఇస్తుంటే మనుషులకు మాత్రం మాయరోగం వచ్చింది. వీళ్ల బల హీనత కనిపెట్టి పాల సీసాలూ, పాల పీకలూ, పాల డబ్బాలూ తయారుచేసి అమ్ముతూ కోట్లలో వ్యాపారం చేస్తున్నారు చాలామంది. వాళ్లతో పోల్చుకుంటే వడ్డీ వ్యాపారంలో నాకు వచ్చేది ఏపాటి?

"అమ్మాయ్ రోజా! నీకో విషయం చెప్పనా! రెండవ ప్రపంచ యుద్ధం జరిగిన ప్పటి మాట! సోవియట్ రష్యాలో చాలా మంది జనం యుద్ధంలో చనిపోయారు. పసిపిల్లల తల్లులు కూడా. శవాలమీదపడి పాలకోసం పసిపాపలు ఏడుస్తుంటే బతికి వున్న తల్లులు తమ పిల్లలకే కాకుండా అందరు పిల్లలకూ పాలు తాగించారుట. డబ్బాపాలు పట్టాలన్న ఆలోచన వాళ్లకు రాలేదేం?

"అదే మరి వాళ్లకూ మనకూ వున్న భేదం. అందుకే ఆ దేశాలలో చదువూ, విజ్ఞానం వున్న జనరేషన్ తయారవుతుంటే మనదేశంలో ఎక్కువగా జులాయి వెధవలే తయారవుతున్నారు.

"తల్లిపాలు తాగి పెరిగిన వెధవలు ఎవ్వరూ బస్సులను కాల్చి ప్రయాణీకులను దోచుకోరు, చిలకలూరిపేట దగ్గర జరిగి నట్టు. తల్లిపాలు తాగి పెరిగిన వెధవలు ఎవ్వరూ ఇళ్లలో దూరి ఆడవాళ్లను చెరిచి మగవాళ్లను హత్యచేసి దోపిడి చెయ్యరు, ఈమధ్యనే హైదరాబాదు పొలిమేరల్లో జరి గినట్టు.

"అందుచేత పాపాయికి డబ్బాపాలు వద్దు గానీ నువ్వే కొంచెం శ్రమ అనుకోకుండా అందం చెడిపోతుందని భయపడకుండా పాపాయికి పాలు ఇవ్వు" అని హితవు చెప్పాడు జంగయ్య.

ఒక మనిషిని పొడిచి చంపేందుకు ప్రభుత్వం గనుక అనుమతి ఇస్తే ఆ క్షణం లోనే జంగయ్యను చంపేది రోజా, సందేహం లేకుండా!

ముష్టివేసే వెధవ! ఈపాటి సూత్రాలూ, సూక్తులూ వినేందుకా ఆకలికి ఏడుస్తున్న పాపాయిని చంకనేసుకొని చీకటిలో వెతు క్కొంటూ నీ దగ్గరికి వచ్చింది నేను? అని మనసులో అనుకొంటూ నెమ్మదిగా తల పైకి ఎత్తి "తల్లిపాలులేవు. అందుకే పాల డబ్బా" అంది చిన్నగా.

"ఏమైనాయ్? " తల్లిపాలు లేకపోవటం అనేది జరిగేది కాదన్నంత విశ్వాసంతో ఆమెవైపు అనుమానంగా చూస్తూ అడి గాడు.

"స్తనాల్లో పాలు పొంగి గడ్డలు కడు తున్నా ఆ నొప్పులకు మందులు వాడుతూ అందంకోసం పాపాయిలకు పాలు ఇవ్వ కుండా డబ్బా పాలు పట్టేంతటి నీచత్వం నాలోలేదు. కన్న పాపాయికి స్తన్యం అందిస్తే కలిగే ఆనందం, మధురానుభూతీ నాకు తెలుసు. కానీ అలాంటి ఆనందానికీ మధురానుభూతికీ నోచుకోలేదు నేను. నా స్తనాలలో పాల చుక్కలు లేవురా వెధవా" అని చెప్పి అతగాడ్ని ఒప్పించటం ఎలా? చెప్పినా అతను తను అన్నది నిజమని నమ్ముతాడా? దరిద్రం, ఆకలి, ఆవేదన, నిస్సహాయత, ఎడతెగని ఆలోచనా... అన్నీ కలిసి నా శరీరాన్ని ధ్వంసం చేశాయనీ ధ్వంసమైన ఈ కంకాళాల గూడులో రక్త మాంసాలే ఆవిరై అడుగంటిపోతోంటే పాల చుక్కలు ఎలా వుంటాయిరా నీచుడా! అని చెబుదామా?

చెప్పటం అనవసరం. చెప్పినా వాడికి అర్థంకాదు. అర్థం చేసికొనే వాడే అయితే పాలు లేవని చెబితే ఏమైనాయి? అని అడ గడు. అర్థం చేసుకొంటాడు అంతే!

"నాకు డబ్బులు కావాలి. హార్మోనియం పెట్టి ఏదో ఒక లెక్కన జప్తు చేసుకోండి. ఇక అది నాకు అనవసరం. నాకు కావా



ల్సింది డబ్బు!" అంది రోజా కొంచెం అసహనంగా.

"ఓ అలా చేద్దాం అంటావా. చెప్పవేం మరి!" అని తనలోతనే ఏదో లెక్కలు గుణించుకొని నువ్వు తీసుకొన్న అసలు ఐదొందలు అవునా?" అని అడిగాడు జంగయ్య.

"అవును... అసలు ఐదొందలు, దానికి నెలకు నూటికి పది రూపాయల చొప్పున వడ్డీ, తీసుకొని ఐదు నెలలు అయింది గనుక వడ్డీ రెండు వందల యాభై, అసలు ఐదొందలూ మొత్తం కలిసి ఏడొందల యాభై. అది పోను ఎంత ఇస్తారో ఇవ్వండి" అంది రోజా గుక్క తిప్పుకోకుండా.

జంగయ్య లోలోపలే ఆనందించాడు. వడ్డీ వ్యాపారం చేసే ఎవరికైనా బాకీదారుడు అలా సహనం కోల్పోయి తెంపు చేసే పరిస్థితికి వస్తేనే మంచిది. కట్టాల్సిన వడ్డీ కళ్ల ముందు కనిపించి నష్టంలో నష్టం అనుకొంటాడు. వస్తువు విడిపించుకోలేక తెగనమ్మి వెళ్తాడు.

"నిన్ననే ఎందుకో హార్మోనియం పెట్టె ఒకరికి చూపించి అడిగాను రోజా! ఎనిమిది వందలకన్నా పైసా కూడా పలకదని చెప్పారు. నువ్వు ఇవ్వాల్సిన ఏడు వందల యాభై పోతే నీకో యాభై నేనే ఇవ్వాల్సి వస్తుంది. ఆడకూతురువికదా. మరో యాభై కలిపి వంద ఇద్దామని వున్నదిగానీ దీపాలు పెట్టిన తరువాత బీరువా తెరవను. జేబులో ఓ యాభై వున్నాయి. కావాలా?" అని అడిగాడు జంగయ్య ఎటూ కావాలని అంటుంది గనుక.

"ఎంతో కొంత తొందరగా ఇవ్వండి" అడిగింది రోజా.

జంగయ్య ఇంట్లోకి వెళ్లాడు. బీరువా తలుపులు తెరిచి అందులోవున్న నోట్ల కట్టల్లోంచి ఒక కట్ట బైటికి తీసి ఆ కట్టలోంచి ఓ యాభై కాయితం వూడతీసి తిరిగి యధాప్రకారం పెట్టి బీరువా తలుపులు వేసి బైటికి వచ్చాడు. యాభై రూపాయల కాయితాన్ని రోజా చేతిలో పెట్టాడు.

ఆత్రంగా డబ్బు అందుకొని వెళ్లబోయింది రోజా. కనీసం అతనితో వెళ్తానని కూడా చెప్పకుండా గిర్రున వెనక్కు తిరిగి రెండు అడుగులు వేసింది.

"అసలు విషయమే మరచిపోయాను ఆగాగు" అని ఆమె ఆగుతుందో లేదో అనుకున్నట్టే హడావుడిగా తనూ రెండు అడుగులు ముందుకు వేశాడు జంగయ్య.

రోజా ఆగి అతనివైపుకు చూసింది.

"హార్మోనియంపెట్టె నువ్వు నీ కుటుంబ అవసరాలకు నాకు అమ్మినట్టు ఓ కాయితం రాసిచ్చి వెళ్లు. పేచీలు వుండవు తర్వాత. మీ రికార్డు డాన్సర్లను చస్తే నమ్మకూడదు. ఒకసారి ఏమైందో తెలుసా? దిల్‌ఖుష్ పార్టీలో డోలక్ వాయించే మస్తానూ, కాజల్ డాన్సు పార్టీలో కంజర వాయించే సత్తారూ రాత్రివేళ చీకట్లో వుంగరం తెచ్చి తాకట్టుకు డబ్బివ్వమన్నారు. ఉంగరం బరువుగానే వుంది. హీనంగా తూకం వేసినా పది గ్రాముల బంగారానికి తక్కువ మాత్రం వుండదు.

అప్పటికే ఇద్దరూ తాగివున్నారు. ఇంకా తాగాలని పాపం డబ్బు అడిగి వుంటారులే అని జాలిపడి ఐదొందలిచ్చాను. ఎంతకూ వాళ్లు డబ్బుకట్టి విడిపించుకోకపోతే అమ్మేస్తానని లాస్ట్ వార్నింగ్ ఇచ్చాను.

కంజర వాయిస్తూ సత్తారుగాడూ, డోలక్ కొడుతూ మస్తానుగాడూ వాద్యాలు వాయించి సమాధానం చెప్పారుగానీ కనీసం మర్యాద కోసమైనా పెదవి విప్పి మాట్లాడారా? లేదు.

నాకు వల్లమాలిన కోపం వచ్చింది. "ఇప్పుడే బంగారం కొట్టుకు వెళ్లి అమ్మేస్తాను" అన్నాను. వాడు పో అన్నట్టు తల ఎగురవేస్తూ డోలక్ వాయించాడు. రూపాయి గూడా తిరిగి ఇవ్వను అన్నాను. వీడు పో అన్నట్టు తల ఎగరేస్తూ కంజర వాయిం





చాడు. నేనూరుకొంటానా? అన్నమాట ప్రకారం అప్పటికప్పుడు వాళ్ల ఉంగరం జేబులో పెట్టుకొని బజారుకు వెళ్లాను. బంగారం కొట్లో ఇచ్చాను. వాళ్లు దానిని గరుకురాయిమీద రుద్ది గీటుపెడితే ఏము న్నదక్కడ. అది బంగారపు ఉంగరంకాదు. ఇత్తడి మీద పోతపోసిన ఉంగరం.

ఏందిరా ఈ మోసం? అని వెళ్లి అడిగితే అంతకుముందు మాట్లాడకుండా వాద్యాలు వాయించినవాళ్లు కంజర, డోలక్కూ దూరంగా పెట్టి లేస్తూ గొంతులు చించు కొని అరిచారు. కొట్టటానికి మీదికొచ్చారు. మేం ఇచ్చింది ఇదికాదు. బంగారపుది ఇస్తే జంగయ్య ఉంగరాలు మార్చి మోసం చేశాడు అని నానా అల్లరీ చేశారు. నలుగురూ పోగయ్యారు. విషయం పోలీసుల దాకా వెళ్లబోతే నేనే బతిమాలి ఆపాను. అసలే నాది లైసెన్సు లేని వ్యాపారంకదా! సవరు బంగారంతో ఉంగరం చేయించి ఇచ్చి తగువు లేకుండా సర్దుకున్నాను" అని,

"హార్మోనియం పెట్టె అమ్మినట్టు నిన్ను కాయితం అడిగింది అందుకే. నువ్వు మళ్లీ వచ్చి పెట్టె ఇవ్వమని అడిగితే నా చావుకొస్తుంది. ఇవి ఎవరినీ నమ్మే రోజులుకావు. రేపు ఏదైనా జరిగిందంటే సంఘంలో మర్యాద పోతుంది. నాకు" అని జంగయ్య లోపలికి వెళ్లి ఒక తెల్లకాయితం, బాల్ పెన్నూ తెచ్చాడు. రోజాకు ఇచ్చాడు

రోజా కాయితం కింద సంతకం చేసి జంగయ్య చేతికి అందిస్తూ "సంతకం చేశాను. పైన ఏమి రాసుకొంటారో నిదానంగా మీరే రాసుకోండి" అని లేచి నిల్చుంది.

జంగయ్య నవ్వుతూ "భలే దానివి నువ్వు. నా దగ్గర కనుక ఫర్వాలేదుగానీ ఇంకెవరికయినా ఇలా వట్టి కాయితం మీద సంతకం పెట్టి ఇచ్చావంటే చాలా ప్రమాదం. నీకు లక్షలూ, కోట్లూ లేకపోవచ్చు కానీ నీకు వున్న దాన్లోనే సగభాగం రాసుకొన్నా రాసుకొంటారు. అసలే కాలం మారింది కొంచెం జాగ్రత్త" అన్నాడు కాయితం మడుస్తూ.

"సగమేం కర్మ మొత్తం రాసుకున్నా నాకేం అభ్యంతరం లేదు. నాకున్నది దరిద్రం మాత్రమే" అని వేగంగా వరండా మెట్లుదిగి వెళ్లిపోయింది రోజా, పాపాయికి పాల డబ్బా కొనేందుకు.

జంగయ్య రోజా సంతకం చేసి ఇచ్చిన కాయితాన్ని బీరువాలో భద్రంగా దాచిపెట్టి పడక గదిలోకి వెళ్లి మంచం మీద వాలిపోయాడు.



రికార్డు డ్యాన్సర్ల విషయంలో ఏదో పెద్ద పథకం పన్నుతున్నాడు సుధీర్ అన్నంతవరకు ఊహించగలిగాడు చైతన్య. ఇంకా వివరంగా చెబుతానన్నది నేరేడు. ఆమె ఏం చెబుతుందా అని ఆసక్తిగా చూస్తున్నారు వాళ్లు.

ఎవరో ఇద్దరు వ్యక్తులు సోడాలు కావాలంటూ వచ్చారు బండి దగ్గరికి.

వాళ్లకు సోడాలు కొట్టి ఇచ్చింది నేరేడు. వాళ్లు సోడాలు తాగి వెళ్లిపోగానే చైతన్య వైపుకు తిరిగి

"మన మైనరుబాబు కానిస్టేబులు వీరా

స్వామికీ, స్టేషన్లో పని చేస్తున్న చాలామంది పోలీసులకూ బంగారు పిచ్చుక.

"అంటే?" అని ఆశ్చర్యంగా చూశాడు చైతన్య.

"వాళ్లకు కావాల్సిన సదుపాయాలన్నీ చేస్తుంటాడు. రోజూ తాగిస్తుంటాడు. వాళ్ల అవసరాలకు డబ్బు ఇస్తుంటాడు. వాళ్లలా మైనరుబాబును అవసరాలకు ఉపయోగపెట్టుకుంటూ అతను చెప్పిన ప్రతి వెధవ పనీ చేస్తుంటారు. ఒక్క మాటలో చెప్పాలంటే పోలీసు స్టేషన్లో మైనరుబాబు మాట శిలా శాసనంగా చెల్లుతుంది.

"అనధికారికంగా అతను స్టేషన్లో చలాయించే అధికారాన్ని గురించి అధికారులకు తెలియదు. స్టేషన్లో ఏం జరుగుతున్నదో? సుధీరూ, కానిస్టేబుళ్లూ కలిసి ఏం చేస్తుంటారో వాళ్లదాకా వెళ్లదు.

"ఒకవేళ ఎప్పుడైనా ఏదైనా విషయం పైఅధికారుల దాకా వెళితే రైటరు దగ్గర్నించి సెంట్రీదాకా అందరూ ఒకే మాటమీద వుంటారు. సుధీర్‌నూ, అతని అనుచరులనూ సమర్థించి చెబుతుంటారు.

"మన మైనరు బాబుకు లేని వ్యసనం అంటూలేదు. వున్న అన్ని వ్యసనాల్లోకీ స్త్రీ వ్యసనం అతనికి పెద్ద వ్యసనం. అందమైన అమ్మాయిలను వేటాడుతుంటాడు. వలలో వేసుకొని అనుభవించి వదిలేస్తుంటాడు. అతనికి పోలీసుల అండ వున్నదని ఎవ్వరూ భయపడి అతని జోలికి వెళ్లరు. అందుకే మైనరుబాబు ఎంతమంది ఆడవాళ్లకు అన్యాయం చేసినా అవి ఘర్షణల దాకా వెళ్లలేదు. వెళ్లవుకూడా!" అని నేరేడు చైతన్యకేసి చూస్తూ "నీకు రికార్డు డ్యాన్సరు దిల్‌ఖుష్ తెలుసా?" అని అడిగింది.

"పేరు విన్నాను" చెప్పాడు చైతన్య.

"మైనరుబాబు దిల్‌ఖుష్ మీద కన్ను వేశాడు. ఆమె పొందుకోసం చాలా అగచాట్లు పడ్డాడు. అడిగినంత డబ్బు ఇస్తానన్నాడు. ఇంకా ఏవేవో ఆశలు పెట్టాడు. అయినా ఆమె ఒప్పుకోలేదు. చివరికి కానిస్టేబులు వీరాస్వామితో కూడా అడిగించాడు. అంగీకరించలేదు. చివరికి ఆమెను పెళ్లి చేసుకుంటానని కూడా చెప్పాడు. డాన్సర్ రోజా జీవితం పెళ్లి పేరుతో ఎలా పెటాకులయిందో తెలిసిన దిల్‌ఖుష్ అందుకూ సిద్ధపళ్లేదు. ఆమె పని చేస్తున్న డ్యాన్సు పార్టీ కాంట్రాక్టరు రవి మీద కూడా పోలీసులతో ఒత్తిడి తెచ్చాడు ఆమెను ఒప్పించమని. ఒప్పందం ధిక్కరించి వెళ్లిపోతాను గానీ భయపడి లొంగనని తేల్చి చెప్పింది.

అలా సుధీర్ పంతం నెగ్గించుకొనేందుకు వున్న అన్ని దారులూ మూసుకొని పోయాక వాళ్లందరూ కలసి ఆలోచించి ఒక నిర్ణయానికి వచ్చారు"

"ఏమిటి ఆ నిర్ణయం?" అడిగాడు చైతన్య.

"సుధీర్ వెనుక అనుచరవర్గం చాలా వుంది. వాళ్లందరూ జీవితానికి నిర్వచనం తెలియని వాళ్లే. సుధీర్ ఇచ్చే డబ్బుకూ, తాగించే మందుకూ ఆశపడి నాలుగు రోజులు విలాసవంతమైన జీవితం గడిపేందుకు విలువైన జీవితాలను ధ్వంసం చేసుకొంటున్నవాళ్లే.

వాళ్లు మైనర్‌బాబును బాస్ అని పిలుస్తూ అతని వెంట తిరుగుతూ వుంటారు. చెప్పింది చేస్తుంటారు కానిస్టేబుళ్లకు మల్లేనే!

పోలీసులూ సుధీర్ కలసి పన్నిన పథకం ప్రకారం సుధీర్ తన అనుచరులతో కలిసి రికార్డు డ్యాన్సులను నిషేధించాలని ఉద్యమం ప్రారంభించాడు. వాళ్లు ప్రభల మీద చేస్తున్న డ్యాన్సుల వల్ల కామంతో జనం రెచ్చిపోతున్నారని అలా రెచ్చిపోయి మానభంగాలు చెయ్యాలని కూడా ఆలోచిస్తున్నారనీ అందువల్ల వాటిని నిషేధించాలనీ ప్రభుత్వాన్ని కోరారు. పోలీసు అధికారులతో సహా అందరికీ వినతిపత్రాలూ సమర్పించారు"

"డ్యాన్సులు నిషేధించినంత మాత్రాన





దిల్ ఖుష్ అతనికి లొంగిపోతుందా? "

"డాన్సులు ఆపితే వాళ్లకు జీవనభృతి పోతుంది. వాటిమీద ఆధారపడి జీవించే డాన్సర్లు కుటుంబాలు గడవకా, ఆకలికి తాళ లేకా అన్నం మెతుకులకోసం అన్నిటికీ లొంగుతారని వాళ్ల ఆశ"

"ఆకలి మనుషులచేత తలలు వంచించట మేకాదు, అగ్నిలా ప్రజ్వరిల్లి తిరుగుబాట్లు కూడా తెస్తుందికదా"

"వాళ్లకు ఆ విషయం తెలియదు. డబ్బు తప్ప వాళ్లకు మనుషులను కొలిచే మరో మార్గమే లేదన్న నమ్మకం. ఆ నమ్మకంతోనే డాన్సర్ల బతుకు తెరువును దెబ్బతియ్యాలని చూస్తున్నారు"

"షిట్! ఇది నరకం" అని అరిచాడు చైతన్య.

"అందునా ఇప్పుడు తిరుణాళ్ల సీజను వస్తుంది. చలిచీమలు ఎండాకాలంలో ఆహారం సేకరించి దాచుకొని వర్షాకాలంలో తినేట్టే డాన్సర్లు ఈ సీజన్లో డబ్బు సంపాదిం చుకొని సంవత్సరం అంతా గడుపుకోవాలి. ఇలాంటి సమయంలో వాళ్లు ఉద్యమం ప్రారంభించారు. డి.ఎస్.పి దొరగారికి డాన్సులను ఆపి సమాజాన్ని కాపాడ మంటూ విజ్ఞప్తి కూడా చేశారు. దేశంలో జరుగుతున్న మానభంగాలకూ, ఆడపిల్లల కిడ్నాపులకూ సంసార పక్షుల్లో కూడా కొన సాగుతున్న అక్రమ సంబంధాలకూ ఆ అక్రమ సంబంధాలవల్ల జరుగుతున్న హత్యా లకూ, వివాహాలై ఇళ్లలో అందమైన భార్యలు వుండికూడా పొరుగింటి పుల్లకూ రకు మగవాళ్లు ఎగబడుతూ గోడలు దూకి దొంగపాలు తాగి వెళ్లే పిల్లుల్లా మారుతుం డటానికీ, ఒక మొగుడు-ముగ్గురు పెళ్లాలు అన్న పేరుతోనో ముగ్గురు మొగుళ్లూ ఒక పెళ్లాం అన్న పేరుతోనో సినిమాలు రిలీజ యితే చాలు బాక్సాఫీసులు బద్దలు కావటా నికీ, క్యాడ్ బార్‌తో పూరపిచ్చుకలను కొడుతూ తోపుల వెంటా, దొడ్లవెంటా తిరిగే జులాయి వెధవలు కూడా నిక్షేపంగా కాలే జీల్లో చదువుకొనే అమ్మాయిల వెంటపడి వాళ్లు ఒప్పుకోకపోతే ముఖాలమీద యాసిడ్ చల్లటమో, కత్తులతో పొడిచి హత్యలు చెయ్యటమో జరగటానికీ అలా అన్నింటికీ కారణం రికార్డు డాన్సులే అని చెప్పారు.

డిఎస్పీ దొరగారు అలా చెప్పినందుకు తన సిబ్బందికేసి చాలా అబ్బురంగానూ, అభిమానంగానూ చూశారు.

"నేరాలు జరగటం, వాటిని పరిశోధించి నేరస్తులను పట్టుకోవటమేకాదు పోలీసుల డ్యూటీ నేరాలకు మూల కారణం ఏమిటో తెలుసుకోవటం అన్నింటికన్నా తెలివైనపని.

"సమాజంలో జరుగుతున్న ఇన్ని నేరా లకు వాళ్లు మూల కారణం కనుగొని చెప్ప టంతో దొరగారికి హెడ్డుమీదా, రైటరు మీదా, కానిస్టేబులు వీరాస్వామి మీదా విప రీతమైన అభిమానం పెరిగింది.

"దిల్ ఖుష్ బాగుంటుందా? " అని అడి గారు దొరగారు.

వాళ్లు ఆమె అందాన్ని వర్ణించి చెప్పగానే, డాన్సర్ల కదలికలను ఎప్పటికప్పుడు కనిపె డుతూ తమకు రిపోర్టు చేస్తూ వుండమని త్వరలో దొరసాని పుట్టింటికి వెళ్తుంది గనుక ఆ సమయంలో తీరుబడిగా ఆలో చించి రికార్డు డ్యాన్సర్ల సమస్య పరిష్కరిస్తా ననీ చెప్పారు డిఎస్పి దొరగారు.

"సుధీర్ రికార్డు డ్యాన్సర్ల వీధికి వెళ్లేది వాళ్లను కనిపెట్టి దొరగారికి వర్తమానం అందించటానికే. ఎన్ని తిప్పలు పడినా మైనరుబాబు కాకులను కొట్టి గద్దలకు వెయ్యటం తప్ప అతగాడు సాధించేది ఏమీ వుండదు చివరికి" అని చెప్పటం ముగిం చింది నేరేడు.

అప్పటికే బాగా పొద్దుపోతోంది. పల్చగా మంచు వాన కురుస్తూ చలిచలిగా వుంది. ఆ చీకటిలో ఆ చలిలో ఇంకెవ్వరూ వచ్చి సోడాలు తాగరని నేరేడుకు తెలుసు. వాళ్లతో మాట్లాడుతూ ఇంకా అక్కడే ఉన్న

దికానీ లేకపోతే ఈపాటికి ఇంటికి వెళ్లేది. స్నానం చేసి అమ్మతో కలిసి కూర్చొని అన్నం తిని పడుకొనేది హాయిగా.

"ఇంక నేను ఇంటికి వెళ్తాను" అంది నేరేడు.

"ఇందాక నువ్వు మాట్లాడుతూ రోజా అనే అమ్మాయిని గురించి ఏదో అన్నావు. ఎవరా రోజా? " అడిగాడు చైతన్య.

రోజా ఒకానొక రోజుల్లో రికార్డు డ్యాన్స రుగా ఉచ్ఛస్థితిలో వుండి ఇవ్వాళ కనీసం తినటానికి తిండికి కూడా నోచుకోక అగ చాట్లు ఎలా పడుతున్నదో పెళ్లి పేరుతో ఆమె ఎలా మోసపోయిందో అంతా క్లుప్తంగా చెప్పింది నేరేడు.

"వాళ్లను గురించి ఇన్ని వివరాలు ఎలా తెలుసు నీకు? "

"తెలుసు"

"అయితే ఒక విషయం దాపరికం లేకుండా చెప్పు! సుధీర్‌లాంటి వాళ్లు డాన్స ర్లను గురించి ఏమనుకున్నా అది అవతల పెట్టి ఆలోచిద్దాం! వాళ్ల డాన్సులు అస భ్యంగా వుంటాయా? సభ్యసమాజాన్ని చెడ గొట్టేవిగా వుంటాయా? " అడిగాడు చైతన్య.

నేరేడు చివాలున తల ఎత్తి అతనివైపు చూసింది. ఏదో చెప్పాలన్నంతగా ఆవేశం వచ్చిందిగానీ అంతలోనే తమాయించుకొని "మీ పరీక్షలు కూడా వాయిదా పడ్డాయికదా! కొంత సమయం వెచ్చిస్తే డాన్సర్లను గురిం చిన మీ అనుమానాలు తీర్చే ఒక మనిషి దగ్గరికి మిమ్మల్ని తీసుకొని వెళ్తాను. మీ అనుమానాలన్నీ ఆమె తీరుస్తుంది. వస్తారా? " అని అడిగింది నేరేడు.

చైతన్యకే కాదు పానకాలుకు కూడా వాళ్లను గురించి తెలుసుకొందామని చాలా ఆసక్తిగా వుంది.

"అభ్యంతరం లేదు వెళ్దాం" అన్నాడు చైతన్య.

నేరేడు బండి తోసుకొని ముందుకు వెళుతూ "రాండి" అని పిలిచింది.

"ఇంతకూ మనం కలవబోయేది ఎవర్ని? " అడిగాడు.

"ఓ మాజీ డాన్సర్ని"

"ఎవరు ఆమె? "

"మా అమ్మ" చెప్పింది నేరేడు.

సోడాబండి నెట్టుకుంటూ నేరేడు ముందుకు వెళుతుంటే చైతన్య, పానకాలు ఆమె పక్కనే నడుస్తున్నారు. బండి చక్రాల కింద పడి నలుగుతూ సన్నటి రాళ్ళు లయ బద్ధంగా చప్పుడు చేస్తూంటే ఆ శబ్దాన్ని ఆలకిస్తూ నడుస్తున్నారు వాళ్ళంతా.

అలా కొంతదూరం వెళ్ళిన తరువాత తారు రోడ్డు దిగారు. పల్లంగా వున్న ప్రదే శంలోనుంచి కాలిబాటవెంట నడుస్తూ ఓ ఫర్లాంగు దూరం వెళ్ళారు.

"మా ఇల్లు అక్కడే!" అని చెయ్యి ఎత్తి దూరంగా వున్న గుడిసెలకేసి చూపించింది నేరేడు.

ఇద్దరూ అటువైపు చూశారు.

కాలిబాటకు రెండువైపులా చాలా గుడి సెలు కనిపించాయి.

"అవన్నీ గవర్నమెంటు భూములు. గొప్పవాళ్ళు కొంతమంది ఆ భూములను ఆక్రమించి గుడిసెలు వేశారు. ఆ గుడిసె లను మాలాంటి పేదవాళ్ళకు అద్దెలకు యిచ్చారు. బినామీ పేర్లతో స్థలాలకు పట్టాలు పొంది అప్పుడు వాటిని అమ్మే స్తారు. మళ్ళీ మరొకచోట యిలాగే ఆక్రమ ణచేసి గుడిసెలు వేస్తారు" చెప్పింది నేరేడు.

"ప్రభుత్వం భూములు యిచ్చేది పేదలకు కాదా? "

"కాదు"

"ఇలా స్థలాలు ఆక్రమించింది ఎవరు? "

"అధికార పార్టీవాళ్ళు"

"వాళ్ళను అడిగేవాళ్ళే లేరా? "

"అడిగినా ప్రయోజనం వుండదు. మా భూమిని మేము ఆక్రమించుకొంటే తప్పే మిటి? అని అడ్డం తిరుగుతారు"





"అధికారులు పట్టించుకోరా? "

"వాళ్ళకూ భూమి అమ్మకాలలో వాటాలున్నాయి" అని చెప్పింది నేరేడు.

అందరూ మరికొంచెం ముందుకు వెళ్ళారు. సరిగ్గా వాళ్ళు గతుకుల్లోకి వెళ్ళ గానే కరెంటు పోయింది. అంతా చీకటిగా మారి దారి కనిపించలేదు.

"మీకు యీ దారి కొత్త గనుక చీకటిలో నడవలేరు. గోతుల్లో పడిపోతారు" అని అక్కడే నిలబడిపోయింది నేరేడు.

వాళ్ళు కూడా నిల్చున్నారు.

"ఇందాక మనం వచ్చిన దారిలో మున్సి పల్ గెస్ట్ హవుసు వుంది కదూ? " అడి గింది నేరేడు.

"అవును"

"రోజూ చీకటిపడే వేళకల్లా మున్సిపల్ ఛైర్మన్‌తోసహా చాలామంది అధికారులు అక్కడికి చేరుతుంటారు. గానాబజానాలు సాగుతుంటాయి. మందు, మగువ, జూదం... రాత్రంతా గెస్ట్ హవుసు కామకేళీ విలాసాలతో సందడిగా వుంటుంది.

"గెస్టుహవుసు గదులు ఎవ్వరికీ అద్దెకు యివ్వరు. ఎవరైనా కావాలని అడిగితే ఖాళీ లేదంటారు. కరెంటు బిల్లులు మాత్రం భారీగా వస్తుంటాయి. ఖాళీగా వున్నాయని రికార్డుల్లో చూపించి కరెంటు బిల్లులు మాత్రం కడుతుంటారు. ఖాళీగా వున్న గదులలో అంతకరెంటు ఎందుకు కాలింది? అని ఎవ్వరూ వాళ్ళను అడగరు. వాళ్ళ దృష్టిలో గెస్ట్‌హవుసే కాదు, యావ ద్భారతదేశం వాళ్ళ సౌకర్యాలకు మాత్రమే పరిమితమైన ఒక ధర్మసత్రం!" అని ఎందుకో భారంగా నిట్టూర్చింది నేరేడు.

చైతన్య, పానకాలు మౌనంగా ఆలోచిస్తూ నిల్చున్నారు.

"మన వూరి గాంధీ చౌక్‌లో వున్న గాంధీ గారి విగ్రహాన్ని చూస్తే జాలివెయ్యలేదా మీకు? " అడిగింది నేరేడు.

"ఎందుకూ? "

"విగ్రహాన్ని చూస్తుంటే నాకు జాలే కాదు, నవ్వు కూడా వొస్తుంది. ఆ విగ్రహానికి పది అడుగుల దూరంలోనే బ్రాందీషాపుంది. ఆ బ్రాందీషాపుకూ గవర్నమెంటు ఆస్పత్రికీ ఒక గోడ మాత్రమే అడ్డం. ఆ గోడను పడ గొడితే బ్రాందీషాపూ, ప్రభుత్వ ఆసుపత్రీ కలిసే వుంటాయి.

ప్రభుత్వ ఆస్పత్రికి ఎదురుగా మున్సిపల్ హైస్కూలూ, బ్రాందీషాపు పక్కనే సినిమా హాలూ వున్నాయి.

గాంధీ విగ్రహం వెనుకవైపు కేవలం ఐదు గజాలదూరంలో మున్సిపల్ కార్యాలయం, పది గజాల దూరంలో పోలీసుస్టేషనూ వున్నాయి.

అంటే మహాత్మాగాంధీ విగ్రహం చుట్టూ కొద్ది పరిధిలోనే ఒక బ్రాందీషాపు, ప్రభుత్వ ఆస్పత్రి, హైస్కూలు, సినిమాహాలు, మున్సి పల్ ఆఫీసూ, పోలీసుస్టేషనూ వున్నాయి.

అలాంటిచోట బ్రాందీషాపులకూ, సినిమా హాళ్ళకూ లైసెన్సులు యిచ్చేందుకు నిబంధ నలు ఒప్పుకోవు. అలాంటి నిబంధనలను తయారుచేసిన ప్రభుత్వమే తన నిబంధన లను తానే ఉల్లంఘిస్తూ అన్నిటికీ లైసె న్సులు యిచ్చింది. అంటే ప్రభుత్వం తయా రుచేసిన చట్టాలను ఆ ప్రభుత్వమే ధిక్క రిస్తున్నదన్నమాట!" అని నేరేడు గట్టిగా ఊపిరి పీల్చుకొని మౌనంగా నిల్చున్నది కొద్దిసేపు.

ఇంకా కరెంటు రాలేదు.

"షిట్! ఇది నరకం" అన్నాడు చైతన్య.

"కరెంటు రాలేదనా అలా అన్నావ్? ఎప్పుడు దీపాలు ఆరిపోతాయో, ఎప్పుడు వెలుగుతాయో చెప్పలేము. కరెంటు రాకడా, ప్రాణం పోకడా తెలియదుకదా!" అంది నేరేడు.

అక్కడ కొంచెంసేపు మళ్ళీ నిశ్శబ్దం పర చుకొంది.

"చైతన్యగారూ! రాత్రివేళల్లో అక్కడ పాన ప్రియులు చిత్తుగా తాగి వళ్ళు తెలియ

కుండా బ్రాందీషాపు ఎదురుగా వున్న గాంధీ గారి విగ్రహాన్ని పట్టుకొని తూలిపోతూ అక్కడే ఉచ్చలు పోస్తున్నా ఎవ్వరూ పట్టిం చుకోవటంలేదు. గాడ్సే ఆయన్ను తుపాకితో కాల్చి చంపితే మనం గ్రామగ్రామానా ఆయన విగ్రహాలను పెట్టి యిలా అవమా నిస్తూ అనుక్షణం చంపుతున్నాం. తెల్లవా ళ్ళను వెళ్ళగొట్టి మనవాళ్ళకు అధికారం కట్ట బెట్టాడన్న కక్షతో యిలా చేస్తున్నామా? " అని పకపకా నవ్వి.

"... పాలక వర్గం, దాని తాబే దారులయిన అధికారులూ ఇన్ని అరాచ కాలూ, అక్రమాలూ జరుగుతూన్నా పట్టిం చుకోకపోవటం అలా వుంచండి! రికార్డు డ్యాన్సులవల్ల సమాజం చెడిపోతుందన్నంత సూక్ష్మమైన విషయాలను కూడా విస్మరిం చని యీ సభ్యసమాజం ఇలాంటి ముఖ్య మైన విషయాల్ని ఎందుకు పట్టించుకోదు? " అని అడిగింది నేరేడు.

జీవంలేని నవ్వు నవ్వాడు చైతన్య. కొంచెంసేపటికి కరెంటు వచ్చింది.

"ఇక వెళ్దామా? " అంది నేరేడు.

ముగ్గురూ మరికొంతదూరం నడిచి ఒక గుడిసెముందు ఆగారు.

"ఇదే మా ఇల్లు" చెప్పింది నేరేడు.

లోపలికి వెళ్ళారు.

గుడిసె గోడకు ఆనించి వేసిన పందిరిలో ఒక మూలగా సోడా మిషనూ, దాని పక్కనే గ్యాసు సిలిండరూ కనిపించాయి.

"కూర్చోండి" అంది నేరేడు.

ఇద్దరూ తుప్పు వాసన కొడుతున్న యినప కుర్చీలలో కూర్చున్నారు. "అమ్మను పిలుచుకొని వస్తాను" అని చెప్పి నేరేడు ఎక్కడికో వెళ్ళింది.

అణువు అణువునా పేదరికం కనిపించే ఆ ఇంటిని ఆసాంతం పరిశీలనగా చూస్తూ కూర్చున్నారు చైతన్య, పానకాలు.

కొంచెం విలువైన వస్తువు అంటూ ఆ ఇంట్లో వుంటే అది సోడా మిషను ఒక్కటే! అదే వాళ్ళకు జీవనాధారంగా చివరికి మిగి లింది. నేరేడు తల్లి శాంతకుమారి తన ఒక జీవితకాలం రికార్డు డ్యాన్సులకు అంకితమై జీవన సంధ్యలో తనకంటూ మిగుల్చుకోగలి గింది యింతే!

ఒకప్పుడు ధృవతారగా వెలిగిన రోజా యిప్పుడు పూట గడవని దుర్భర దారి ద్ర్యంలో కొట్టుమిట్టాడుతోంది. శాంతకు మారి కూతురు రెక్కల కష్టంమీద జీవనం సాగిస్తోంది. దిల్‌ఖుష్ కాముకుల, పోలీ సుల వేధింపులకు గురౌతూ అనుక్షణం ఆందోళన పడుతోంది.

డ్యాన్సర్ల జీవితాలు యిలా కొనసాగవల సిందేనా? వాళ్ళకిక ప్రశాంతంగా జీవించే అవకాశమే లేదా? శరీరంలో శక్తి, ఆకర్షణ, వయసూ వుండి వేదికలమీద నర్తిస్తున్నంత కాలమేనా వాళ్ళబ్రతుకు? ఆ తరువాత వాళ్ళకు మిగిలేది ఆకలి, కన్నీళ్ళేనా?

చైతన్య భారంగా నిట్టూర్చాడు. అతనికి అంతా అయోమయంగా తోస్తోంది వాళ్ళను గురించి. సుధీర్ లాంటి వాళ్ళున్న సభ్యస మాజం చెప్పే దానికీ, వాళ్ళ వాస్తవ జీవితా లకూ పొంతనే కనిపించటం లేదెక్కడా.

కొంచెంసేపటికి నేరేడు అమ్మను వెంటపె ట్టుకొని వచ్చింది. తల్లీకూతుళ్ళు కింద చాప పరచుకొని కూర్చున్నారు.

"మా అమ్మ... పేరు శాంతకుమారి" పరి చయం చేసింది నేరేడు.

చైతన్య, పానకాలు శాంతకుమారి వైపు చూశారు! ఆమె వయసుకు మించిన వృద్ధా ప్యంతో దేహం అంతా శిధిలమై కనిపిం చింది. తెల్లగా మెరిసే నెరిసిన జుట్టూ... తేజం మచ్చుకయినా లేని కళ్ళూ... కండలు కరిగి ఆవిరైపోయి సన్నగా పుల్లల్లా వున్న కాళ్ళూ, చేతులూ...

"నేరేడు ఇంటికొచ్చేదాకా ఒక్కదానికే తోసదు బాబూ! అందుకే పక్కింటికి పోయి నాను. మాట్లాడుకుంటూ కూకున్నాం" అని.

"ఏంటిది బాబూ ఇలా వొచ్చినారు? "





అని అడిగింది శాంతకుమారి.

ఆమె మాట తీరునుబట్టి బొత్తిగా చదువు కోలేదని అతనికి అర్థమైంది. జీవితాన్ని చదివి ఎన్నో చేదు అనుభవాలను జ్ఞాప కాల పొదిలో దాచుకున్న నిరాసక్తత, తాత్త్వి కత ధ్వనించాయి ఆమె గొంతులో.

చైతన్య వెంటనే సమాధానం చెప్పలేదు. ఏదో తీవ్రంగా ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"ఏంటి బాబూ ఆలోశిత్తన్నావ్? " అని అడిగిందామె.

ఆలోచనలనుంచి తేరుకొని "మీరు ఎంత కాలం అలా రికార్డు డ్యాన్సు వృత్తిలో వున్నారు? " అడిగాడు.

"పదేళ్ళు" అని అదోలా నవ్వింది ఆమె.

"మీరు ఆ వృత్తినే ఎందుకు ఎంచుకున్నారు? "

"మా అయ్య నా సిన్నప్పుడు ఒక డ్యాన్సు పార్టీలో హార్మణి వాయిచ్చేవోడు. మా అయ్యకి సదువులేదు. ఇంకా అయ్యకన్నా నాలుగు అచ్చరంముక్కలూ, హార్మణి వాయిస్తే ఎవుడు ఎంత కిరాయి యిచ్చిండో? ఎవుడు బాకీ పెట్టిండో అన్న లెక్కలు కాయితంమీన రాయటం వొచ్చు గానీ అమ్మకి అది గూడా రాదు. సదూకున్న మారాజుల పిలకాయలు యిస్కోలు బళ్ళకుబోయి సదూకుంటారుగానీ నా అసుమంటోళ్లను సదివిచ్చను అయ్యా, అమ్మా సదూకొని సచ్చినోళ్లు కాదుగదా. అందుశాత నానూ సదూకోలేదు.

"అయ్యోంట ప్రెభల కాడికి బోవటం, జాతర్లకి తిరగటం అట్టాగా తిరుగుతా తిరుగుతా డాన్సులు జూసి నానూ సిల్మా పాట యాడైనా యినిపిచ్చగానే కాల్సేతుల తిప్పుతా ఆడేదాన్నంట. కళ్లూ, ముక్కూ ఎగరేత్తా గెంతేదాన్నంట.

సెంద్రమ్మనుకుంటా ఆ యమ్మి పేరు, అది ప్రెభలకాడ డాన్సులేసేదంట. దాని కాడ మా అయ్య హార్మణీ వాయిచ్చేవాడంట. ఆ సనువుమీన సెందరమ్మ నాగ్గూడా డాన్సు నేర్పిత్తానని మా అయ్యతో జెప్పిందంట. అయ్యగూడా 'సర్లే' అనంగానే నాకూ డాన్సు నేర్పిచ్చిందంట. అట్టా అట్టా నేర్చుకొని ప్రెభలకాడికి ఎల్తా ఎల్తా సివరికి పెద్దయినాక, అయ్యా అమ్మా సచ్చినాక నాగ్గూడా అదే ఆదరువైనాది. అట్టాగా నేను డాన్సరునయినాను బాబూ!" అని చెప్పింది శాంతకుమారి.

"అలా మీరు డాన్సు పార్టీలకు వెళుతూ అందరిముందూ ఆడుతూపాడుతూ వుంటే ఏమనిపించేది మీకు? బిడియం అనిపించేది కాదా? " అడిగాడు.

"అనిపిచ్చేది కాదు. ప్రెపంచకాన్ని ఎరిగిన కాడ్నించి డాన్సులాడే వోళ్లూ, తబలాలుగొట్టే వోళ్లూ, గిటారు, కంజర, హార్మణివాయించే వోళ్ళూ అందరం కలిసే వుండేవోళ్ళం. కొత్త సిల్మా వొచ్చి ఆ సిల్మాలో వుషారైన పాట ఏదైనా వుండాదంటే మంది ఆ వుషారు పాటే అడిగే వోళ్ళు. ఆ పాటకే డాన్సు కావాలనే వోళ్లు. అందుశాత ఎప్పుడూ కొత్త సిల్మాలు సూట్టం కొత్త పాటలూ, దానికి డాన్సులూ నేర్చుకోటం... అట్లా గడ్సిపోయేటిది జల్మ. నేర్వంగానే ప్రెభలమీన ఆడే వోళ్ళం. ఆడంగానే అందరూ సప్పట్లుగొట్టి సెబ్బాసు అనేవోళ్ళు. కొంతమంది సచ్చినోళ్ళయితే ఏకంగా ప్రెభలమీనకే వొచ్చి రూపాయి కాయితాలు గుండుసూదుల్తో గుచ్చేవోళ్ళు మా రెయికలకి. సీటీలు గొట్టే వోళ్ళు మా డాన్సులకి. అట్టా డాన్సులు నేరవటం, నేర్పిన డ్యాన్సులు ప్రెభలమీన ఆట్టం, అంతా శాలెంజిగా సేసేవాళ్ళం. అదే లోకం అనిపిచ్చేది మాకు. అంతేగానీ సిగ్గూ బిడియం అనిపిచ్చేది కాదు!"

"డాన్సు ట్రూపులమీద ఆధారపడి ఎంత మంది జీవనం సాగిస్తుంటారు? "

"ఒక డాన్సు పార్టీ వుండాదంటే దానిమీన బతికేవోళ్ళు శానామంది వుంటారు. డాన్సర్లే గాదు, డాన్సర్లను ప్రెభలకాడికి ఎత్తకెళ్ళే మోటారు కార్లవాళ్లకాడ్నించి మైకు సెట్లోళ్ళ



దాకా, తబలాలు వాయిచ్చేవాళ్ళకాడ్నించి గజ్జెలు మోగిచ్చేవాళ్ళదాకా! ఇంకా డ్రస్సులు అద్దెలకిచ్చేవాళ్ళూ, మ్యూజిక్కు పార్టీవాళ్ళూ, డ్రస్సులు కుట్టేవాళ్ళూ, పూసల దండలూ, గిల్టు నగలూ, గాజూగట్రా అమ్మేవాళ్ళూ, తడ వతడవకీ టీలు అమ్మే చాయ్‌దుకాణం వాళ్ళూ, చాయ్‌లు మోసే పసిపిల్లకాయలూ, వాళ్ళ డాన్సు పార్టీలో జేరి డాన్సులు జేసే వోళ్ళ కట్టంమీన బతికే కాంటాక్టర్లూ, వాళ్ళని బెదిరిచ్చి డబ్బులు నూకే పోలీ సోళ్లూ అట్టాగా శానామంది వుండారు డాన్స ర్లమీద బతికేవాళ్ళు" అని చైతన్యవైపు చూస్తూ "నీ పేరు శైతన్య గదూ?" అని అడిగింది.

"అవును" అన్నాడు చైతన్య.

"సూడు బాబూ... శైతన్యా! జాతర్లు జరి గేప్పుడు ప్రెభలు గట్టేపిచ్చి టౌన్లకంటే పల్లె టూర్లలోనే ఎక్కువ. మన దరిద్దరం ఏంటి దోగానీ ప్రెతి వూర్లో గూడా రొండు ముటా లుంటయ్యి. ప్రెభలు గట్టే కాడగూడా ఆ రొండు ముటాలూ పోటీలు బడతయ్యి. ఒకడు మావూలు ప్రెభ గడితే యింకొకడు కరెంటు ప్రెభగడతాడు. ఒకడు సిన్న డాన్సు పార్టీ బెడితే రొండోవాడు పెద్ద డాన్సుపార్టీ బెడతాడు. సరదాలకీ సలిమం దుకీ, ప్రెభలు గట్టేందుకూ, డాన్సులు బెట్టేం దుకూ ముట్టామీనబడి సందాలు పోగే త్తారు. ఊర్లో రోడ్లూ, మురుక్కాలవలూ పట్టిచ్చుకోరుగానీ ప్రెభలకాడ మాత్తరం పందేలుబడి లచ్చల రూపాయలు తగలే త్తుంటారు!

ఇగసూస్కో శైతన్యా...! ప్రెభలమీద అమ్మాయిలు డాన్సులు సేత్తావుంటే అప్పుడు సూడాలి వాళ్ళ పైచ్చకారితనం! తాగి తూల్తా ప్రెభలమీదికెక్కుతారు. బీడీ లకోసరం దాపెట్టుకున్న రూపాయి కాయితా లని గుండుసూదులతో డాన్సర్ల రెయికలకి గుచ్చుతారు. తాగున్న నాయాళ్ళకి తాడూ బొంగరం తెలవదు. ఒక్కోపాలి ఆ నిసాలో గుండుసూది యాడ గుచ్చేది గూడా తెలవక అమ్మాయిల ఒంటికే గుచ్చుతావుంటారు"

"మీ డ్యాన్సులు అశ్లీలంగా వుంటాయని, పాటలు కూడా బూతు అర్థాలతో వుంటా యనీ అంటారు. అది నిజమేనా?" అడి గాడు చైతన్య.

ఆమె చాలా నిర్లిప్తంగా నవ్వింది.

"రికార్డు డాన్సర్లు ఎవురూ సొంతంగా పాటలు పాడరు. సిల్మా పాటల రికార్డు మైకులో ఏసుకుంటూ సిల్మాలో యీరో యిన్లు ఆడినట్టే ఆడ్తారు. డ్రస్సులు గూడా సిల్మా యీరోయిన్ల డ్రస్సులే యాస్తారు. అసుమంటప్పుడు సిల్మాల్లో కనిపిచ్చని, అని పిచ్చని శబ్బరితనం మాకాడ ఎందుకు కని పిచ్చుతుంది?

మా డాన్సుల్ని జూసి సెడిపోయేటంత శపలత్వం వుండేవాళ్ళు మంచోళ్ళు ఎట్టాగవు తారు? ఆళ్ళందరూ సెడినాకనే మా డాన్సుల్లో సెడుతనం ఎతుకుతుండారు. ఈ మద్దెనే జరిగిన ఎలచ్చను ప్రశారానికి ఆడ సిల్మాయాకటేరు యాడికో ఎళితే అధికార పార్టీ ఆసామి ఎవుడో ఆ వజాన వాటేసు కొని మంత్రిగోరు సెప్పేదాకా యిడవలే దంట. అది మడుసుల్లో వుండ మాయగత్త రేగానీ మా అసువంటోళ్ళ డాన్సుల వల్ల కాదు. ఆమె కవ్వించలేదుగదా ఆ ఆసామి అట్టా వాటేసుకోటానికి?

"అంతా సేస్తే సిల్మావోళ్ళ యవ్వారం అట్టాగుంచి మా గురించి ఆలోశన జెయ్యండి! ఆడినంత కాలం యాళకింత బువ్వదొరుకుద్ది గానీ ఆడలేని యాళ ఆద రువులేని బతుకులు మావి. మాకు సివరికి మిగిలేది ఏంటిదో తెలుసా? తాగుబోతు నాయాళ్ళు గుండుసూదులు గుచ్చిన మచ్చలు మాత్తరవే!" అంటూ శాంతకుమారి ఎంతమాత్రం సంకోచించకుండా జాకెట్టు ముడి విప్పి భుజాలమీద, గుండెమీద వున్న మచ్చలను చూపించింది.

ఆనాటి చేదు అనుభవాల జ్ఞాపకాలుగా




యింకా ఆమె శరీరంమీద వున్న ఆ మచ్చలను చూసి అవాక్కయిపోయాడు చైతన్య. పానకాలు పరిస్థితి కూడా అలాగే వుంది.

"... ప్రెపంచకం అన్నాక మంచి, శబ్బర రొండూ వుంటయ్యి. అది లోకం తీరు. కాకపోతే యీడ మన గాచారం ఏంటిదంటే, సెడ్డోళ్ళు మంచిని సెడ్డంటారు. మంచిమీన రాళ్ళేస్తుంటారు. సెడుకీ, మంచికీ తేడా డబ్బుల కాడనే అనుకునేవోళ్ళు శబ్బరోళ్ళను మంచోళ్ళనీ, మంచోళ్ళని శబ్బరోళ్ళనీ అంటుంటారు.

సైతన్య బాబూ! బిడ్డవంటి వోడివన్నాను. నా రొమ్ములు సూపిచ్చాను. తల్లి రొమ్ము సూడని బిడ్డుంటాడా బాబూ భూమ్మీన? కడుపులో శబ్బర ఆలోశనున్న మడుసులకు అందులోగూడా శబ్బరతనవే కనిపిస్తాది. శివరాకరికి పసిబిడ్డలకి పాలిచ్చేటి తల్లుల్ని జూసినా ఆళ్ళకి గుర్తొచ్చేది అదే. అంత వొరుకూ ఎందుకూ... దగుల్బాజీతనం మనసులో వుండప్పుడు సివరికి గుడికాడి శివలింగాన్ని సూసినా అట్టాగే కనిపిస్తాది ఆళ్ళ కళ్ళకి! పెళ్ళాలతో సంసారాలు ఎట్టా సేస్తారో..." అని తన అక్కసునంతా వెళ్ళబోసుకొన్నదామె.

"మీవారు... మీ వారేమయ్యారు? " ఒక నిముషం తరువాత నెమ్మదిగా గొంతు పెకలించుకొని అడిగాడు చైతన్య.

ఆమె చివాలున తలదించుకొంది. ఏదో విషాదం అలలా ఆమె ముఖాన్ని తాకి తిరిగి గుండె లోతుల్లోకి వెళ్ళిపోయింది.

నెమ్మదిగా నిట్టూర్చి "నా మగడు బురదలో బుట్టిన సక్కటి పువ్వసుమంటోడు. నాను పనిజేసే డాన్సుపార్టీలో ఆడూ కామిక్కులు సేత్తావుండేవోడు. డాన్సర్లు అలిసిపోయినప్పుడూ, ఆళ్ళు సంటిపిల్లలకి పాలిచ్చేప్పుడూ ప్రెభలకాడి జనాన్ని నగిపిస్తావుండేవోడు.

సెప్పొద్దూ...! జనాలకి ఆ దినాల్లో డాన్సుపార్టీలు యాడ జరిగినా రేలంగోడూ వాడే, రాజబాబూ, రవణారెడ్డీ వాడే, సివరికి పద్మనాబం గూడా వాడే, అట్టాగా అందర్నీ నగిపిచ్చేవోడు.

సైతన్యబాబూ! మడుసులన్నాక ఎవరేం జేసినా, సేసిన కట్టంతో యాళకింత బువ్వ దిని దినాలు ఎళ్ళదీసినా, ఏదో ఒక దినం కాడ్నించి ఆడదానికి మొగోడూ, మొగోడికి ఆడదీ ఆదరువు గావాల్సిందేగా! అసుమంటి ఆదర్వు కోసరం ఆడూ, నానూ జతగట్టినాం. మావోళ్ళే డోలక్కూ, కంజర, గిటారూ కొడతా హార్మణి, సన్నాయీ వాయిత్తాంటే నానూ, ఆడూ సౌడమ్మ గుడికాడ లగ్గం జేసుకున్నాం. పుస్తెగట్టిండు. పెనిమిటి అయిండు. పేనానికి పేనంగా సూసిండు నన్ను.

నిజం సెప్పాలంటే బాబూ...! మొగుడ్ని పెళ్ళావూ... పెళ్ళాన్ని మొగుడూ ప్రేపగా జూసుకొనే సంసారాల్లో సొరగం వుంటాదని ఆడు నాకు పుస్తెగట్టి మొగుడైనాకనే తెలిసింది. నానంటే ఆడికి ఎంత ప్రెవో ఎదవ సచ్చినోడికి. నాను జస్తే నాతోనే ప్రేనం యిడిసేటంత ప్రెవ నానంటె.

సైతన్యబాబూ! సుప్పనాతోళ్ళూ, ఎదుటోళ్ళు పచ్చంగా వుంటే కళ్ళల్లో నిప్పులు పోసుకొనేవోళ్ళూ మడుసుల్లోనే వుంటారనుకుంటాంగానీ మడుసుల్లోనే గాదు దేవుళ్ళలో గూడా వుండారసువంటోళ్ళు! యాఁవైందో తెలుసా...! యీ గుంటముండ నేరేడు బుట్టిన కాడ్నించి దాన్ని చదువులు సదివియ్యాలనే మా ఆలోశన. యిస్కోలు బడి సదువుదాకా సదివిచ్చినాం. కాలోజీలో సేర్పియ్యాలని నిర్ణాయకం జేసినాం. అసువంటప్పుడే ఒక తూరి మాయదారి జాతరొత్తే ప్రెభమీన ఆడు కామిక్కుకీ, నాను డాన్సుకీ ఎళ్ళినాం. సరిగ్గా డాన్సు ఆడుతుండప్పుడే ప్రెభ మద్దెగాలకి యిరిగి పడిపోనాది. అసలికే అది కరెంటు ప్రెభ. ఊర్లో ఏంటిదో శాలెంజి జరిగినాదంట. అందుశాత ప్రెభని లచ్చ రూపాయల కర్సుతో లావాంటి

బొంగులు దెచ్చి ఆకాశం ఎత్తుకు కట్టినారు. ఊపులో ఆ ప్రెభ యిరిగి సట్టం ఆడిమీదన బడింది. రగతంగక్కి సచ్చిండు ఆడనే. నాకు మాత్తరం కాలిరిగింది. అంతేగానీ ప్రేనం బోలేదు. ఆడు సచ్చిండని నానూ సద్దావంటే యీ గుంట ముండకి దిక్కెవరుండారు? ఎవుళ్ళు దాన్ని సాకి మనువుజేసి పంపిత్తారూ? ఎవురూ సెయ్యరు. నానే బతికుండాలి.

అట్టా సావలేకా, యిట్టా బతకలేకా బతికి సచ్చిన దాన్నిగా నన్ను మిగిలిచ్చాడనే బాబూ, దేవుడూ సుప్పనాతోడే అన్నాది. అలా దాని సదువూ సంకనాకిపోనాది. నేనా డాన్సులు జెయ్యలేను. సంసారవా... గడవాలి.

ఎట్టాగా బగవొంతుడా అని ఆలోసిత్తా యాడవబడితే అప్పుడీ గుంటముండే నాకు దయిర్నం జెప్పింది. 'నాను బతికే వుండానే అమ్మా యాడవమాకు' అని బయ్యం పోగొట్టింది. దాన్ని కాలేజిలో సేర్పియ్యటానికి దాపెట్టిన డబ్బులుపెట్టి సోడా మిసనూ, బండి, సీసాలూ గొన్నది. హాలుకాడ సోడాల యాపారం జేస్తా నన్ను బతికిస్తుండాది. నానేగాదు, ఒక్క మాటలో సెప్పాల్నంటే వడ్డీ యాపారం జేసే జంగయ్య బతికేది గూడా దాని రెక్కల కట్టంమీదనే!" అని చెప్పిందామె.

"జంగయ్య ఎవరూ? " అడిగాడు చైతన్య.

"ఉండాడులే వందకి పది రూపాయల వొడ్డీ కాడికి డబ్బులిత్తా మంది కట్టంమీద తిని కూకొని వొళ్ళు పెంచేవోడొకడు. ఆడి కాడనే సోడా మిశను గొన్నది నేరేడు. ఎవురో ఆడికాడ తాకట్టెట్టిందంట. సెప్పిన టయానికి ఎత్తకపోకపోతే సీపులో అమ్మిండు. సగం డబ్బులు జమేసినాదిగానీ సగం బాకీ పడినాది. ఆ సగానికి సచ్చినోడు పది రూపాయల వొడ్డీ కాడికి గుంజుతానే వుండాడు. ఆడి బాకీ సుప్తాగా జమెయ్యాల్నంటే ఎన్ని సోడాలు అమ్మాలె ఒకేతూరి అన్ని డబ్బులు గట్టాల్నంటే?

"యీ యిసయం ఏంటికి సెప్పినానంటే మా ఆయన యవ్వారం అడిగినావు గనుక! ఆడు సచ్చిపోకపోతే నేరేడు కాలేజిలో సదివేది. నా కాలు యిరిగిపోకపోతే నాను డాన్సులే జేసేదాన్ని. అందుశాత ఎవుడు ఏ పని సెయ్యాలని నిర్ణాయకం నేసుకుంటారో? ఎవురి జల్మలు ఎట్టా గడిచిపోతాయో? అదెవ్వరం సెప్పలేం బాబూ! డాన్సులు సెయ్యనని నేరేడు యిట్టాగ సోడాబండి బెట్టిందిగానీ లేకపోతే అది గూడా డాన్సరే అయ్యుండేది. దానిగ్గూడా జనం సప్పట్లు గొట్టేవోళ్లు. తాగొచ్చి గుండు సూదులు గుచ్చేవోళ్లు!" అని నవ్వింది శాంతకుమారి.

అప్పటికే బాగా పొద్దుపోయింది. మనసులో యింకా చాలా అనుమానాలూ, సందేహాలూ వున్నాయిగానీ అన్నీ తీర్చుకొనేందుకు అది సమయం కాదని అనుకొన్నాడు చైతన్య.

"మిమ్మల్ని చాలా శ్రమపెట్టాను. ఏమీ అనుకోకండి. బాగా పొద్దుపోయింది. ఇక వెళ్తొస్తాం" అని లేచాడు చైతన్య.

నేరేడు రోడ్డుదాకా వచ్చి వాళ్ళను సాగనంపింది.



జంగయ్యకు హార్మోనియం పెట్టె అమ్మి అతనికి యివ్వాల్సిన బాకీ చెల్లుపోను యాభై రూపాయలు తీసికొని వెళ్ళిన రోజా దాదా

పుగా పరుగెత్తుతున్నంత వేగంగా బజారుకు వెళ్ళింది. పాపాయికి పాలడబ్బా కొనుక్కొని అంతే వేగంగా యింటికి బయల్దేరి వెళ్ళింది.

పాల డబ్బా కొనగా యింకొంచెం చిల్లర డబ్బు మాత్రమే మిగిలింది ఆమె చేతిలో. అది ఒక్కరోజు యిల్లు గడిచేందుక్కూడా సరిపోదు. బియ్యం యీ పూటకే వస్తాయి. దీపం బుడ్డిలో వున్న కిరోసినే తప్ప అది కాస్తా ఐపోతే యింట్లో చమురుదీపం కూడా యిక వెలగదు.

ఏం చెయ్యాలి? తన యిల్లు గడుస్తూ పాపాయి పాల డబ్బాలకు యిబ్బంది లేకుండా కొంచెం ఆదాయం వచ్చే మార్గం ఆలోచించాలి. అలాంటి మార్గం ఏముంది?

ఇంటివైపుకు నడుస్తూనే ఆలోచించసాగింది రోజా.

ఇప్పుడు కొన్న పాలడబ్బా అయిపోయే దాకా పాపాయికి యిబ్బంది లేదు. అది అయిపోతేనే యిబ్బంది. అందుచేత యీ పాలడబ్బా అయిపోయేలోగా తను డబ్బు సంపాదించాలి. ఎలా?

తనకు తెలిసింది, అనుభవం వుంది, తనకు చేతనయిందీ డ్యాన్సు చెయ్యటం ఒక్కటే. అంతకుమించి తనకేమీ తెలియదు. కొత్త పనిలోకి వెళ్ళాలంటే అనుభవం వుందా అని అడుగుతారు. డాన్సరుగా అనుభవం వుందంటే కుదరదు. పనిలో చేర్చుకోరు కూడా.

అందువల్ల తన జీవితం ధ్వంసమైన రంగంలోనే మళ్లీ ప్రయత్నం చెయ్యాలి. చిన్నా చితకా ప్రోగ్రాములు చేసి అయినా కొంచెం డబ్బు సంపాదించాలి. కానీ ఆ రంగంలోకి ఇప్పుడు తనను ఎవరు ఆదరిస్తారు? ఎవరు బతికేందుకు మార్గం కల్పించి తనకు ప్రోగ్రాములు ఇస్తారు.

రోజాకు అప్పుడు గుర్తొచ్చాడు కాంట్రాక్టర్ రవి.

అలాంటి ఎవరో ఒక కాంట్రాక్టరు అండ లేకుండా వాళ్ళ ట్రూపుల్లో చేరకుండా స్వతంత్రంగా చెయ్యగలిగింది ఏమీ వుండదు. అందుకని అతని దగ్గరికి వెళ్ళాలి. తన పరిస్థితిని చెప్పుకోవాలి. ప్రాధేయపడి తనకు ప్రోగ్రాములు ఇవ్వమని అడగాలి.

ఒకానొక రోజుల్లో తనను ఆరాధించిన వాడు రవి. తన సాంగత్యం కోసం పరితపించినవాడు. అలాంటివాడు తను వెళ్ళి బతిమాలితే కాదనడు. తనకు తప్పకుండా మార్గం చూపిస్తాడు అన్న నిర్ణయానికి వచ్చింది రోజా.

పాపాయిని ఎత్తుకొని ఒక చెయ్యి పాపాయిమీద వుంచి మరోచేత్తో పాలడబ్బా పట్టుకొని ఇల్లు చేరుకొన్నది. పాపాయినీ పాలడబ్బానూ ఇంటిముందున్న అరుగుమీద వుంచి తాళంతీసి తలుపులు తెరచింది. పాపాయినీ, పాలడబ్బానూ ఇంట్లోకి తీసుకొని వెళ్ళింది.

తన భుజంమీదినుంచి దించి అరుగు మీద పడుకోపెట్టినప్పుడే నిద్రలేచి ఏడవసాగింది పాపాయి. ఇప్పుడా పాపాయి ఏడుపు రోజాకు బాధనిపించటంలేదు. ఎటూ వేడి నీళ్లు కాచి పాలు కలిపితే దాన్ని నిద్రలేపాలి. పాలు తాగించి పడుకోబెట్టాలి.

ఇప్పుడు పాపాయే నిద్రలేచింది. పాలు కావాలి గనుక ఏడుస్తున్నది. ఇందాక కూడా ఏడ్చింది. కానీ అప్పుడు కలిగిన భయం, బాధ తనకు ఇప్పుడు కలగటంలేదేం? ఇందాక ఏడ్చినా పాలు ఇవ్వని అమ్మ ఇప్పుడు ఇచ్చినందుకు అది తనవేపు మెరుపు కళ్ళతో చూస్తుంది. కడుపు పాలతో నిండిన పాపాయి చూపులు బాగుంటాయి. అవి చూడబోతోన్నందుకేనేమో రోజాకు ఆనందంగా కూడా వుంది ఇప్పుడు.

గబగబా పొయ్యిలోకి చిదుగులను తోసింది. అగ్గిపుల్ల గీచి పొయ్యి వెలిగించింది. పొయ్యిమీద నీళ్ళగిన్నె పెట్టింది.



నీళ్లను కాచి చల్లార్చి పాలపొడి వేసి కలిపి పాలు తయారుచేసింది. వాటిని చల్లార్చి పాలసీసాలో పోసింది. పాలపీకను సీసాకు బిగించి, పీకను పాపాయి నోటికి అందించింది వడిలో పడుకోపెట్టుకుని.

పాపాయి పాలపీక పెదాలకు తగలగానే ఏడుపు మానివేసింది. ఆబగా పాలుతాగుతూ చేతులతో తల్లి స్తనాలను తడుముతూంది. ఎంత ఆనందంగా వుందో!

అలా చాపమీద చాలాసేపు పాపాయిని వడిలో పెట్టుకొని కూర్చుంది రోజా. పాపాయి కడుపునిండా పాలు తాగింది. పాలపీకను విడిచిపెట్టకుండా పెదాలతో అలాగే పట్టుకొని నిద్రలోకి జారుకొంది.

పాలసీసాను నెమ్మదిగా తీసి పక్కనపెట్టి చాపమీద పొత్తిగుడ్డలను కుదురుగా పరచి పాపాయిని పొత్తిళ్లమీదకు మార్చి కొంచెం సేపు చిచ్చికొట్టింది. కదలకుండా పడుకొంది పాపాయి.

రోజా నెమ్మదిగా లేచి మళ్ళీ పొయ్యి దగ్గరికి వెళ్ళింది. అప్పుడు ఆమెకు కూడా ఆకలి గుర్తొచ్చింది. హడావుడిగా బియ్యం కడిగి పొయ్యిమీద పెట్టి చిదుగులను వూదింది.

పాపాయికి పాలు కాచినప్పుడు వెలిగించిన చిదుగులు ఆరిపోలేదు. అలా వూదుతూంటే మళ్ళీ రాజుకొని మండాయి. మరో అగ్గిపుల్ల వెలిగించే అవసరం లేకుండా పొయ్యి వెలిగింది. మంటలు లేచాయి. మంటలవేపు తదేకంగా చూస్తూ కూర్చుంది.

కొంచెంసేపటికి అన్నం ఉడికింది. పొయ్యి ఆర్పివేసి అన్నం గిన్నెను కిందికి దించింది. త్వరగా చల్లారితే నాలుగు ముద్దలు తిని రవి దగ్గరికి వెళ్ళాలని అనుకొంది.

ఐదు నిమిషాలు గడిచాయి. అన్నం చల్లారింది. సత్తుకంచంలోకి అన్నం వొంపుకుని సీసాలో వున్న చింతకాయ తొక్కు వేసుకుని కలుపుకొని తింది. మజ్జిగ లేదని ముందే తెలుసు గనక ఆకలిమంటల ఉధృతం తగ్గేందుకు తగిన అన్నం మాత్రమే పెట్టుకుని తిని మిగిలిన అన్నం మీద మూతపెట్టి చెయ్యికడుక్కొని లేచింది. మళ్ళీ ఒకసారి కడుపునిండా మంచినీళ్లు తాగింది.

తెల్లవారగానే పక్క ఇంటికి పాలమనిషి వస్తాడు. కొంచెం పాలు పోయించుకుని కాగపెట్టి తోడు వేసుకోవాలి. రేపటికి కూడా అన్నం ఎటూ మిగిలింది. దానికితోడు పెరుగు చేసుకొంటే హాయిగా అన్నం తినవచ్చు.

రోజా పైటకొంగుతో చెయ్యి తుడుచుకొంది. వాకిట్లోకి వెళ్ళి, "మంగమ్మత్తా!" అని కేకవేసి పిలిచింది.

పక్కగదిలో అద్దెకు వుంటున్న మంగమ్మ అప్పుడే అన్నంతిని అప్పుడే అలా నడుం వాల్చింది. రోజా పిలుపు వినిపించి మూలుగుతూ లేచి రోజా దగ్గరకి వెళ్ళి, "ఏంటే?" అని అడిగింది.

"అత్తా...! రవి దగ్గరికి వెళ్ళాలి. అతనితో పనివుంది. పాపాయి నిద్రపోతోందిగానీ నేను వచ్చేదాకా దాన్ని చూస్తుంటావా?" అని అడిగింది రోజా.

"ఇంతరేత్తిరేళ ఆడికాడికి ఎందుకూ?"

"ఇంట్లో అసలు డబ్బులేదు. ఇప్పుడే జంగయ్య దగ్గర ఓ యాభైరూపాయలు తెచ్చి పాపాయికి పాలడబ్బా కొన్నాను. తెల్లవారితే బియ్యంలేవు. ఇంటి అద్దె కూడా ఇవ్వాలి..."

"వాడ్ని అడుగుతావా డబ్బులు?"

"కాదు. డ్యాన్సు ప్రోగ్రాములకు పంపించమని అడిగొస్తాను"

ఆమె కొంచెంసేపు ఆలోచించి "సరేగానీ, ఎళ్ళిరా!" అంది. లోపలికి వెళ్ళి పాపాయి పక్కనే చాపమీద పడుకుంది.

రోజా హడావుడిగా నడుస్తూ రవి డ్యాన్సు పార్టీ ఆఫీసు దగ్గరికి వెళ్ళింది. సమయానికి అతను ఇంకా ఇంటికి వెళ్ళకుండా ఆఫీసు




లోనే వున్నాడు.

తిరుణాల సీజను వస్తుంది గనుక ఎవరె వరో పార్టీలకు బుక్ చెయ్యటానికి వస్తూ వుంటారు. అందుకే రవి ఇంకా అక్కడే వున్నాడని ఊహించింది రోజా.

రవి ఎవరితోనో మాట్లాడుతున్నవాడల్లా తల ఎత్తి రోజావైపు చూశాడు. చిర్నవ్వు నవ్వుతూ, "రా... రా...!" అని ఆమెను లోప లికి పిలిచాడు.

"నీతో కొంచెం మాట్లాడాలి" దగ్గరికి వెళ్ళి అంది.

"వెళ్లి గదిలో కూర్చో వీళ్ళతో మాట్లాడి పంపించివస్తాను" అన్నాడు రవి.

రోజా లోపలి గదిలోకి వెళ్ళి కూర్చుంది.

అరగంట తరువాత మాట్లాడుతున్న పార్టీని పంపించి రోజా కూర్చున్న గదిలోకి వచ్చాడు రవి. కుర్చీలో కూర్చొని ఆమెవైపు పరీక్షగా చూశాడు.

ఒకనాడు ఆమె సౌందర్యానికి అబ్బురపడి తను ఆరాధించిన ఆ రోజాయేనా ఈమె? దైన్యం నిండిన కళ్లతో నిస్తేజంగా చూస్తున్న ఈమె రికార్డు డ్యాన్సుల రంగంలో ఒక వెలుగు వెలిగిన ఆ రోజాయేనా?

"ఎలా వున్నావ్? " అని అడిగాడు నెమ్మ దిగా.

నిర్లిప్తంగా నవ్వింది.

"ఏమిటి ఇలా వచ్చావ్? "

"నాకు నీ సహాయం కావాలి. నా ఆర్థిక పరిస్థితి చాలా దారుణంగా వుంది. పూట గడవటమే గగనంగా తోస్తోంది. ఏం చెయ్యాలో అర్థంకాక ఇలా వచ్చాను" అంది రోజా వంచిన తల ఎత్తకుండానే.

"ఏం చెయ్యమంటావ్? " అడిగాడు.

"నాకేదేనా డ్యాన్సు ప్రోగ్రామ్‌లు ఇచ్చే అవకాశం వుందా? "

"అదే ఆలోచిస్తున్నాను. ఇందాక మాట్లాడి వెళ్లినవాళ్లు మన దిల్ ఖుష్‌ను బుక్ చేశారు. ఆమె వెంట నువ్వూ వెళ్ళొచ్చు గానీ నువ్వందుకు ఇష్టపడతావో, లేదో. నువ్వూ ఒకప్పుడు బాగా వెలిగిన దానివి. అలాంటిది ఇప్పుడు మరో డ్యాన్సరుకు తోడుగా వెళ్ళాలంటే బాధగానే వుంటుంది"

"అలాంటి అభ్యంతరాలు నాకేమీ లేవు. పట్టింపులు కూడా లేవు. అయినా నాలాంటి పేదవాళ్ళకు పంతాలూ, పట్టింపులూ వుంటే ఎలా? " అంది రోజా విషాదంగా నవ్వుతూ.

"చంద్రం ఇక తిరిగి రానట్టేనా? నీ జీవి తాన్నిలా ధ్వంసం చేసినట్టేనా? " అడిగాడు రవి.

"అతని విషయం మాట్లాడుకోవటం కూడా అనవసరం. నేనే మర్చిపోయాను ఆ విషయం..."

"మరో ఉద్దేశంతో కాదు అడిగింది. చంద్రం ఎప్పటికయినా మనసు మార్చు కొని వస్తే నీకు ఇన్ని బాధలు వుండవు కదా అని!"

"అతను తిరిగి ఇక రానేరాడు. ఒకవేళ వచ్చినా అతడ్ని ఆహ్వానించేంత సహనం నాకు లేదు" అంది రోజా ఒక్కోమాటా ఒత్తి పలుకుతూ.

"ఆనాడు నువ్వు నా కోరిక మన్నిస్తే బాగుండేది కదూ? "

"ఆ విషయం ఇప్పుడు ఎందుకూ? "

"మరేం లేదు. అలా అనిపించిందంతే! ఆ రోజుల్లో మనం ఒకటైవుంటే ఎంతో బాగుం డేది. ఆర్థికంగా కూడా ఈపాటికి బాగా స్థిర పడేవాళ్ళం. ఇప్పుడు రోజులు చాలా మారి పోయాయి. జనం రికార్డు డ్యాన్సులను వెనుకటిలా ఆదరించటంలేదు. టి.వీ.లకూ, సినిమాలకూ ఎగబడుతున్నారు. సినిమాల్లో చూపించినట్టు అశ్లీలంగా మనం డాన్సులు చెయ్యంకదా! అదీకాకుండా పోలీసులు మనల్ని వేధిస్తున్నారు..."

"ఎందుకూ? " అడిగింది రోజా.

"ప్రభలమీద మీరు చేసే డ్యాన్సులు చూసి సంఘం చెడిపోతున్నదిట"

"అలా ఎవరన్నారూ? "

"పోలీసులూ, కొంతమంది సంఘసంస్క

ర్తలూ!"

"ఇది చాలా అన్యాయం. మేమలా సంఘాన్ని చెడగొట్టే వాళ్ళమే ఐతే సంఘం మమ్మల్ని బాగానే ఆదరించేది. ఇన్ని దుర వస్థలు మాకు వుండేవే కావు. అలాంటి మమ్మల్ని వాళ్లు అలా ఎందుకు అంటు న్నారూ? "

"మీరు చెడిపోలేదు గనుక!" చెప్పాడు రవి.

రోజా మౌనంగా తల దించుకుంది.

"మహాభారతంలో ద్రౌపది అడిగిందిట. ధర్మరాజు తన్నోడి నన్నోడెనా? నన్నోడి తానోడెనా? అని. దానికి ఏదో ఒక ధర్మ సూత్రం చెప్పి చివరికి జూదరి ధర్మరాజుదే ధర్మం అని తేల్చారు జ్ఞానులు. అలాగే ఇప్పుడు చెడిపోయిన జనం మిమ్మల్ని చెడు డ్యాన్సులు చెయ్యమంటున్నారా? మీరు చెడి పోయి చెడుడ్యాన్సులు చేస్తున్నారా? అన్నది సమస్య!

"అందుకు చాలా తర్జన భర్జనలు పడి చివరికి తప్పంతా మీదే అని తేల్చారు జ్ఞానులయిన పోలీసులూ, సంఘసంస్క ర్తలూ!" అని కిసుక్కున నవ్వాడు రవి.

"పోలీసులు అలా అన్నారంటే సరే! అలా అన్న సంఘసంస్కర్తలెవరు? " అడిగింది రోజా.

రవి గుండెనిండా గాలిపీల్చుకొని వాది లాడు. కొంచెం విరామం తరువాత సుధీర్ దిల్ ఖుష్ మీద మనసుపడి ఆమెకోసం చేసిన ప్రయత్నాలన్నీ వివరంగా చెప్పాడు రోజాతో.

ఆమె కొంచెంసేపు నిర్ఘాంతపోయింది. "ఇంత అన్యాయం జరుగుతుంటే ఎవ్వరూ పట్టించుకోరా? " అని అడిగింది బేలగా చూస్తూ.

రవి సమాధానం చెప్పలేదు.

"దీనికి పరిష్కారం ఏమిటి? "

"కాలమే నిర్ణయించాలి" అని "ఆ గొడవ చివరికి ఎలా ముగుస్తుందో వేచి చూద్దాం గానీ నువ్వు మాత్రం ఒకటి గమనంలో పెట్టుకోవాలి" అన్నాడు రవి.

"ఏమిటది? " అడిగింది.

"ఇప్పుడు ట్రెండు చాలా మారిపోయింది. వెనుకటిలా డ్యాన్సులు వేస్తే కుదరదు. సంఘంలో స్పీడు చాలా పెరిగింది. ఆ స్పీడుకు తగినట్టు సినిమాలు వస్తున్నాయి. రికార్డు డ్యాన్సులతో జనాన్ని మెప్పించా లంటే మీరు సినిమా డ్యాన్సులతో పోటీపడి చెయ్యాలి" అని రవి కొంచెం ఆగి-

"రోజా...! గతంలో మీరు 'బావలు సయ్యా.. మరదలు సయ్యా' అన్న పాట పాడుతూ ప్రభలమీద డ్యాన్సులు చేస్తుంటే ఆ పాటలో ద్వంద్వార్థాలు వున్నాయని కొంతమంది అన్నారు. దాంతో మనం ఎక్కడా ఆ పాటకు డ్యాన్సు చెయ్యకుండా ఆపాము. ఆ పాట పాడటం మాను కున్నాం. కానీ ఆ తరువాత కొద్ది రోజులకు అదే పాట సినిమాలో పెట్టారు. డ్యాన్సు చేయించారు.

"సభ్యసమాజం ఆ పాట వింటూ, వెండి తెరమీద ఆ డ్యాన్సు చూస్తూ చొంగలు కార్చుకున్నారేగానీ ఎవ్వరికీ అప్పుడు ద్వంద్వార్థాలు వినిపించలేదు. అంటే, ఒక చోట అశ్లీలంగా కనిపించింది మరొకచోట శీలంగా అనిపిస్తుంది సమాజానికి. కారణం ఏమిటా? అని ఆలోచిస్తే తేలిందేమిటంటే జనం ఆశించినంతగా మీరు అంగాంగ ప్రద ర్శనలు చెయ్యటంలేదు. ఒళ్ళు దాచుకొంటు న్నారు. అదీ వాళ్ళకు మీమీద అక్కసు! సినిమాలను ఆదరించి మిమ్మల్ని నిరాదరిం చేది అందుకే!

"అందుచేత రోజా...! మారిన ట్రెండును బట్టి మీరూ మారండి. సినిమా పాటలు, డ్యాన్సులూ ఇచ్చినంత వినోదం మీరూ పోటీపడి ఇవ్వండి. లేకపోతే ఇక ఈ రంగంలో నిలవటం కష్టం.

"ఏదో ఆవేశంలో ఇలా చెప్పటంలేదు రోజా! కాలం తీరును గురించి చెబుతున్నా




నంతే" అన్నాడు రవి ఉద్వేగంతో.

"అందుకు ఏం చెయ్యమంటావు నన్ను?" అడిగింది.

"ఒక మొగుడు- ముగ్గురు పెళ్ళాలు సినిమా చూడు. అందులోని డ్యాన్సులు నేర్చుకో. దిల్ ఖుష్‌కు కూడా అదే చెప్పాను. ఇద్దరూ కలిసి ఆ సినిమాకు వెళ్ళండి"

"అంత త్వరగా వస్తాయా ఆ డ్యాన్సులు?"

"ఆс...! వాటిని నేర్చుకోవాలంటే సినిమాలు కూడా చూసేపన్లేదు. మే నెల ఎండల్లో తార్రోడ్లమీద చెప్పులు లేకుండా తిరిగినా చాలు"

"ఊరకనే గెంతులు వేస్తే అది డ్యాన్సు ఎలా అవుతుంది?"

"అందుకే సినిమాలు చూడమన్నాను. అనవసరంగా మనం సిమెంటు కోసం ఎగబడతాంగానీ మంచి మట్టి తోలించి దానిమీద నీళ్ళుపోసి సినిమా షూటింగు చేయిస్తే చాలు, వీరతొక్కుడు తొక్కుతారు. వెనుకటికాలంలో అలా ఏనుగుల చేత తొక్కించి ఆ మట్టితో కోటలు కట్టేవాళ్ళట. ఒక్క సినిమా పాట షూట్ చేస్తే కనీసం రెండు ఇళ్లు కట్టేంత మట్టి తయారవుతుంది" అన్నాడు రవి.

ఇద్దరూ ఆనందంగా నవ్వుకున్నారు.

"సరే ఇక వెళ్దాం మనం. త్వరగా ఇంటికి వెళ్ళాలి" అని "నీకిప్పుడు డబ్బు ఏమైనా కావాలా?" అడిగాడు లేచి నిల్చుంటూ.

రోజా కూడా కుర్చీలోనుంచి లేచింది.

"డబ్బా డబ్బు... అవసరం...లేదు" అంది తడబాటు పడుతూ.

"నేను వ్యాపారస్థుడ్ని. ఉచితంగా నీకేమీ ఇవ్వను. అడ్వాన్సుగా ఇస్తున్నానంతే!" అంటూ రవి జేబులోనుంచి వంద రూపాయల కాయితాలు రెండు బైటికి తీసి రోజా చేతిలో పెట్టాడు.

యాంత్రికంగానే డబ్బు అందుకుంది. ఎందుకో ఆమె చేతులు వణికాయి. గుండె లయతప్పి కొట్టుకోసాగింది. చెమ్మగిల్లాయి కళ్లు!

ఇందాకటి వరకూ అంధకారంగా తోచిన బతుకులో ఇప్పుడు చిరుదివ్వె ఏదో వెలిగినట్లే మనసంతా ఆనందంతో నిండిపోయింది.

ఇక పాపాయి పాలడబ్బాలకు దిగులే లేదు.

★ ★ ★

డ్యాన్సుర్ల వీధికి కొంచెం దూరంగా మెయిన్‌రోడ్డు పక్కనే కాకా హోటల్ ముందు నిలబడి వున్నారు సుధీర్ బృందం అతని కోసం ఎదురుచూస్తూ.

హోటల్ చాలా రద్దీగా వుంది. హోటల్ ముందు వరుసగా వున్న సైకిళ్లకు అవతల నిలబడి వాళ్ళందరూ సుధీర్ కోసం చాలా ఆత్రంగా ఎదురుచూస్తున్నారు.

సుధీర్ మోటారు బైక్‌మీద వస్తూ దూరంగా కనిపించాడు.

అందరూ తలలు అటువైపుకు తిప్పి మెరిసే కళ్ళతో సుధీర్‌మీదికి చూపులు గుచ్చారు.

బైక్ వచ్చి వాళ్ళ దగ్గర ఆగింది. బైక్‌మీదనుంచి కిందికి దిగి స్టాండువేసి నవ్వుతూ వాళ్ళకేసి చూశాడు సుధీర్.

బృందం అంతా అక్కడే కనిపించింది.

"అంతా రెడీ చేశారా?" అడిగాడు సుధీర్.

"రెడీ... బాస్! రెండు బకెట్ల నిండా రెడ్ ఆక్సయిడ్ రంగు కలిపాం. నాలుగు బ్రష్షులు తెచ్చాం. అంతా రెడీ చేసుకొని నీ కోసమే చూస్తున్నాం" అన్నాడు బృందంలోని మన్మధరావు అనే కుర్రవాడు.

సుధీర్ అదోలా నవ్వాడు.

ఇప్పటిదాకా జరిగిందంతా పథకం ప్రకారమే జరిగింది. కానిస్టేబులు వీరాస్వామి, రైటరూ, హెడ్డూ సలహా ప్రకారం తను ఇప్పటికే డ్యాన్సు పార్టీల విషయంలో చాలా చేశాడు. అందరికీ టెలిగ్రాంలు పంపిం

చాడు. డ్యాన్సులు ఆపించమని కోరుతూ డి.ఎస్.పి. దొరగారికి మెమొరాండం కూడా ఇచ్చాడు. అయినా ఇంకా దిల్ ఖుష్ లొంగి పోలేదంటే ఇంకా చాలా చెయ్యాలి!

తనకు పోలీసుల సహకారం వుంది. ఉద్యమం నడిపే మిత్రబృందం వుంది. ఆర్థిక వనరులున్నాయి. సంఘంలో రౌడీ లుగా గుర్తింపు వుంది. అదిగో పులి అంటే ఇదిగో తోక అనే జనం వున్నారు. సంఘం చెడిపోతున్నదని గగ్గోలు పెడితే సాని కొంపల్లోంచీ, సారా కొట్లల్లోంచీ లుంగీల మీ దనే వచ్చే సంఘశ్రేయోభిలాషులున్నారు. సంఘసంస్కరణ చేయాలంటే అంతకన్నా ఏం కావాలి?

"మనకు వున్న అవకాశాలన్నీ వినియోగ పెట్టుకుంటూ డ్యాన్సు పార్టీల వ్యతిరేక పోరాటం సాగిస్తే వాళ్ళు తట్టుకోలేరు. రాజీకి రాక తప్పదు వాళ్ళకు. వృత్తిని పోగొ ట్టుకొని ఆకలిచావులు చావలేరు. అయినా చూద్దాం. దిల్ ఖుష్ అలా ఎంతకాలం మొండిగా వ్యవహరిస్తుందో! ఎంతకాలం అందకుండా తప్పించుకొంటుందో!

"మనం గోడలమీద నినాదాలు రాసే ముందుగా ఒకసారి అందరం కలిసి డ్యాన్సర్ల వీధికి వెళ్దాం. అక్కడ నినాదా లిద్దాం. దాన్ని నిరసన ప్రదర్శనగా పత్రికల్లో వచ్చే ఏర్పాటు చేద్దాం" చెప్పాడు.

ఆనందంగా తలలు వూపారు వాళ్ళంతా.

"త్వరగా వెళ్దాం గురువా! డాన్సర్లను చూడాలని చాలా కోరికగా వుంది" అని వంకరగా నవ్వాడు మన్మధరావు.

మన్మధరావు జూనియర్ ఇంటర్ చదువు తున్నాడు. అమ్మాయిల వెంటపడాలన్నా, తనంటే అందరూ భయపడాలన్నా రౌడీ ముఠాలో చేరాల్సిందేనని కొత్తగా సుధీర్ బృందంలో చేరాడతను.

అలా రౌడీముఠాలో చేరితే పాఠాలు చదివి పరీక్షలు రాయాల్సిన అవసరం వుండదు. లెక్చరర్లను బెదిరిస్తే వాళ్ళే కాపీలు అందిస్తారు. పుస్తకాలు దగ్గర పెట్టు కొని రాసినా అడిగేవాడుండడు. అవసరం అయితే పోలీసుల సహకారం కూడా వుంటుంది.

అతను అలాంటి రౌడీ ముఠాలను చాలా సినిమాల్లో చూశాడు. వాళ్ళు కోరిన అమ్మా యిలను మానభంగం చేస్తుంటారు. అడ్డం వచ్చినవాళ్ళను నడివీధుల్లో పొడిచి చంపు తుంటారు. అందరూ వాళ్ళకు దణ్ణాలు పెడుతుంటారు. వాళ్ళ అడుగులకు మడు గులు ఒత్తుతూ వుంటారు. తొండ ముది రితే ఊరసవెల్లి అయినట్టే రౌడీలు ముదిరి రాజకీయ నాయకులవుతారు. ఎలక్షన్లలో నిలబడి ఓటర్లమీద బాంబులు వేస్తుం టారు. పోలింగు బూతులు ఆక్రమించి జనం ఓట్లు వాళ్ళే వేసుకుంటారు. రిగ్గిం గులు చేస్తారు. ఎన్నికలలో గెలుస్తారు. వాళ్లే మంత్రులు అవుతారు. అవకాశం చూసుకొని ముఖ్యమంత్రులను గద్దెదించి దొడ్డిదారిన ముఖ్యమంత్రులవుతారు.

గుంటపునుగులు అమ్మే గురవమ్మ కూతురు మనసుపడి చెయ్యిపట్టుకుంటే చెంపమీద కొడుతుందా! బ్రాందీషాపు బంగారయ్య బాటిల్ అప్పివ్వమంటే ఛీ... పొమ్మంటాడా! కాలేజిలో పాఠాలు చెప్ప కుండా ఎగనూకి ఇంటికాడ ట్యూషన్లు చెప్పే లెక్చరర్ కాలేజికి వెళ్ళకపోతే అటెండెన్సు వెయ్యడా! చివరికి ఆ సినిమాహాలు వెధవ సినిమాకు వెళితే టిక్కెట్టు కొనమంటాడా!

అందరూ భయపడుతూ చెప్పింది చెయ్యాలంటే రౌడీగా బతకాలి. అప్పుడు వాళ్ళ అమ్మాయిల చేతులు పట్టుకున్నా, మూతులు కొరికినా, మానభంగాలు చేసినా ఎవ్వరూ నోరు మెదపరు. భయపడతారు. బ్రాందీ షాపువాడు అప్పు ఇవ్వటం కాదు. అడిగినంత మందు ఫ్రీగా ఇస్తాడు. కాలేజికి వెళ్ళకపోయినా ఆ ట్యూషన్లవాడు హాజరు వేస్తాడు. సినిమాకు వెళితే టిక్కెట్టుకొనే అవసరమే వుండదు.




అన్నింటికన్నా అత్యవసరంగా గురవమ్మ కూతురుకి బుద్ధి చెప్పాలి. దాన్ని పువ్వును నలిపినట్టు నలిపి వెయ్యాలి. ఏరికోరి మరీ చెయ్యి పట్టుకుంటే చెంపమీద కొడుతుందా!

అలా అన్నీ ఆలోచించుకునే మన్మధరావు సుధీర్ బృందంలో చేరాడు. చురుకుగా పని చేస్తున్నాడు. చాకులా దూసుకెళ్తున్నాడు.

'డ్యాన్సర్లను చూడాలి గురువా' అని మన్మధరావు అనగానే ఆనందంగా నవ్వాడు సుధీర్. ఆప్యాయంగా అతని భుజంమీద చేత్తో చరిచి "అలాగే వెళ్దాం పదండి" అన్నాడు అనుచరుల నుద్దేశించి.

అందరూ కలిసి బయలుదేరారు. దిల్ ఖుష్ ఇంటిముందు ఆగారు. గొంతులు చించుకొని అరుస్తూ నినాదాలు చెయ్యటం ప్రారంభించారు.

"డాన్సుపార్టీలను నిషేధించాలి"

"సమాజాన్ని చెడగొట్టేది... డ్యాన్సు పార్టీలే"

"మర్యాదస్తుల కాపురాలు నిలవాలంటే డ్యాన్సులను నిషేధించాలి"

అలా అరుస్తూన్నవాళ్ళ అరుపులకు డ్యాన్సర్ల వీధి అంతా హోరెత్తిపోతోంది. ఏదో ప్రళయం ముంచుకొని రాబోతోన్నట్టు వీధిలోని వాళ్ళందరూ భయం భయంగా వాళ్ళవైపు చూస్తున్నారు.

వాళ్ళ అరుపులకు సైడు కాలవల పక్కన అరుగులమీద కునుకు తీస్తోన్న వీధి కుక్కలు ఉలిక్కిపడి లేచి మోరలు ఎత్తి ఆకాశంవేపుకు చూస్తూ ఏడుస్తున్నాయి.

డ్యాన్సర్ల వీధి అంతా గందరగోళంగా వుంది.

సుధీర్ తన అనుచరులతో కలిసి అలా ఉపద్రవం ఏదో తెచ్చిపెడతాడని ముందుగానే ఊహించింది దిల్ ఖుష్. ఆమె ఊహ నిజమే అయింది. పత్రికా ప్రకటనలకూ, మెమొరాండాలు సమర్పించటానికీ అతను పరిమితం కాకుండా కుర్రవాళ్ళను వెంట వేసుకొని వీధులకు కూడా ఎక్కాడు.

సుధీర్ అంత ఆర్భాటం ఎందుకు చేస్తున్నాడో తెలియనిది కాదు ఆమెకు! శివరాత్రి దగ్గరికి వస్తుంది. డ్యాన్సులకు సీజను మొదలు కాబోతోంది. అందుకే అదను చూసి దెబ్బ తియ్యాలన్నదే అతని సంకల్పం.

అతను తనను పొందలేక ఆ కోపంలో ఇలా డ్యాన్సులకు వ్యతిరేకంగా చేస్తున్న ఈ చెడు ప్రచారాన్ని జనం నమ్ముతారా? నమ్మినా, నమ్మకపోయినా వాళ్ళవల్ల ప్రమాదం లేదు కానీ సుధీర్‌ను ప్రోత్సహిస్తున్న పోలీసులవల్లనే ఏదైనా ప్రమాదం సంభవించవచ్చు.

తను సుధీర్‌కూ, వాళ్ళకూ లొంగిపోయి సంతృప్తిపరిస్తే అంతా సజావుగానే సాగిపోతుంది. రికార్డు డ్యాన్సుల్లో అశ్లీలం వుండనట్టు! లొంగిపోకపోతే ఇకపై అన్నీ సమస్యలే. రికార్డు డ్యాన్సుల్లో అశ్లీలం వున్నట్టు!

ఏం చెయ్యాలి?

జీవితంలో సుఖమో, దుఃఖమో ఏదో ఒకటి కోరుకోవలసిన పరిస్థితి అది. పతనమై సుఖంగా జీవించటమో, పవిత్రంగా వుండి కష్టాలను ఆశ్రయించటమో తేల్చుకోవలసిన పరీక్షా సమయం ఇది.

ఆలోచించింది దిల్ ఖుష్! అంతగా సుధీర్‌వల్ల తనకు కష్టాలు ఎదురైతే అందుకు అతనిమీద ప్రతీకారం తీర్చుకోకుండా వదలదు. అంతేకానీ బొందిలో ప్రాణం వుండగా అతనికి లొంగే ప్రసక్తేలేదు అనుకొంది దిల్ ఖుష్ మనసులోనే.

బయటనుంచి సుధీర్ బృందం చేస్తున్న నినాదాల హోరు ఇంట్లోకి వినిపించకుండా లేచి వెళ్ళి తలుపులూ, కిటికీలూ మూసింది. రేడియో వాల్యూమ్ పూర్తిగా పెంచి పాటలు వింటూ పడుకుంది.

"ఏమ్మా...! ఎవరు వాళ్ళంతా? ఎందుకలా ఇంటిముందు అల్లరి చేస్తున్నారు?" దిల్ ఖుష్ పడుకున్న మంచం దగ్గరికి వెళ్ళి కూతురును అడిగింది అమ్మ.

"వాళ్ళంతేలేగానీ నువ్వు వెళ్ళి పడుకో" అంది దిల్‌ఖుష్.

"అలా గొడవ చేస్తుంటే పడుకో మంటావేమిటి? సమయానికి మగవాళ్లు కూడా ఇంట్లో లేరు. సత్తారుగాడు సారాకొట్టుకు పోయాడు. ఆదంవలి అడ్వాన్సు తెచ్చుకుంటానని రవి ఇంటికి వెళ్ళాడు. ఏంచేద్దాం ఇప్పుడు?"

దిల్‌ఖుష్ విసురుగా మంచంమీంచి లేచింది. "నిన్ను వెళ్లి పడుకోమన్నానుకదా!" అంటూ కోపంగా తల్లి వైపుకు చూసింది.

ఆమె తనలోతనే ఏదో గొణుక్కుంటూ వెళ్ళిపోయింది. వెలుగుతూన్న దీపాలను ఆర్పివేసి మళ్ళీ మంచంమీద వాలిపోయింది దిల్‌ఖుష్.

సుధీర్, అతని అనుచరులూ దిల్‌ఖుష్ అలా తలుపులూ, కిటికీలూ వేసినప్పుడే నిరుత్సాహపడ్డారు. ఆమె బైటికి వచ్చి తమతో మాట్లాడుతుందని అనుకున్నారు వాళ్లంతా. కానీ అంచనాలు తలక్రిందుల య్యాయి. ఇప్పుడు లైట్లు కూడా ఆర్పివెయ్యటంతో ఇంకా అక్కడే నినాదాలు ఇస్తూ నిలబడటం అనవసరం అనుకొన్నారు.

"ఇప్పుడు మనం ఏం చేద్దాం?" సుధీర్‌ను అడిగాడు మన్మథరావు.

అందరూ నినాదాలు ఆపి బాస్ ఏమి చెబుతాడా అని అతనివైపు చూశారు.

"మనం ఇలాగే నినాదాలు ఇచ్చుకొంటూ కాంట్రాక్టరు రవి ఇంటి దగ్గరికి కూడా వెళ్దాం. దిల్‌ఖుష్ ఇంటి దగ్గర మాత్రమే ప్రదర్శన చేసి ఆపితే మనం కావాలని ఇలా చేస్తున్నట్టు తెలిసిపోతుంది. రవి ఇంటికి కూడా వెళ్లామంటే అలాంటి అనుమానం ఎవ్వరికీ రాదు. పైగా డ్యాన్సు పార్టీ కాంట్రాక్టరు ఇంటిముందు కూడా మనం ప్రదర్శన జరిపినట్టు పత్రికలలో వేయించుకోవచ్చు" అని చెప్పాడు సుధీర్.

బాస్ చెప్పిందానికి ఆనందంగా తలలు వూపారు వాళ్లు. నినాదాలు చేసుకొంటూ గుంపుగా అక్కడ్నించి కదిలి రవి ఇంటిదారి పట్టారు.

రోజాతో మాట్లాడి ఇంటికి వెళ్లిన రవి స్నానం చేసి అన్నం తిని విశ్రాంతిగా కూర్చున్నాడు వరండాలో. అంతలోకే ఆదంవలి వచ్చాడు. ఇద్దరూ పిచ్చాపాటిగా మాట్లాడుతూ కూర్చున్న కొంచెంసేపటికి నాలుగు డ్రాముల సారా కడుపుకు పట్టించి సత్తారు కూడా అక్కడికి వచ్చాడు. ముగ్గురూ మాటల్లో పడ్డారు. వాళ్లు ఆసక్తిగా మాట్లాడుకొంటుంటే అప్పుడు వినిపించాయి దూరంనుంచి సంఘసంస్కర్తల నినాదాలు.

"వాళ్లు ఇక్కడికే వస్తున్నట్టున్నారు" అన్నాడు ఆదంవలి.

సత్తారుకు చిర్రెత్తుకొచ్చింది. అసలే నిషాలో వున్నాడు. దానికి తోడు దయ్యాలు వేదాలు వల్లిస్తున్నాయి. రెచ్చిపోయాడతను. "రానియ్యి చూద్దాం! ఇవ్వాళ తాడోపేడో తేల్చుకుందాం" అన్నాడు కోపంగా.

రవికి ఏం చెయ్యాలో తోచలేదు. తాగిన మైకంలో సత్తారు అనవసరంగా వాళ్లతో గొడవ పెట్టుకుంటాడని భయపడ్డాడు. లౌక్యంగా వాళ్లను వదిలించుకోవాలిగానీ ఘర్షణ పడితే ఒరిగేది ఏమీలేదు.

అందుకే అతను సత్తారును వారిస్తూ "నువ్వు అనవసరంగా కల్పించుకోవద్దు. ఇది మామూలు విషయమేం కాదు. వాళ్లు పథకం ప్రకారం చేస్తున్న కుట్ర ఇది. పోలీసులు కూడా వాళ్ల పక్షానే వున్నారు. రాద్ధాంతం చేసుకోకుండా సమస్యను జాగ్రత్తగా పరిష్కారం చేసుకోవాలి. ఘర్షణకు దిగితే మనకే నష్టం" అన్నాడు.

సత్తారుకు రోషం వచ్చింది. చివాలున లేచి నిలబడ్డాడు. కళ్లు ఇంతలేసి చేసుకొని రవి వైపు చూస్తూ "మీరు వూరుకోండి సార్! ఇట్లాంటివాళ్లు భయపడేవాళ్లను మరింత భయపెడతారు. వీళ్ల రౌడీతనం తెలియందికాదు నాకు. నాలుగు సారా




చుక్కలు మింగి రంకెలు వెయ్యటం, నలుగురు కలిసి ఒంటరివాళ్లను చావగొట్టటం. అంతేగానీ ఈ రౌడీ వెధవలకి గుండె వుండదసలు. రక్తం చూస్తే పారిపోతారు" అని "అరేయ్ ఆదంవలీ! వెళ్దాంపద. వాళ్ల సంగతి తేల్చుకుందాం" అంటూ నాలుగు అడుగులు వేశాడు.

ఆదంవలి కూడా లేచి సత్తారు వెంట వెళ్లాడు. ఇద్దరూ బైటికి వెళ్లి వీధి వాకిలి ముందు నిల్చున్నారు.

సుధీర్ బృందం రవి ఇంటి ముందుకు వచ్చి ఆగింది.

"ఎందుకట్టా అరుస్తున్నారు? జనం నిద్ర పోయే సమయంలో వచ్చి ఇట్లా అరిస్తే బాగుండదు. మీరు చెయ్యదలచుకొన్నది మీరు చెయ్యండిగానీ ఇళ్ల దగ్గరికి వచ్చి అల్లరి చేస్తే మర్యాదగా వుండదు. చెప్పాల్సింది చెప్పాను. ఇంక మీ ఇష్టం" అన్నాడు సత్తారు సుధీర్ దగ్గరికి వెళ్లి.

మన్మధరావు మరికొంత మంది సత్తారుకు ఎదురు తిరగబోయారు బాస్ మెప్పు కోసం.

సుధీర్ వాళ్లను వారించాడు! తను అంతా చేస్తున్నది దిల్ ఖుష్ కోసం మాత్రమే. ఘర్షణదాకా వెళితే తెగేదాకా లాగినట్టవుతుంది. ఆమె మీద ఇక పూర్తిగా ఆశలు వదులుకోవాల్సి వస్తుంది. అందుకే మన్మధరావు చెయ్యి పట్టుకొని లాగుతూ "మనం శాంతి కాముకులం. శాంతియుతంగా పోరాటం సాగిస్తాంగానీ దౌర్జన్యాల జోలికి వెళ్లం. అదీకాక పిల్లలు కూడా నిద్ర పోయేవేళ ఇది. మనవల్ల ఎవ్వరికీ ఇబ్బంది కలక్కూడదు. దయచేసి శాంతియుతంగా వెళ్లిపోదాం పదండి" అని చెప్పాడు పెద్దగా.

బృందం అక్కడినుంచి వెనుతిరిగి ముందుకు కదిలింది. అందరూ గాంధీగారి విగ్రహం దగ్గరున్న బ్రాందీ షాపుకు వెళ్లారు.

"మీరు త్వరగా తలా ఒక క్వార్టరు విస్కీ తాగి వాల్ రైటింగుకు వెళ్లండి. తెల్లవారేసరికల్లా ఊరి గోడలనిండా ద్యాన్సులను నిషేధించాలి అని రాయాలి" చెప్పాడు సుధీర్.

ఒక గంటలోనే వాళ్లు తాగటం ముగించారు. సుధీర్ బిల్లు చెల్లించాడు. అందరూ బార్లోంచి బైటికి వెళ్లి గాంధీ విగ్రహం దగ్గర నిల్చున్నారు. సిగరెట్లు, కిళ్లీలూ తెప్పించుకున్నారు.

"వాల్ రైటింగుకు మాతోపాటు నువ్వూ వస్తున్నావా అన్నా?" సుధీర్‌ను అడిగాడు మన్మధరావు.

"నాకు వేరే పని వుంది. మున్సిపల్ గెస్టు హవుసులో నాకోసం ఎదురు చూస్తుంటారు పోలీసులు. హెడ్డూ, రైటరు కూడా వస్తామన్నారు. నేను అర్జంటుగా వాళ్లను కలవాలి" చెప్పాడు సుధీర్.

"అన్నా! ఇవ్వాళ మనం నిరసన ప్రదర్శన చేసినట్టు వాళ్లకు చెప్పి ప్రొద్దున్నే స్టేషన్ నుండి ప్రెస్ నోట్ పంపించే ఏర్పాటు చెయ్యి. పత్రికలలో వార్త బాగా రావాలి"

"అందుకే వెళ్తున్నాను" అన్నాడు సుధీర్.

రంగులు కలిపిన బకెట్లూ, బ్రష్షులూ తీసుకొని మిత్రబృందం అక్కడినుంచి వెళ్లి పోగానే సుధీర్ గెస్టు హవుసుకు బయలుదేరాడు.

మిత్రబృందంతో అతను చెప్పలేదుగానీ ఆసక్తికరమైన విషయం మరొకటి వుంది. గూనోడు శిక్షాకాలం పూర్తిచేసి రాజమండ్రి సెంట్రల్ జైల్నుంచి విడుదలై వచ్చాడు. అతను డి.ఎస్.పి దొరగారిమీద కారాలూ, మిరియాలూ నూరుతున్నాడుట తనను అనవసరంగా జైలుకు పంపించాడని.

గూనోడికి గెస్టు హవుసులో మంచి పార్టీ ఇచ్చి అతని కోపం పోగొట్టాలని చెప్పాడు కానిస్టేబులు వీరాస్వామి ఆ రోజు ఉదయమే. చీకటిపడే వేళకల్లా గూనోడ్ని వెంట పెట్టుకొని గెస్టు హవుసుకు చేరుకుంటామని హెడ్డూ రైటరు కూడా వస్తారనీ చెప్పాడు.

గూనోడ్ని పరిచయం చేసుకోవాలని సుధీ

ర్‌కు చాలా ఉబలాటంగా కూడా వుంది. అలాంటి వాడొకడు పరిచయమైవుంటే మంచిదని అనుకున్నాడు. అతడిద్వారా నేరేడు పొగరు అణచబోతున్నాననీ, అందుకు ఒక పథకం కూడా సిద్ధం చేశాననీ చెప్పాడు కానిస్టేబులు వీరాస్వామి.

సుధీర్ మోటారు బైక్‌మీద పది నిము షాలలో మున్సిపల్ గెస్టు హవుసుకు చేరు కున్నాడు. పార్కింగ్ ప్లేస్‌లో బైక్ స్టాండు వేసి లోపలికి వెళ్లాడు.

గది బయట పచార్లు చేస్తున్న కానిస్టే బులు వీరాస్వామి ముఖం సుధీర్‌ను చూడ గానే సంతోషంతో విప్పారింది.

"ఇంత ఆలస్యం చేశావేం?" అడిగాడు సుధీర్‌ను.

"అక్కడ నిరసన ప్రదర్శన జరిపాం. దిల్ ఖుష్ ఇంటిదగ్గరా, రవి ఇంటి దగ్గరా నినా దాలు చేశాం. అక్కడ్నించి బారుకు వెళ్లి మన వాళ్లకు కొంచెం తాగించి వాల్ రైటిం గుకు పంపేసరికి ఈ వేళ అయింది"

సుధీర్, వీరాస్వామి గదిలోకి వెళ్లారు. అక్కడ రైటరు, హెడ్డు గూనోడ్ని మధ్యలో కూర్చోపెట్టుకొని బతిమాలుతున్నారు. టీపా య్‌మీద ఖాళీగా వున్న గ్లాసులను చూసి "మందు తెప్పించుకోలేదా?" అని అడిగాడు సుధీర్, వాళ్లవైపు చూస్తూ.

"నీకోసమే ఎదురు చూస్తున్నాం" అని హెడ్డు సుధీర్‌కు గూనోడ్ని పరిచయం చేశాడు. "గూనోడంటే వీడే. సామాన్యుడు కాదు. వీడ్ని గురించి చెప్పాలంటే చాలా వుంది" అని అదోలా నవ్వాడు.

సుధీర్ చెయ్యి ముందుకు చాపి గూనో డితో కరచాలనం చేశాడు. "మన వీరా స్వామి అంతా ముందుగానే చెప్పాడు. పరి చయం లేదుగానీ మిమ్మల్ని కలవటం నాకు చాలా సంతోషంగా వుంది" అన్నాడు నవ్వుతూ.

గూనోడు కూడా పల్చగా నవ్వాడు.

అప్పుడు చెప్పాడు హెడ్డు, "ఏదో అర్థం లేని కోపంలో మన డి.ఎస్.పి దొరగారు అనవసరంగా కేసులో ఇరికించి గూనోడ్ని జైలుకు పంపించారు. వీడు అదే మనసులో పెట్టుకొని అలిగి కూర్చున్నాడు"

"మరి అలా చేస్తే కోపం రాదా ఎవరి కైనా!" అని సుధీర్ సాభిప్రాయంగా చూశాడు గూనోడివైపు.

"జరిగిందేదో జరిగింది. ఆ తరువాత దొరగారు కూడా చాలా బాధపడ్డారు ఎందుకు చేశానా ఇలా? అని. ఆ మాట నాతో కూడా చాలాసార్లు అన్నారు. పెద్దా యన ఆయనే చేసిన తప్పుకు బాధపడు తుంటే వీడింకా అదే పట్టుకొని కూర్చోటం ఏం బాగుంటుంది? అదే వీడికి నచ్చచె ప్తున్నాం. అయినా వినటంలేదు" అన్నాడు రైటరు.

"ఇలాంటి విషయాలు మంచినీళ్ళు తాగుతూ మాట్లాడుకుంటే పరిష్కారం కావు" అని నవ్వి "అటెండర్ని పంపించి మందు తెప్పిస్తాను. తాగుతూ మాట్లాడు కుందాం" అంటూ కుర్చీలోంచి లేచాడు సుధీర్.

గూనోడు అమాంతం సుధీర్ చెయ్యి పట్టుకొని ఆపాడు.

"సుధీరుగోరూ! నానస్సులికే మాట పట్టిం పుగల మడిసిని. నన్నీడకి బిలిపిచ్చి మందు తాగిచ్చినా, మాంసం తినిపిచ్చినా ఆ యవ్వారం అదేగానీ దొరగోరి ఇసయంలో మాత్తరం రాజీలేదు. మనసు ఇరిగిపోనాక నాకేంటిది ఆయన్తో రాజీ? అందుశాత రాజీకోసరం అయితే మీ మందుకూ, మీకొక దణ్ణం. నానెల్లిపోతాను. రాజీ యవ్వారం గాకుండా తెప్పిచ్చినారంటే ఎంత మందైనా తాగెల్తాను. అది ఆలోచిచ్చుకొని అప్పుడు తెప్పియ్యండి మందు. అంతేగానీ మందు దాగి గూనోడు మాటినకుండా బోయిండన్న మాట మాత్తరం నన్ననొద్దు" అన్నాడు మిడి గుడ్లతో చూస్తూ.





సుధీర్‌కు ఏమనాలో కొంచెంసేపు తోచ లేదు. "మీకు చెప్పేంత వాడినికాదుగానీ ఏమీ అనుకోకపోతే ఒక్కమాట" అన్నాడు నెమ్మదిగా.

"ఏంటిదది?"

"మీమీద దొరగారికిగానీ దొరగారిమీద మీకుగానీ కోపం రావటం అంటే అది కుటుంబ కలహం లాంటిదే. సర్దుకొనిపోవా లిగానీ సాగదియ్యకూడదు. ఇలాంటికోపతా పాలు ఇవ్వాళుంటాయి. రేపటికి మర్చేపో తారు. అందువల్ల ఇక ఆ విషయం మాట్లా దొద్దు. మనం సరదాగా మందు తాగుదాం. ఏమంటారు?" అని నవ్వి "ఇంతకూ ఏ బ్రాండు తెప్పించమంటారు?" అడిగాడు సుధీర్.

"మనం రోజూ తాగేదే" అన్నాడు హెడ్డు బెల్టు లూజు చేసుకొని తాపీగా కూర్చుంటూ.

"మనవరకే అయితే అదే బ్రాండు తెప్పిం చేవాడ్ని. కానీ ఇవ్వాళ మనం గెస్టుతో కలిసి తాగబోతున్నాం. బ్రాండు ఏం కావాలో ఆయన చెప్పటమే బాగుంటుంది" అని గూనోడివైపు ప్రశ్నార్థకంగా చూశాడు సుధీర్.

"ఏం కావాలిరా గూనోడా?" అడిగాడు హెడ్డు.

"నాకేటీ వొద్దు"

"ఎందుకనీ? ఇంకా కోపం పోలేదా?"

"మీతో సావాసం ఈ జన్మకిక సాలు. నమ్మిచ్చి ఒక పాలి జేలుకు అంపించారు. ఈ జల్మకేగాదు, జల్మజల్మాలగ్గూడా మీ సావాసం వద్దు"

హెడ్డు, రైటరూ వీరాస్వామి వైపు చూశారు ఏం చేద్దాం? అన్నట్టు.

వీరాస్వామి లేచి గూనోడి దగ్గరికి వెళ్లాడు. అతని చేతులను తన చేతుల్లోకి తీసుకొని "నువ్వలా అంటేకాదు. మాతో కలసి తాగాల్సిందే. నీకు దొరగారు అన్యాయం చేసింది నిజమే. కాదనం. ఇక ముందు అలా ఎప్పుడూ జరగదని దొరగారి తరపున మేం హామీ ఇస్తున్నాం. ముందు ముందు ఇంకా మనం చెయ్యాల్సిన కార్యక్ర మాలు చాలా వున్నాయి. అయినా నీ కోపం దొరగారిమీద కానీ మా మీద కాదు కదా! నా మాట విని ఏం మందు కావాలో చెప్పు" అని అడిగాడు బతిమాలుతూ.

గూనోడికి కడుపులోంచి ఉక్రోషం బైటికి పొంగింది. కళ్లు ఇంతలేసి చేసుకొంటూ "ఈ గూనోడి శరిత్ర తెలిసే అట్టా అన్నే లంగా నన్ను జేలుకు అంపిచ్చారంటే ఎంత గోరం! ఇంకా ఈ గూనోడంటే ఏంటిదో తెల్సుకోవాల్నంటే ఇశాగపట్టణంబోండి. ఆడ పోలీసు టేశన్లో అడిగినా గూనోడు దేవుడ సుమంటోడంటారు. సింహ్వాశలం గుళ్లో పచ్చల పతకం ఎవుడో నూకిండుగానీ గూనోడు నూకితే బాగుండేదంటారు. దేవుడి దిబ్బెన్లో దొరికిన సిల్లర డబ్బులు ఆడుంచీసుకొని పతకాన్ని దెచ్చి టేశన్లో ఇచ్చే వోడంటారు.

"ఆడ్నించి రాయలచీమ ఎల్లండి. యాడ్న యినా అడగండి. గూనోడు దర్మరాజం టారు. ఒంటి మాంసంగూడా కోసిచ్చే శిబి శక్రవర్తంటారు. తెలంగానా ఎల్లండి, యాడ్నయినా అడగండి. గూనోడు కర్ణుడం టారు. నా దాన గుణం అసుమంటిదిమరి!

"ప్రెభుత్వం కరెంటు కోతెట్టి దీపాలు ఆర్పితే సీకట్లో ఏ ఇల్లెవుర్దో తెలవక డి.ఎస్పీ దొరగారింట్లో దూర్నాను. దొర్సాని నక్లేసు నూకినాను. అది నా తప్పా. సరే అప్పటికీ జరిగింది తెలవంగానే పోలీసోళ్లకాడ దొంగ తనం చెయ్యకూడదన్న దర్మానికి ఎరిసి నక్లేసు తిరిగిత్తానన్నాను. సంతోశిచ్చాల్సింది బోయి అన్నేలంగా నా మీన కేసెట్టి రాజ మంత్రి జేలుకు అంపిత్తారా?

"మనం ఎత్తింది మడిసి జల్మ. మడిసి జల్మెత్తినాక కూస్తింతయినా ఇస్వాసం వుండాలె. అది మరసిపోయి ఈ గూనోడ్నే జేలుకు అంపిచ్చారంటే! సూద్దాం దాని

యవ్వారం. ఎవుడ్నీ ఇడిసిపెట్టను. దొరోరు రిటైరయ్యే టయాం దగ్గర్లోకొచ్చిందంట. జేల్నించి రాంగానే అదే ఇశారిచ్చాను. అప్పుడు గవోర్నమెంటిచ్చే డబ్బులు యాడ బెడతాడో అదీ సూద్దాం. నెలనెలా పింఛను డబ్బులు ఇంటికెట్టా ఎత్తుకెల్తాడో గూడా సూద్దాం. ఇది శాలెంజి!

"అర్రెర్రెర్రే... భూప్రెపెంచకంలో యాడా సూళ్లేదు నాను ఇసుమంటోళ్లని. నానే నయ్యం ఈళ్లకన్నా! హవుసు బ్రేకింగుల్జేసినా, సెయిను స్నాచింగుల్జేసినా నాకుండే ధర్మంలో నూరోవంతు లేదీళ్లకి. అసుమంటప్పుడు దొరగోర్ని నానెందుకు జాలి తలవాలి?" అని గూనోడు కాండ్రించి గోడమీద ఉమ్మేశాడు. తనలో తనే ఇంకా ఏదో గొణుక్కుంటూ కూర్చున్నాడు.

ఎవ్వరూ గూనోడ్ని కదిలించలేదు. మాట రూపంలో కోపం అంతా బైటికి వెళ్లగక్కితే నెమ్మదిగా అతనే దారికి వస్తాడని ఆగారు.

కొంచెంసేపటికి అనుకొన్నట్టే శాంతిం చాడు గూనోడు. నెమ్మదిగా తల ఎత్తి "సర్లే! దొరగోరి యవ్వారం ఏంటిదో నానే సూస్తాగానీ ఆయన కోసరం మనం బాధెం దుకు పడాలి? మీ యవ్వారం ఏంటిదో సెప్పండి. నాతోన మీకు ఏం సహాయం కావాలి?" అని అడిగాడు.

"నువ్వూ మాతో కలసి మందు తాగితేనే చెప్తాం" అన్నాడు కానిస్టేబులు వీరాస్వామి.

"సరే తెప్పియ్యండి"

"ఏ బ్రాండు కావాలి?"

"ఇండియా ఇస్కీ తాగితే ఒకటే ఇకారం గుంటంది. గొంతులోకి సుక్క దిగటంలేదు. ఇదేశాల ఇస్కీ ఏట్టైనా తెప్పియ్యండి"

అందరూ గూనోడివైపు తెల్లబోయి చూశారు.

"ఫారిన్ విస్కీ కావాలంటే వెంటనే దొర కటం కష్టం. దానికి చాలా తిప్పలు పడాలి. అయినా ఇదివరకు తాగింది ఇండియన్ మేడ్ చీప్ లిక్కరుకదా" అడిగాడు హెడ్డు.

"నాటు సారాగూడా తాగినాను. అది అప్పటి ఇసయం. ఇప్పుడు ఇదేశపు ఇస్కీ తప్ప తాగను. ఇదిప్పటి యిసయం"

"ఎందుకనీ?"

"అలవోటయినాది"

"ఫారిన్ విస్కీ అలవాటైందా? ఎక్కడా?"

"సెంటరల్ జెయిల్లో?" చెప్పాడు గూనోడు.

అందరూ ఆశ్చర్యంగా అతనివైపు చూశారు.

వాళ్లు ఎందుకు అలా తనవైపు చూస్తు న్నారో గ్రహించాడు గూనోడు. వాళ్ల అజ్ఞా నానికి తనలో తను నవ్వుకొని,

"ఏంటిదట్టాగ ఇసిత్తరంగా సూత్తారు. నేజెప్పింది నిజ్జం. దేవుడి సాచ్చిగా నాకు యిదేశాల యిస్కీ అలవోటైనాది జేల్లోనే. ఎట్టాగ జరిగినాదంటే నానుండే జేల్లోనే యిదేశాలకి గంజాయి అమ్మేవోడొకడు తగి లిండు. జేల్లో వాడి వైభోగం సెప్పనలివి గాదు. ఆడి పాలికది జేలుగాదు, నచ్చత్రాల ఓటేలే అనుకో! ఆడ్ది కోట్ల యాపారవంట. ప్రెతోడికీ లచ్చల్లో మావూళ్లిచ్చేవోడంట. మరాడి కరమే గాలిందో, ఈడి కరమే గాలిందోగానీ ఎవుడో పోలీసాపీసరు పందే నికి ఈడ్ని బట్టుకోని జేలుకంపిండుగానీ జల్మలో ఎప్పుడూ జేలే ఎరగడంట.

ఒక దినం యామైందో సెప్పనా? మా వార్డరుగోరికి తేలు గుట్టింది. బాదతోన మెలికలు దిరిగిపోతా బొడ్లోంచి యిదేశీ యిస్కీ సీసా దీసి నాకిచ్చిండు గంజాయి యాపారం చేసేవోడి కియ్యమని.

ఆడూ నేనూ అట్టా కల్సినాం జేల్లో. మాటల్లో బడినాం. అప్పుడాడు ఆడి గోసంతా ఇనిపిచ్చిండు. ఆడ్ని జేలు కంపి చ్చిన పోలీసాయన్ని సంపేదాకా నిదరబోన న్నాడు"

"నువ్వేమన్నావూ?" కొంచెం ఆతృతగానే అడిగాడు హెడ్డు.

"పోలీసోళ్లల్లో గూడా అసుమంటి శబ్బరో




ళ్లుంటారనీ, ప్రెపెంచకం అన్నాక మంచి, శబ్బర రొండూ వుంటయ్యనీ సెప్పి పోలీసా యన్ని సంపొద్దన్నాను"

"యావన్నాడూ? "

"సంపాల్సిందే అన్నాడు. సంపటం మడి సికి శిచ్చేగాదనీ ఛణంలో పేనంబోతే అది శిచ్చ ఎట్టాగవుతాదనీ అడిగినాను. ఆడూ ఆలోశన్లో బడినాడు. నువ్వన్నదీ కరెట్టేగానీ మరేటి సెయ్యామంటావ్ అని అడిగిండు"

"ఏం చెప్పావ్? "

"కాలో సెయ్యో నరకవని సెప్పినాను" చెప్పాడు గూనోడు.

హెడ్డుగాని, రైటరుగానీ ఇంకేమీ మాట్లా డలేదు.

"ఆ సంతోసంలో గంజాయోడు నాగ్గూడా గళాసులో బోసి ఇదేశీ ఇస్కీ ఇచ్చిండు. తాగినాను. సల్లంగా కడుపులోకి దిగినాంక ఎచ్చంగా కిక్కిచ్చినాది. బువ్వ దిని తొంగుంటే వార్డరొచ్చి రాలుగొట్టే యాళ యిందని లాటీతో గొట్టేదాకా మెలుకువే లేదు. అట్లా తొలిపాలి ఇదేశీ ఇస్కీ దాగి నాక ఇండియా ఇస్కీకంటే ఇసం నయవని పిచ్చింది. ఆ ఛణంనుంచే వొదిలేసినాను" చెప్పాడు గూనోడు.

"వాడు పోశాడని ఒక్కసారి తాగంగానే అదే అలవాటైందా? " అని కొంచెం ఎకసె క్కెంగానే అడిగాడు రైటరు.

"ఒకపాలి తాగటం ఏం కరమం నాకు. జేల్లో రోజూ అదే తాగేవోడ్ని. పోలీసాయన కాలు ఎట్టాగ నరకాలో జెప్పి రొండోపాలి, సెయ్యి యిసయం జెప్పి మూడోపాలి! నాలుగో పాల్నించి ఇంక వాడే నన్ను పిల వబట్టిండు. ఆడికొచ్చిన యిజ్జ ఆడు నాకు సెప్పటం, నేనాడికి అవుసు బ్రేకింగులు, సెయిను స్నాచింగులూ ఎట్టా సెయ్యాలో సెప్పటం అట్టాగా కుదిర్నాది దోస్తీ మాకు"

సుధీర్‌కు ఫారిన్ విస్కీ తెప్పించటం తప్పదని అర్థమైంది. తమకు మామూలు సరుకు తెప్పించి గూనోడికి ఫారిన్ విస్కీ తెప్పిద్దామా అంటే పోలీసులతో వ్యవ హారం. పైగా వాళ్లతో తనకు చాలా పని వుంది. దిల్‌ఖుష్ తనకు లొంగిపోవాలంటే వాళ్ల సహకారం కావాలి తనకు.

అందుకే ఒక్క క్షణం ఆలోచించి చివరికి అందరికీ ఫారిన్ విస్కీ తెప్పించాలని నిర్ణ యించుకొని లేచాడు. తను రోజూ తాగే బార్లో రహస్యంగా ఇంపోర్టెడ్ విస్కీ అమ్ము తారన్న విషయం అతనికి తెలుసు.

ఫోన్ దగ్గరికి వెళ్లి బారు ఓనరుకు ఫోన్ చేసి మున్సిపల్ గెస్టు హవుసు అంటెం డర్ని పంపిస్తున్నాననీ, అతనికి ఇచ్చి రెండు ఫారిన్ స్కాచ్ సీసాలు పంపించమని చెప్పాడు. అలాగే అటెండర్ని పిలిచి అతడ్ని బారుకు పంపించి వచ్చి కూర్చున్నాడు.

"ఓకేనా? " అడిగాడు హెడ్డు సుధీర్‌ను.

"పంపించాను. అటెండరు బారుకు వెళ్లాడు" చెప్పాడు.

"ఫారిన్ విస్కీనే చెప్పావా? "

"అవును" అన్నాడు సుధీర్.

గూనోడితోపాటు అందరి ముఖాలలో సంతోషం కనిపించింది.

కానిస్టేబులు వీరాస్వామి గూనోడ్ని చేత్తో తట్టి పిలిచాడు.

"ఏంటిది? " అడిగాడు గూనోడు.

"ఇక మనం అసలు విషయంలోకి వద్దాం! మన సుధీర్ దిల్‌ఖుష్ అనే డాన్స రుమీద మనసుపడ్డాడు. ఆమె ఒప్పుకోలేదు. అదంతా చాలా గందరగోళం వ్యవహారం. విషయం డిఎస్పీ దొరగారిదాకా వెళ్లింది. ఆ విషయం మేం చూసుకొంటాంగానీ నేరేడు విషయంలో నీ సహాయం కావాలి మాకు" అన్నాడు కానిస్టేబులు వీరాస్వామి.

"నేరేడంటే ఎవురూ? " అడిగాడు.

"సినిమా హాలు దగ్గర సోడాలు అమ్మే పిల్ల!"

"దాంతో మీకేంటిది పేచీ? "

"అదొక పొగరుమోతు ముండ. చివరికి పోలీసులను కూడా లెక్క చెయ్యదు. మన

హెడ్డుగార్ని కూడా ఒకసారి అవమానించింది"

"కదిలిత్తేనా? "

"అవును, ఏదో మోజుపడి కదిలిస్తే కయ్యానికి దిగింది"

"సోడాలు అమ్మేటి ఆడది అంత పని చేసిందా? "

"హెడ్డుగార్నేకాదు, ఈమధ్య నన్నూ అలాగే చేసింది"

"నువ్వూ కదిలిచ్చావా? "

"ఏదో మోజుపడి కదిలిస్తే కాదు పొమ్మంది"

"దానికాడికి మఫ్టీలో బోయినావా? డ్రస్సులోనా? "

"డ్రస్సులోనే"

"భయపడినాదేవో? "

"దానికస్సలు భయంలేదు. వున్నదంతా పొగరే!"

"నన్నేటి సెయ్యమంటావూ? "

"దాని సోడామిషను నువ్వు కాజెయ్యాలి"

"సేసినానే అనుకో ప్రేమిచ్చుద్దా నిన్ను? "

"ప్రేమాకాదు, దోమాకాదు. దాన్ని వాడి వొదిలెయ్యాలంతే. అది బతికేది సోడా వ్యాపారంమీద. అది బతుకుతూ వాళ్ల అమ్మనూ బతికిస్తున్నది. వ్యాపారం ఆగిపోతే అన్నానికి గడవదు. అన్నానికి గడవకపోతే ఒళ్లమ్ముకోవటం తప్ప దానికింకొక దారిలేదు. మన బోణీతో ఆ వ్యాపారం పెట్టిందంటే ఇక దాని వ్యవహారం మూడు పువ్వులూ ఆరు కాయలే అవుతుంది. అట్టా అదీ బాగుపడుతుంది. మన పంతమూ నెగ్గుతుంది" చెప్పాడు వీరాస్వామి.

గూనోడు వెంటనే సమాధానం చెప్పలేదు. ఆలోచిస్తూ కూర్చున్నాడు.

"మాట్లాడవేం? " అని అతని వైపు చూశాడు వీరాస్వామి. అందరూ గూనోడినే చూస్తున్నారు.

"ఇసుమంటి ఇసయాలు మందు కడుపులో పడినాక మాత్తరవే మాట్టాడాల. నా నిర్ణాయకం ఏంటిదో అప్పుడు సెప్తాను" అన్నాడు గూనోడు నిదానంగా.

అందరూ మౌనంగా కూర్చున్నారు.

కొంచెంసేపటికి అటెండెరు వచ్చాడు. ఫారిన్ విస్కీ బాటిల్సూ, ఇతర సామాగ్రి టీపాయ్‌మీద పెట్టి అందరికీ గ్లాసుల్లో మందుపోసి వెళ్లాడు.

తాగుతూ కూర్చున్నారు.

"నీకు వీలుంటే ఈ రాత్రికే నేరేడు సోడా మిషన్ను నువ్వు దొంగిలించాలి. అది రేపటినుంచే వీధిన పడాలి" అన్నాడు హెడ్డు.

"నా నిర్ణాయకం సెప్పాల్నంటే ఇంకా తాగాలి" అని గూనోడు గ్లాసులోవున్న మందంతా తాగి మళ్లీ తనే గ్లాసునిండా మందు వొంపుకున్నాడు.

"సోడా కలపటం మర్చేపోయారు" చెప్పాడు సుధీర్.

"మర్చిపోటంగాదు. యిసుమంటి యిసయాల్లో నాను నిర్ణాయకం జేసేప్పుడు మందులో సోడాగానీ నీలుగానీ కలపను. పచ్చిమందే తాగుతాను" అని ఆ గ్లాసు కూడా ఖాళీ చేసి తిరిగి గ్లాసు నింపుకొన్నాడు గూనోడు.

అతని కదలికలనే గమనిస్తూన్న రైటరుకు గూనోడు ముగ్గులోకి వచ్చి పెదవి విప్పటానికి ఇంకా కొంత సమయం పడుతుందని అర్థమైంది. కొంచెంసేపు అతడ్ని మాట్లాడించకుండా వుంటే మందు కిక్కు ఎక్కువ కాగానే అతనే మాట్లాడతాడని అనుకున్నాడు. ఆలోగా ఉబుసుపోక సుధీర్‌తో మాట్లాట్టం మొదలుపెట్టాడు.

"ఈరోజు డ్యాన్సుర్ల వీధికి వెళ్లారుకదా ఏమైంది? " అని అడిగాడు.

"నినాదాలు చేశాం. ఎంతకూ దిల్‌ఖుష్ బైటికి రాలేదు. రవివల్ల కూడా ప్రయోజనం వుండదు. మన కుర్రవాళ్లను వాల్ రైటింగుకు పంపించాను. తెల్లవారే సరికల్లా డ్యాన్సులను నిషేధించాలని గోడలమీద రాస్తారు. ఇదంతా పేపర్లలో వచ్చేట్టు మీరే




చూడాలి"

"అలాగే చేద్దాంగానీ నీకొక శుభవార్త చెప్పనా? " అడిగాడు రైటరు.

"ఏమిటది? "ఆశ్చర్యంగా చూశాడు సుధీర్.

"దొరగారి దొరసానిగారు రేపు ఊరికి వెళ్తున్నారు"

"అది నాకేం శుభవార్త? "

"అదే మరి మాకూ మీకూ వున్న తేడా! కాశ్మీర్లో వున్న నేరస్థుణ్ణి పట్టుకోవాలంటే ముందుగా మేము కన్యాకుమారి వెళ్తాము. అది తెలిసి నేరస్తుడు ఏమరుపాటుగా వుంటాడు. అప్పుడు కాశ్మీరువెళ్లి అక్కడే వల పన్ని పట్టుకుంటాం. అలాగే ఒక నేరస్థుడు దొరక్కపోతే వాడి భార్యాపిల్లల్ని తెచ్చి సెల్‌లో వేస్తాం. చిత్రహింసలు పెడతాం. దాంతో వాడు ఎక్కడున్నా పరు గెత్తుకొస్తాడు. చూసేవాళ్ళకు మావి పిచ్చిపనుల్లా తోస్తాయిగానీ వాస్తవం మాత్రం అది"

"దీనికీ దానికీ ఏం సంబంధం? "

"చాలా వుంది. అదంతా మా డిపార్టు మెంటల్ సీక్రెట్టు. మేం చెప్పకూడదు. అదంతా నీకే తెలుస్తుంది. ఒకటి మాత్రం చెప్తాను. అది నీకు శుభవార్తే!"

"మేము యిచ్చిన మెమొరాండంమీద దొరగారు యాక్షన్ తీసుకోబోతున్నారా? " సంతోషంతో కళ్ళు విప్పార్చి అడిగాడు సుధీర్.

"అవును... యాక్షన్ గూడా సీరియస్‌గా వుంటుంది"

"ఇక తేల్చాల్సింది నేరేడు విషయమే. అది మనవాడిమీద ఆధారపడి వుంది. ఇవ్వాళ రాత్రికి దాని సోడా మిషను కాజేశా డంటే అది కూడా దారికి వస్తుంది" అంటూ గూనోడివైపు చూశాడు రైటరు.

ఆబగా తాగుతున్న గూనోడు అప్పటికే తూలుతున్నాడు. రైటరు అలా అనగానే బరువుగా వున్న కనురెప్పలను బలవంతంగా విప్పార్చి చూస్తూ, "నాకు సిల్లీ సికినుగావాలి, రొయ్యల ఏపుడు గావాలి" అని అడిగాడు నంగిగా.

కానిస్టేబులు వీరాస్వామి గది బైటకు వెళ్ళి గుమ్మందగ్గర నిలబడి అటెండర్ని కేక వేసి పిలిచాడు. అతను రాగానే సుధీర్‌ను దగ్గరికి పిలిచి "అటెండరుకు వంద రూపాయలు యిచ్చి పంపించు" అని చెప్పాడు.

సుధీర్ జేబులోంచి డబ్బుతీసి అటెండరు కిచ్చాడు.

"ఒక ప్లేటు చికన్ ఫ్రై, ఒక ప్లేటు ప్రాన్స్ కావాలి" అటెండరుకు చెప్పాడు వీరాస్వామి.

"నాకు... నాకు సిగిరెట్టు ప్యాకెట్టు కావాలి" లోపలినుంచి పెద్దగా అరిచాడు గూనోడు.

"ఏం సిగరెట్లు? " దగ్గరికి వెళ్ళి అడిగాడు వీరాస్వామి.

"మూడ్డైదులు!"

"త్రిబుల్ ఫైవా? " అని ఆశ్చర్యంగా చూసి "ఇదివరకు నువ్వు మంగుళూరు బీడీలు కదా కాల్చేవాడివి? " అడిగాడు.

"జేల్లో అలవాటైంది. యిండియా బీడీలు కాలిత్తే కడుపులో ఒకటే యికారం!"

కానిస్టేబులు వీరాస్వామి యిక చేసేది ఏమీలేక వెనక్కు తిరిగి మళ్ళీ సుధీర్ దగ్గరికి వెళ్ళాడు. ఇంకో వంద రూపాయలు అడిగి తీసుకొని సిగరెట్లు కూడా తెమ్మని చెప్పి అటెండరుకు యిచ్చి పంపించాడు.

అతను వెళ్ళిపోగానే వీరాస్వామి, సుధీర్ వెళ్ళి కుర్చీల్లో కూర్చున్నారు. గ్లాసులు అందుకొని నెమ్మదిగా విస్కీ సిప్‌చేస్తున్నారు.

"నువ్వు మరీ విపరీతంగా తాగితే దొంగతనం చెయ్యలేవేమో? " గూనోడ్ని అడిగాడు హెడ్డు.

"నాకు తందుర్రోటీ కావాలి... నాకు మటన్ మసాలా గావాలి" అన్నాడు గూనోడు వ్రేలుతో శూన్యంలో సున్నాలు చుడుతూ.

వాళ్ళు ఒకళ్ళ మొఖాలు ఒకళ్ళు చూసుకున్నారు. అప్పటికి వాళ్ళు తలా రెండు రౌండ్లు మాత్రమే తాగారు. గూనోడు మాత్రం ఒక ఫుల్ బాటిల్‌దాకా లాగించాడు. కళ్లు మూసుకొని తూల్తూ కూర్చున్నాడు.

"వీడిక మందు తాగకుండా చూడాలి. కొంచెం ఫుడ్డుకొట్టి ఒక సిగరెట్టు కాల్చాడంటే తేరుకొంటాడు. వెంట తీసుకొని వెళ్ళి వాడికి నువ్వు నేరేడు ఇల్లు చూపించి రావాలి. నువు వచ్చాక దొంగతనం వాడు చేస్తాడు" వీరాస్వామితో రహస్యంగా చెప్పాడు హెడ్డు.

అటెండరు వచ్చాడు. ఫుడ్ పార్శిళ్ళూ, సిగరెట్లూ బల్లమీద పెట్టాడు. మంచినీళ్ళ గ్లాసులు పెట్టి బైటికి వెళ్ళిపోయాడు.

గూనోడ్ని చేత్తో తట్టి లేపాడు హెడ్డు. "నువ్వు అడిగిన పార్శిళ్ళు అవిగో. త్వరగా తిని వీరాస్వామి వెంట నేరేడు ఇంటిదాకా వెళ్ళు. నీకు దాని ఇల్లు చూపించి వస్తాడు వీరాస్వామి. మిగిలిన కార్యక్రమం నువ్వు పూర్తిచెయ్యాలి" అని చెప్పాడు చనువుగా.

గూనోడు తూల్తూనే నవ్వాడు. "సికిన్ తిన్నాకనే నా నిర్ణాయకం!" అని పార్శిళ్ళు విప్పతీసి తినటం ప్రారంభించాడు.

"మన ఫుడ్డు మాటేమిటి? " సుధీర్‌ను చూస్తూ అడిగాడు రైటరు.

హెడ్డు కల్పించుకొన్నాడు. "యివ్వాళ మన ఫుడ్డు ఇళ్ళలోనే. దానికోసం మనం ఆలస్యం చేస్తే యీలోగా గూనోడు గుర్రు పెట్టి నిద్రపోతాడు. పని మొత్తం చెడిపోతుంది" అన్నాడు.

అందరూ మౌనంగా గూనోడివైపు చూస్తూ కూర్చున్నారు.

అతను పార్శిళ్ళు అన్నీ ఒక్కొక్కటే విప్పి నిదానంగా తింటూ చివరి పొట్లం కూడా అయిపోయాక 'బ్రేవ్'మని త్రేన్చాడు. మంచినీళ్ళగ్లాసు అందుకొని రెండేరెండు గుక్కలు తాగి గ్లాసు కిందపెట్టాడు.

"ఇంకొంచెం మంచినీళ్ళు తాగు. మందు నిషా దిగిపోతుంది" అన్నాడు హెడ్డు గూనోడితో.

గూనోడు మళ్ళీ ఓ గ్లాసు మంచినీళ్ళు తాగాడు. 'బ్రేవ్'మని త్రేనుస్తూ, "నిజ్జివే! నీలు తాగంగానే నిసా అంతా దిగిపోనాది" అని గ్లాసునిండా విస్కీ ఒంపుకొని గటగటా తాగేశాడు.

"ఛీ...! నువ్విలా అనకపోతే బాగుండేది" విసుక్కున్నాడు రైటరు హెడ్డుమీద.

"ఇలా చేస్తాడని నాకు మాత్రం ఏం తెలుసు? " అని హెడ్డు గూనోడి భుజంమీద చేత్తో తడుతూ, "నీకేం కాలేదు, కంట్రోల్లోనే వున్నావు. త్వరగా లేచి వెళ్ళి చెప్పిన పని చెయ్యి" అన్నాడు చనువుగా.

గూనోడు ప్లేట్లో చెయ్యి కడుక్కున్నాడు. కానిస్టేబులు వీరాస్వామి ప్యాంటు జేబులో చెయ్యి దూర్చి అతని కర్చీఫ్ తీసుకొన్నాడు. దాంతో చేతులు తుడుచుకొని అతనికి తిరిగి యిచ్చివేసి ఓ త్రిబుల్ ఫైవ్ సిగరెట్టు తీసి వెలిగించుకొన్నాడు.

"ఇప్పుడు సెప్పండి నాతో మీకేం సహాయంగావాలి? " అని అడిగాడు గుప్పుగుప్పున పొగ వొదులుతూ.

అందరికీ గూనోడిమీద చిర్రెత్తుకొచ్చింది. సుధీర్‌కు మాత్రం అతని వాలకం చూస్తుంటే వింతగా తోస్తోంది. పోలీసులతో అతనలా ప్రవర్తిస్తున్నాడంటే ఆశ్చర్యపోయాడు.

"మళ్ళీ మొదటికే వొచ్చావేంటి రా గూనోడా! అంతా నీకు ముందుగానే చెప్పాంకదా. యివ్వాళ రాత్రికి నువ్వు నేరేడు ఇంట్లో దొంగతనం చెయ్యాలి" కోపాన్ని తమాయించుకొంటూ అన్నాడు హెడ్డు.

రైటరూ, వీరాస్వామి గూనోడివైపు చూపులు గుచ్చారు.

గూనోడు చాలా నిర్వికారంగా కాలుస్తున్న సిగరెట్టును యాష్‌ట్రేలో కుక్కాడు. పెట్టి




లోంచి మరో సిగరెట్టు బైటికి తీసి వెలిగించాడు.

"మాట్లాడవేం? " అన్నాడు హెడ్డు గూనోడితో.

"నాను మాటలోడ్నిగాను, శాతలోడ్ని, మీరు సెప్పాల్సిందంతా సెప్పారు. ఇన్నాను. ఏటి సెయ్యాలో ఆలోశన జెయ్యాల్సిందింక నాను, మీరు గాదు" అని గబగబా నాలుగు దమ్ములు లాగి ఆ సిగరెట్టును కూడా యాష్‌ట్రేలో కుక్కి కుర్చీలోంచి లేచి, "రేత్తిరికి ఆలోశనజేసి నా నిర్ణయకం ఏంటిదో మీకు రేపుపొద్దుగాల సెప్తాను" అని తూలుకుంటూ అక్కడ్నించి వెళ్లిపోయాడు గూనోడు.

"ఎక్కడికి వెళ్తున్నాడో చూడు!" కానిస్టేబులు వీరాస్వామికి చెప్పాడు హెడ్డు.

వీరాస్వామి హడావుడిగా గదిలోంచి బైటికి వెళ్ళాడు. వరండా మెట్లదగ్గర నిలబడి గూనోడికోసం చూశాడు.

అప్పటికే గూనోడు మెయిన్‌గేటు దాటి వెళ్ళిపోయాడు.

వీరాస్వామి వెనక్కుతిరిగి గదిలోకి వెళ్ళాడు. గూనోడు వెళ్ళిపోయిన విషయం హెడ్డుతో చెప్పాడు.

"వీడుచూడూ, నాయకుడిలా మనపని రేపు చూద్దాం అంటూ హామీయిచ్చి చక్కా వెళ్ళిపోయాడు. చాతకాని వెధవ చేతులుపై కెత్తాలిగానీ ఫారిన్ విస్కీ తాగి పారిపోతాడా! అమాయకుడు కాకపోతే మనతో యిలా ప్రవర్తించడు. వాడి అమాయకత్వాన్ని తలబిరుసుతనం అనుకొనే ఆరోజు దొరగారు జైలుకు పంపించాడు వీడ్ని. అయినా వాడిలో యింకా మార్పు రాలేదంటే వీడిని ఒక చూపు చూడాల్సిందే మనం" అన్నాడు హెడ్డు కోపంగా.

నిజానికి రైటరు, వీరాస్వామి కూడా గూనోడు చేసిందానికి లోలోపలే ఉడికిపోతున్నారు.

"మనం వీడిమీదే ఆధారపడ్డాం అనుకొని రెచ్చిపోయాడేమో! ఆ పని చెయ్యటానికి మనం కో అంటే కోటిమంది వస్తారు. దేశం దొంగలకేం గొడ్డుపోలేదుగదా!"

"బాగా చెప్పావ్!" వీరాస్వామిని అభినందించాడు హెడ్డు.

"ఇప్పుడు జరగాల్సిందేమిటో ఆలోచించండి" అన్నాడు రైటరు.

"మీ సలహా ఏమిటి? "

"గూనోడిక్కూడా మనం అంటే ఏమిటో తెలిసిరావాలి. అప్పుడు చెప్పుకింద తేలులా పడివుంటాడు. అలా జరగాలంటే వాడి ప్రమేయంలేకుండానే పని జరిగిపోవాలి. తెల్లవారేసరికల్లా నేరేడు ఇంట్లో దొంగతనం జరగాలి"

"ఆ పనికి మనం వెళ్ళటం బాగుండదు కదా, ఎలా? " అని అడిగాడు కానిస్టేబులు వీరాస్వామి.

"దానికి ఒక మార్గం వుంది!"

"ఏమిటది? "

"మన లాకప్పులో కరెంటు మోటార్ల దొంగ శామ్యూల్ వున్నాడు. రాత్రికి వాడ్నో గంట బైటికి తీద్దాం. వాడితో దొంగతనం చేయిద్దాం!"

"వాడు సందు చూసుకొని పారిపోతే? " అడిగాడు హెడ్డు.

"అదీ పాయింటేగానీ దానికీ మార్గం ఆలోచించాను"

"ఏంటది? "

"వాడి పెళ్ళాన్ని తెచ్చి సెల్‌లో వేద్దాం. వాడు మనం చెప్పినట్టు దొంగతనం చేసి వచ్చింతర్వాత వాడ్ని మళ్ళీ లోపలవేసి దాన్ని విడిచిపెడదాం"

ఆ సలహా అందరికీ బాగా నచ్చింది. రైటరును వాళ్లు అభినందించారు కూడా.

"ఆలస్యందేనికి! అందరం కలసి స్టేషనుకు వెళ్దాం" అని లేచాడు రైటరు.

సుధీర్‌ను ఇంటికి పంపించి వాళ్ళు ముగ్గురూ పోలీసుస్టేషనుకు వెళ్ళారు.

జరుగుతున్న కుట్రను గురించి ఎంత

మాత్రం తెలియని నేరేడు నిశ్చింతగా నిద్రపోతోంది తన ఇంట్లో.

తెల్లవారింది.

నేరేడు నిద్రలేచి ఇంటిముందు కసువు ఊడ్చి కళ్ళాపి చల్లింది. ముగ్గులు పెట్టి వెళ్ళి స్నానం చేసి వచ్చింది. రోజూ నేరేడు దిన చర్య అదే...! పొద్దున్నే అలా ఇంటిపని ముగించుకొని సోడా సీసాలు కడగాలి. వాటిల్లోకి మంచినీళ్ళు నింపాలి. మిషనుమీద సీసాల నిండా గ్యాసు ఎక్కించాలి. సీసాలను బండిలోని అరల్లోకి దూర్చి వాటిమీద వరిగడ్డి కప్పాలి.

అలా చేసిన కొంత సమయానికిగానీ సోడాలు బాగా ఘాటు ఎక్కవు.

గుడిసె గోడకు ఆనించి వేసిన పందిరి లోకి వెళ్ళింది నేరేడు. సోడాలకు సంబంధించిన సరంజామా అంతా పందిర్లోనే వుంటుంది. తల ఎత్తి చూసిన నేరేడు గుండె ఝల్లుమంది.

అక్కడ వుండాల్సిన సోడా మిషనూ, గ్యాసు సిలిండరూ లేవు. జరిగింది ఏమిటో ఆమెకు అర్థమైపోయింది.

రాత్రి తను బాగా అలసిపోయి ఒళ్ళు తెలియకుండా గురకలుపెట్టి నిద్రపోయింది. అమ్మ కూడా అంతే. ఎవరో ఇంట్లోకి దూరి దొంగతనం చేశారని ఊహించింది.

నేరేడుకు ఒళ్ళంతా చమటలు కమ్మాయి. భయంతో ఒణికిపోతూ గావుకేక పెట్టింది.

కూతురు కేకలకు ఇంట్లోనుంచి శాంతకుమారి ఏంజరిగిందో అని పరుగెత్తుకొంటూ నేరేడు దగ్గరికి వెళ్ళింది. "ఏంటమ్మా? ఎందుకలా అరిచావ్?" అని అడిగింది ఆత్రంగా.

"దొంగతనం జరిగింది. ఎవరో మన సోడా మిషనూ, గ్యాసు సిలిండరూ ఎత్తుకొని పోయారు" చెప్పింది నేరేడు.

శాంతకుమారి నవనాడులూ కృంగిపోయాయి. శరీరంలోంచి రక్తం అంతా తోడి వేసినట్టు పాలిపోయిన ముఖంతో దీనంగా శూన్యంలోకి కొంచెంసేపు చూసింది. తన కుటుంబానికి వున్న జీవనాధారం లేకుండా పోయిందన్న నిజాన్ని జీర్ణించుకోలేకపోయింది. రెండు చేతులతో గుండెని బాదుకొంటూ వీధి అంతా వినిపించేలా ఏడుపు ంకించుకొంది.

జనం పోగయ్యారు.

"బిడ్డ తన సుగం మరసిపోయి కాయకష్టం జేస్తా నన్ను బతికిస్తాంటే నా ఇంట్లో దొంగతనం జెయ్యను ఎవుడికి సేతులొచ్చినాయో, వాళ్ళింటో పీనిగెళ్ళ, వాళ్ళ నోళ్లల్లో దుమ్ముబడ, పేదోళ్లని పెద్దోళ్లే దోస్తావుంటే సివరికి సిన్నోళ్ళు, సిల్లర దొంగలు గూడా దోసుకుంటుంటే యీ భూ ప్రెపంచంలో యింక బతికేదెట్టాగరా భగవంతుడా!

"మడిసన్నాక కట్టంజేసి బతకాల. మంది కట్టం కాజేసి బతికే ఆ బతుకు బతుగ్గాదు. అంతకన్నా సావటం నయ్యం. ఐపోయింది, అంతా ఆ యీరబ్రెమ్మంగారు సెప్పినట్టే జరుగుతా వుంది. కలి సివర్లోకొచ్చి కంతిరీ నాకొడుకులు పుడుతుండారు. తల్లికీ పెళ్ళానికీ తేడా తెలియని వోళ్ళు జల్మ ఎత్తుతా వుండారు. అస్మంటోళ్ళందరూ పుడతా మా అసుమంటోళ్ళ వుసురు పోసుకుంటా వుంటే యింక మేం బతికేదెట్టాగరా దేవుడా!" అంటూ శాంతకుమారి శోకండాలు పెట్టి ఏడుస్తూంటే తల్లిని వారించింది నేరేడు. ధైర్యం చెప్పి భుజం తట్టింది!

అయినా శాంతించలేదామె. లబోదిబోమని ఏడుస్తూనే వుంది.

ఎంతకూ శాంతకుమారి నిబ్బరం తెచ్చుకోకుండా గుండెలు అవిసేట్టు అలా ఏడుస్తూ వుంటే ఆ దృశ్యాన్ని చూడలేకపోయింద పక్కింటి ఆదెమ్మ. "యాడవగాకే అప్పా! నారు బోసినోడు నీరూ బోస్తాడు యాడవగాకు. మనం గమనంబెట్టి సూడంగానీ దేవుడు మనకి సిన్నకట్టం వొచ్చినా టయానికి ఏదో ఒక దారి సూపిచ్చి ఆదుకుంటాడే




అప్పా!" అంది అభిమానంగా.

అందరూ ఎవరికి తోచినట్టు వాళ్ళు శాంతకుమారికి ధైర్యం చెబుతూంటే సరిగ్గా అదే సమయానికి నేరేడు ఇంటిముందు సైకిల్ దిగాడు కానిస్టేబులు వీరాస్వామి.

"నాను సెప్పలేదే అప్పా! దేవుడు ఏదో ఒక రీతిన వొచ్చి ఆదుకుంటాడని. ప్రెపంచంలో ధర్మం, న్యాయం యింకా సావలేదు. సావవుగూడా. టయానికి కానిస్టేబులుగోరు సైకిల్ మీన వొచ్చిండంటే అంతకన్నా సాచ్చీకం యింకా ఏటిగావాలి? " అని భక్తి భావంతో వీరాస్వామివేపు చూస్తూ, "దొరగోరూ రాండి, రేత్తిరి నేరేడు ఇంటో దొంగలు బడినారు" అని చెప్పింది ఆత్రంగా.

కానిస్టేబులు వీరాస్వామి హడావుడిగా సైకిల్ దిగాడు. స్టాండువేసి లోపలికి వొచ్చాడు.

"నీ ఇంట్లో దొంగతనం జరిగిందంటే ఆశ్చర్యంగా వుంది. నువ్వు అందరికీ తెలిసిన దానివి. నువ్వంటే అందరికీ భయం. అలాంటిది నీ ఇంట్లోనే దొంగతనం చేశారంటే ఎంతగా బరితెగించారో మీరే అర్థం చేసుకోండి" అన్నాడు నేరేడు మీదికి చూపులు గుచ్చుతూ అందరికీ వినిపించేట్టు.

నేరేడు అతనివేపు జాలిగా చూసింది.

"దొంగతనం ఎలా జరిగింది? " అడిగాడు వీరాస్వామి.

"అమ్మాయి రేత్తిరి హాలుకాడ్నించి వొచ్చింది. సోడాబండి బెట్టి తానంజేసి బువ్వ దిని తొంగుంది. పొద్దుగాల లెగిసి సూద్దుంగదా! సోడా మిసను, గ్యాసు స్తంభం కనిపియ్యలేదు" చెప్పింది శాంతకుమారి.

"ఎన్ని గంటలకు నిద్రపోయారు? " అడిగాడు వీరాస్వామి.

"పన్నెండు గొట్టుంటారు!"

"దొంగతనం జరిగినట్టు ఎన్నింటికి చూశారు? "

"పొద్దుగాల ఐదింటికి!"

"రాత్రి పన్నెండింటికీ, పొద్దున ఐదింటికీ మధ్యలో నేరేడుగానీ, నువ్వుగానీ లేచారా? "

"లేదు... ఎవ్వరం లేవలేదు"

"దొంగలుపడి సామాన్లు ఎత్తుకుపోతోంటే కూడా మీకు మెలకువ రాలేదన్న మాట. అంత అజాగ్రత్తగా వుంటే ఎలా? చేసే పనులు యిలా వుంటాయి. దొంగతనాలు జరిగితే పోలీసుల్ని ఆడిపోసుకుంటారు. మీ జాగ్రత్తలో మీరుండాలిగానీ దొంగతనాలు జరక్కుండా చూట్టానికీ జరిగితే వెంటనే నేరస్తులను పట్టుకొని దొంగసొత్తు స్వాధీనం చేసుకోటానికీ మేమేం దేవుళ్ళంకాదు, పోలీసోళ్ళం!" అని మందలించాడు కానిస్టేబులు వీరాస్వామి.

ఆదెమ్మ కల్పించుకొని అతనికి సర్దిచెప్పింది. "పగలంతా బిడ్డ సినిమాహాలు కాడ సోడాలు అమ్మి అలిసిపోయి నిద్రోయింది. శాంతకుమారా... ముసల్ది. యీసారికి తప్పుగాసి ఎట్టాగైనా దొంగల్ని పట్టుకో పోలీసుదొరా! వాళ్ళ సావాను వాళ్ళకిప్పియ్యి, సచ్చి నీ కడుపున బుడతారు" అంది బతిమాలుతూ.

వీరాస్వామి కొంచెం సేపు తీవ్రంగా ఆలోచించాడు. చివరికి ఒక నిర్ణయానికి వస్తూ, "ఇవ్వాళ కాకపోయినా దొంగ ఎప్పటికయినా దొరక్కపోడు. ఇంకోచోట దొంగతనం చేసినప్పుడైనా పట్టుపడ్తాడు. అప్పుడు లాఠీలు విరిగితే చేసిన నేరాలన్నీ ఏకరవు పెట్టుకుంటాడు. ఎవరింట్లో ఏం దొంగిలించిందీ, దొంగిలించిన వస్తువులను ఎక్కడెక్కడ అమ్మిందీ అంతా చెబుతాడు. అంతేగానీ యివ్వాల్టికి యివ్వాళ వాడు దొరకాలంటే దొరకడు. అది అలా వుంచి అంతకన్నా పెద్ద సమస్య వుంది మరొకటి!"

"ఏమిటది? " అడిగింది నేరేడు.

"దొంగ దొరికినాగానీ వాడు నీ సోడామిషనూ, సిలిండరూ ఏ ఊర్లో అమ్మాడని చెబితే మేము ఆ ఊరికి వెళ్ళాలి. రానూ

పోనూ చార్జీలు, కర్చులూ తడిసి మోపెడవు తాయి. ఆ డబ్బుతో నాలుగు మిషన్లూ నాలుగు సిలిండర్లూ కొనుక్కోవచ్చు తెలిసి నదానివని నిజం చెబుతున్నానుగానీ యింకొకళ్ళకయితే చెప్పేవాడ్నికాదు. రిపోర్టు యివ్వటం అనవసరం" అని చెప్పాడు వీరాస్వామి.

"అసుమంటప్పుడు యీ యవ్వారానికి మార్గం తవరే సెప్పాల. పాపం! ఆదర్వు లేని సంసారం. తవరే దయతలసాల" అని కానిస్టేబులు వీరాస్వామివైపు బతిమాలుతూ చూసింది ఆదెమ్మ.

నేరేడు మౌనంగా నిల్చుంది. శాంతకు మారి లోపలికి వెళ్ళి చాపమీద పడుకొంది నిస్త్రాణగా.

"సరే... చూద్దాం! నాకు చాతనైన సహాయం నేను చేస్తానుగానీ ఎందుకయినా మంచిది నువ్వొకసారి హెడ్డుగార్ని కలిసి జరిగిందంతా చెప్పుకో. ఆయనక్కూడా నువ్వంటే చాలా అభిమానం. ఆయన సహాయం చెయ్యాలనుకుంటే నీ సామాన్లు నీకు యిప్పించటం పెద్దపనేమీ కాదు. అంతా నువ్వు ఆయనతో మాట్లాడుకోవ టంలో వుంటుంది. ఇక నీ యిష్టం" అని నేరేడువైపు అదోలా చూసి నవ్వాడు వీరా స్వామి.

పోయిన సామాన్లను గురించే ఆలోచి స్తున్న నేరేడు వీరాస్వామి మాటల్లోని గూడార్థాన్ని గ్రహించలేదు. అతను చెప్పింది అసలికి పట్టించుకోకుండా శూన్యంలోకి చూస్తూ నిల్చుంది.

కానిస్టేబులు వీరాస్వామి టోపీని ఒకసారి దులిపాడు. నెత్తిమీద బిగించుకొన్నాడు. "అవసరమైనప్పుడు కబురు పెడతాముగానీ అప్పుడు నేరేడును స్టేషనుకు పంపించండి" అని ఆదెమ్మతో చెప్పి సైకిల్ మీద బయల్దే రాడు. సినిమా హాలు సెంటరుకు వెళ్ళాడు.

నేరేడు ఇంట్లో దొంగలుపడిన విషయం అప్పటికే అక్కడికి పాకింది. బీడీ బంకు ముందు నిలబడి శేషయ్య కానిస్టేబులు వీరాస్వామిని కేకవేసి పిల్చాడు. అతను దగ్గరికి వచ్చి సైకిలు దిగి బల్లమీద కూర్చో గానే రెండు టీలు తీసుకురమ్మని కేకవేసి.

"నేరేడు ఇంట్లో దొంగతనం జరిగిందా?" అని అడిగాడు.

"అవును. అక్కడ్నించే వొస్తున్నాను" చెప్పాడు వీరాస్వామి.

"ఎవరై వుంటారూ?"

"ఏమో! ఇంకా యిన్విస్టిగేషన్ మొదలుకా లేదు"

అని చెప్పి ఎందుకో రోడ్డువేపుకు చూశాడు వీరాస్వామి.

అతని కళ్ళు గర్వంగా మెరిశాయి అక్క డికే వస్తున్న గూనోడ్ని దూరంగా చూడ గానే.

గూనోడు గునగునా నడుస్తూ దగ్గరికి వెళ్ళి వీరాస్వామికి నమస్కారం చేశాడు నవ్వుతూ.

"రాత్రి తాగిందంతా దిగిపోయిందిరా?" అడిగాడు వీరాస్వామి.

"రేత్తిరెప్పుడో తాగిందాని నిసా యింకా వుంటాదా యిసిత్తరంగాకపోతే! దిగిపోనాది కామట్టే లగువెత్తుకొస్తన్నాను మీ కాడికి. ఇప్పుడు వద్దాం మనం యిసయంలోకి. ఇయ్యాళ రేత్తిరికల్లా తవరు సెప్పినపని సెయ్యాలని నిర్ణాయకం జేస్కొని బజారికి రాంగానే తెలిసినాది నేరేడు ఇంటో జరిగిన యిసయం. మొత్తానికి నాను లేకుండానే పని జరిపిచ్చినారు, సెబ్బాస్!" అంటూ మెచ్చుకోలుగా చూశాడు గూనోడు.

"వెనుకటికి ఎవడో పెళ్ళి ఆపాలని గుండ్రాయి దాచాట్ట. గుండ్రాయి దాచిపె డితే పెళ్ళి ఆగుతుందా! అలా వుంది నీ వ్యవహారం. ఇప్పుడు తెలిసినాదా మేమంటే ఏమిటో? ఇకనుంచయినా కొంచెం ఒళ్ళు దగ్గరుంచుకొని ప్రవర్తించు. లేకపోతే యిబ్బందులు పడతావ్!" హెచ్చరించాడు వీరాస్వామి.





వినయంగా తలూపాడు గూనోడు. గిర్రున ఆంజనేయులు వేపుకు తిరిగి "అరే బుడ్డోడా! కానిస్టేబులు దొరోరికి నామీన కోపం ఒచ్చినాదిగానీ సారు కొక్కి కింగు సిగరెట్టు ప్యాకెట్టిచ్చుకో. ఇయిగో డబ్బులు!" అని జేబులోంచి డబ్బు తీసి ఆంజనేయులుకిచ్చాడు.

ఆంజనేయులు కానిస్టేబులు వీరాస్వామికి సిగరెట్టు ప్యాకెట్టు యిచ్చాడు. కట్టిన కిళ్ళీ కూడా చేతికి అందించాడు.

"సారూ! ఇంతకీ నేరేడు యవ్వారం రేత్తిరికి రేత్తిరి ఎట్టా పూర్తిజేశారూ?" అని రహస్యంగా వీరాస్వామి చెవిలో అడిగాడు గూనోడు.

వీరాస్వామి గుర్రుగా చూశాడు గూనోడివైపు "అదంతా అనవసరం నీకు" అన్నాడు శేషయ్యకు వినిపించకుండా.

"సెప్తారో లేదో అని అడిగినానుగానీ యిసయం తెలవగ్గాదు. పాపం, రేత్తిరంతా లాకప్పులో దోమలుగుట్టి సంపినాయని సెప్పింది మార్తమ్మ. దాని మొగుడు శామ్యూల్‌గాడ్ని కొట్లోంచి బైటికి తీసి దాన్ని ఏసినారంటగా లోపల?" అని అడిగి విచిత్రంగా నవ్వాడు గూనోడు.

కానిస్టేబులు వీరాస్వామికి ఒళ్ళంతా జలదరించింది. తొడిగిన చొక్కాకింద గుండె మీద చిరుచమటలు పోశాయి. "అరేయ్ గూనోడా! జరిగింది ఏంటో తెలిస్తే తెలిసిందిగానీ ఆ విషయం ఎక్కడా అనబోకు". అని బీడీ బంకులో కూర్చున్న ఆంజనేయులువేపు చూస్తూ, "మా గూనోడికొక త్రిబుల్ ఫైవ్ ప్యాకెట్టు యివ్వు" అంటూ వెళ్ళిపోయాడు వీరాస్వామి.

"నేరేడు ఇంటికాడ దొంగతనం జరిగినాదని చెప్పాడా మన యీరాసామి?" శేషయ్యను అడిగాడు గూనోడు.

"చెప్పాడు'

"ఎవురు శేశారో తెలిసినాదంటనా?"

"ఇంకా తెలియదట"

గూనోడు తనలోతను నవ్వుకున్నాడు. అతనికి ఎందుకో నేరేడు ఇంటికి వెళ్ళి ఆమెను ఓదార్చాలన్న ఆలోచన కలిగింది మనసులో! అంతమంది పోలీసులు అంత పథకంవేసి ఆమెమీద కక్ష తీర్చుకున్నారంటే ఆమె మంచిది అయ్యుండాలన్న నిర్ణయానికి వచ్చాడతను.

సరిగ్గా అప్పుడే చైతన్య, పానకాలూ శేషయ్య బీడీ బంకు దగ్గరికి వచ్చారు హడావుడిగా.

"నేరేడు ఇంట్లో దొంగతనం జరిగిందా? ఇప్పుడే పానకాలు పనివుండి బజారుకు వెళితే తెలిసింది!" శేషయ్యను అడిగాడు చైతన్య.

"అవునట. కానిస్టేబులు వీరాస్వామి కూడా చెప్పాడు"

"పోలీసు రిపోర్టు ఇచ్చిందటనా?"

చైతన్య అలా అడగగానే కిసుక్కున నవ్వాడు గూనోడు.

అందరూ అతనివైపు చూశారు.

"మీరు నేరేడు ఇంటికాడికి యల్తారా సారూ?" అని చైతన్యను అడిగాడు గూనోడు.

"అక్కడికే బయల్దేరాం! ఎందుకూ?"

"నానూ వస్తాను"

"నేరేడు మీకూ తెలుసా?"

"తెలుసు. ఆమెను గురిచ్చి కానిస్టేబులు ఈరాసావి చెప్పిండు" అని వాళ్ళ వెంట బయల్దేరాడు గూనోడు.

ముగ్గురూ కలిసి నేరేడు ఇంటికి వెళ్లారు.

శాంతకుమారి వాళ్ళను చూసి చాప మీంచి లేచి వచ్చింది. అలాంటి సమయాలలో కొద్దిపాటి పరిచయస్తులు కనిపించినా గుండె లోతుల్లోంచి దుఃఖం పొంగుకొస్తుందట. అలాగే జరిగింది. ఆమె ఏడుపు లంకించుకుంది.

"ఎలా జరిగింది?" నిదానంగా అడిగాడు చైతన్య.

"అర్ధరేత్తిరికాడ అందరం నిదరబోతుంటే

ఎవుడి కాష్టం కాల్చుకున్నాడోగానీ ఇంత గోరం జేసిండు. 'ఇంకా దానిమీదుండ జంగయ్య బాకీగూడా తీర్లేదు. ప్రెతిరోజూ రొండుపొట్టలు నిండాలె. సావన్నా రాక పాయె నాకు. ఆళ్ళ సేతులిరగ! అన్నేలంగా దోసుకున్నారు ఇల్లు" అని ఆమె రాజుకున్న మంటలా మళ్ళీ అంటుకుపోతోంటే నేరేడు దగ్గరికి వెళ్ళి తల్లిని పొదివి పట్టుకుంది రెండు చేతులతో.

"జరిగిందేదో జరిగిపోయింది. జరగాల్సిం దేంటో మనం ఆలోచించాలిగానీ బెంబేలు పడిపోతే ఎలాగే అమ్మా?" అంది బలవం తంగా నవ్వు తెచ్చిపెట్టుకొంటూ.

ఎవరో వాళ్ళను పరామర్శించేందుకు వచ్చారని తెలిసి ఆదెమ్మ మళ్ళీ వచ్చింది నేరేడు ఇంటికి.

"ఇలా జరిగిందంటే ఏదో ఒకటి చెయ్యా లికదా మనం. ఏమీ చెయ్యకుండా కూర్చుంటే ప్రయోజనం వుండదు. పోలీసు రిపోర్టు ఇస్తే ఏమైనా మేలు జరుగుతుం దేమో ఆలోచించారా?" అడిగాడు చైతన్య నేరేడును.

ఆదెమ్మే నేరేడుకన్నా ముందుగా సమా ధానం చెప్పింది. "కానిస్టేబులు వీరాసావి దారినపోతూ ఈడ జనం పోగైవుంటే ఏంటిదా అని వొచ్చిండు. జరిగిందంతా సూసిండు"

"రిపోర్టు తీసుకున్నాడా? స్టేషనుకు రమ్మని చెప్పాడా?"

"రిపోర్టువల్ల ప్రయోజనం వుండదుట. నన్నే సాయంత్రం ఒకసారి స్టేషనుకు వచ్చి హెడ్డును కలవమని చెప్పి వెళ్ళాడు" అంది నేరేడు.

"రిపోర్టువల్ల ప్రయోజనం వుండదని చెప్పాడా?" చైతన్య ఆశ్చర్యంగా అడిగాడు.

అంతవరకూ మౌనంగా వింటూ కూర్చున్న గూనోడు చివాల్న తల పైకిఎత్తి నేరేడువైపు చూస్తూ. "సెల్లెమ్మా! నువ్వు మాత్తరం ఈరాసావి మాటలు నమ్మి టేశ న్కాడికి యళ్ళమాకు" అన్నాడు.

"వెళ్తే ఏం?" అడిగింది నేరేడు.

"ఎట్టా సెప్పాలో, ఏమని సెప్పాలో నాకైతే తోసటంలేదుగానీ ఒక్కటి మాత్తరం నిజ్జం. దీని ఎనకమాల శానా కుట్ర జరు గుతా వుండాది. ఆళ్ళవల్ల నీకు జరిగేటి ప్రయోజనం వుండదు సెల్లెమ్మా... నమ్ము నా మాట" అన్నాడు దృఢంగా.

గూనోడు అలా ఎందుకు అన్నాడో ఎవ్వ రికీ అర్థం కాలేదు. పైగా ఏదో కుట్ర వుందని కూడా చెప్పాడతను.

అతనికి ఎలా తెలుసు? అని మనసు లోనే అనుకొని "దీనివెనుక కుట్ర వుందన్నా రుకదా. ఎలా చెప్పారు. అంత రూఢిగా?" అని అడిగాడు చైతన్య పరీక్షగా గూనోడి ముఖంలోకి చూస్తూ.

అక్కడ నేరేడు, శాంతకుమారి, ఆదెమ్మ, పానకాలూ తప్ప ఇంకెవ్వరూ లేరు. వాళ్ళు కూడా గూనోడివేపే కళ్ళార్పకుండా చూస్తూ వుంటే గూనోడికి ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో కొంచెంసేపు అర్థంకాలేదు. తటప టాయించాడు.

"చెప్పరేం?" మళ్ళీ అడిగాడు చైతన్య.

అతనికి మాట్లాడక తప్పలేదు. "ప్రపంచ కంలో మంచోళ్ళూ వున్నారు. శబ్బరోళ్ళూ వున్నారు. ఎవురు మంచాళ్ళో, ఎవరు శబ్బ రోళ్ళో కరెట్టుగా సెప్పేవోళ్ళే లేరు. తెల్లోడికి ఎతిరేకంగా టుపాకులు బట్టిన సీతారామరా జును రాజద్రోహం చేసినాడని అప్పుడు కాల్చి సంపారు. దేశభక్తుడని ఇప్పుడు పొగుడుతా వున్నారు. అందుశాత ఒకళ్ళ కాడ మంచి అన్నది, ఇంకొకళ్ళకాడ సెడు అగుతున్నాది. ఒక దినం సెడు అనుకు న్నది ఇంకొక దినం మంచి అగుతున్నది.

"అందుశాత సెల్లెమ్మా...! నాను మంచో డినో, శబ్బరోడినో అసంటికి బెట్టి ఆలోశిం చుగానీ నువ్వు మాత్తరం పోలీసుల్ని నమ్మ బాకు, శానాడేంజరు. ఎందుశాత? అన్నిం టికీ ఎనకమాల ఏం జరుగుతుండాదీ?





అన్న ఇసయాలు నన్నగడమాకు. శానా మంది సిత్తకార్తె ఎదవలకి సెడును సెడు అంటే శానాకోపం. మంచిని మంచి అంటే శానా అసయ్యం. అసుమంటి యదవనా యాళ్ళు ఇంకా ప్రెవాదం సెల్లెమ్మా సెడు సచ్చినోళ్ళకన్నా గూడా!

"అందుకే అనవసరంగా ప్రెవాదం కొని తెచ్చుకోగూడదనే శానా యిసయాలు సెప్ప కుండా దాపెట్టాను. భయ్యంతో మాత్తరం గానేగాదు, సెప్పినందువల్ల ప్రయోజనం లేదని!

"ఇంక బువ్వకెట్టా గడుసుద్ది? అని మాత్తరం ఆలోశిచ్చు. దానికీ ఒక మారగం వుంది. అది నే జేప్తాను..."

"అంటే? " అని అడిగింది నేరేడు ప్రశ్నా ర్థకంగా చూస్తూ.

"నీ అవుసరం పెద్దదేంగాదు. శానా సిన్నది. నక్లేసులు గావాలని గానీ, మెడలో వుండాలని గానీ, కారుల్లో తిరగాలనిగానీ కాదు నీ ఆలోశన! దినం ఎట్టా గడుసుద్దా అని మాత్తరవే. ఒక్కసోడా మిశనూ, గ్యాసుస్తంభం సాల్నీకు బువ్వకి గడవా ల్నంటే. ఆ రొండూ పొద్దుగాలకల్లా వత్తాయి నీ కాడికి నడ్చుకుంటా. ఆ యవ్వారం నాకు ఒగ్గీసేయ్. నాను సూత్తాను. పాతయిబోతే కొత్తయి ఒచ్చేటి మార్గం ఆలోశిత్తాను" అని గూనోడు చాలా అభిమానంగా నేరేడువేపు చూస్తూ,

"జల్మలో తొలిసారిగా నాను ఎవిర్నీ వొరుసలు గలిపి పిలవలేదు. నిన్ను మాత్తరం 'సెల్లెమ్మా' అన్నానంటే నువ్వు నాకు దేవుడిచ్చిన సెల్లెమ్మవే. అందుకే సోడా మిసనూ, గ్యాసుస్తంభం తెస్తా అన్నా నేగానీ ముక్కూ మొఖం తెలవని గూనోడేం టిరా నాకు సహాయం సెయ్యటం? అని అనుకోమాకు. హెడ్డేగాదు. ఎస్.పి. పిలిపి చ్చినా నువ్వాడికి ఎల్లగాకు సెల్లెమ్మా. అన్నీ సూసుకుంటానింక" అని చివాల్న లేచి నిల్చున్నాడు గూనోడు. చైతన్యవేపు చూసి "ఇయ్యాళ ఫస్టు తారీగ్గదూ? " అని అడి గాడు.

"అవును" అన్నాడు చైతన్య ఉలిక్కిప డుతూ. అతను అంతవరకూ గూనోడు చెప్పిన విషయాలను గురించే ఆలోచించసా గాడు.

"ఎళ్ళొస్తా సెల్లెమ్మా! పొద్దుగాలకల్లా వచ్చే స్తాను. నా మాట నాను నెరవేరుత్తానుగానీ నువ్వు మాత్తరం దేవుడు దిగొచ్చి సెప్పినా గానీ ఆ పోలీసు టేశను సాయలకే ఎళ్ళ గాకు" అని మళ్ళీ ఒకసారి నేరేడును హెచ్చ రించి వెళ్ళిపోయాడు గూనోడు.



సాయంత్రమైంది.

కానిస్టేబులు వీరాస్వామి హెడ్డునూ, రైట రునూ వెంటపెట్టుకుని స్టేషను ఎదురుగా వున్న హోటలుకు వెళ్లాడు. ముగ్గురూ కాఫీ తాగుతూ కూర్చున్నారు.

"నేరేడు ఏమంటున్నది. ఏడుస్తున్నదా? ఇంకా దాని పొగరు అణిగిందా లేదా? " అంటూ ప్రశ్నలవర్షం కురిపించాడు హెడ్డు.

జరిగిందానికి అందరికీ ఆనందంగా వుంది.

"దాని బాధ బాధ కాదు. పైకి గంభీ రంగా వుందిగానీ లోపల మాత్రం చాలా

భయపడుతోంది. పూట గడవదుకదా ఇక! హెడ్డుగారిని కలిసి దొంగతనం విషయంలో సహాయం అడగమని చెప్పాను. మౌనంగా వింది. అదేగనక మామూలు పరిస్థితుల్లో ఐతే గయ్యిన లేచేది, కారుకూతలు కూసేది. అలా జరగలేదంటే దానికి పైచ్చం దిగిపోయినట్టే" చెప్పాడు వీరాస్వామి.

హెడ్డు, రైటరూ కిసుక్కున నవ్వారు.

"ఈరోజు మన ప్రోగ్రాం ఏమిటి? జీతాలు కూడా వచ్చాయి. అనుకున్న ప్రకారం నేరేడు పొగరు అణగింది. మరి మనం రాత్రికి గెస్టుహవుసులో మజా చేసుకోవద్దూ? " అన్నాడు రైటరు.

"ఆ భాగ్యానికి మన జీతాలే రావాలా! సుధీర్‌కు మనం కబురుచేద్దాం. వచ్చి వాల్తాడు. అతనే మజా ఏర్పాట్లు చేస్తాడు. మనం మన జీతాల డబ్బు కర్చొందుకు పెట్టాలి" అని వీరాస్వామి హెడ్డుకేసి చూసి "వాళ్ళ నిరసన ప్రదర్శన విషయం ప్రెస్‌నోట్ పంపించారా? " అడిగాడు.

"ఓ...! ఆ పని పొద్దున్నే చేశాం. రేపు ఉదయం పత్రికల్లో వార్త వస్తుంది" చెప్పాడు హెడ్డు.

"దొరగారిని కలిశారా? డ్యాన్సర్ల విషయం మాట్లాడారా? "

"ఓ...! ఆ పనికూడా పొద్దున్నే చేశాం..."

"దొరగారు ఏమన్నారూ? "

"వారికీ ఫైలు త్వరగా క్లోజ్ చేద్దామనే వుంది మనసులో. దొరసానిగారు పుట్టింటికి వెళ్లాలి. అప్పుడుగానీ వ్యవహారం తేలదు"

"ఎప్పుడు వెల్తారట? "

"ఇంకా తేలలేదు. ఆవిడగారేదో ఫోన్ కోసం చూస్తున్నారు. అది రాగానే బయల్దేర్తారట!" చెప్పాడు హెడ్డు.

ముగ్గురూ కాఫీతాగి ఖాళీ కప్పులు బల్ల మీద పెట్టారు.

"నేరేడు విషయంలో మనం చేసిందంతా గూనోడికి తెలిసింది" అప్పుడు చెప్పాడు వీరాస్వామి.

ఆశ్చర్యపోయారు.

"ఎలా తెలిసింది? " అడిగాడు రైటరు.

"శామ్యూల్‌గాడి పెళ్ళాం చెప్పిందిట"

"ఆరాలన్నీ వాడికి ఎందుకట? మనం వాడినిక దూరంగా వుంచాలి. అవసరానికి ఉపయోగపడనివాడితో మనకేమిటి దోస్తీ. ఎందుకైనా మంచిదిగానీ వాడినీ ఓ కంట కనిపెట్టివుండు" అని వీరాస్వామికి చెప్పాడు హెడ్డు.

వీరాస్వామి తల ఆడించాడు ఏదో ఆలోచిస్తూ.

"మనం రాత్రికి గెస్టుహౌసులో ఎన్నింటికి కలుద్దాం? " అని వీరాస్వామివేపు చూశాడు రైటరు.

"నేనిప్పుడు బజారుకు వెళ్లాలి. ఎండాకాలం వస్తోందికదా. కానిస్టేబులుగారింట్లో కూలరైనా లేదంటే బాగుండదంది మా అమ్మ. అర్జంటుగా వెళ్ళి కూలర్‌కొని ఇంటికి పంపించాలి. జీతం డబ్బు దానికి సరిపోతుందిగానీ వచ్చే శ్రావణ శుక్రవారంనాటికల్లా మా అమ్మకో పట్టుచీర, మా నాన్నకో మోపెడ్ కొనిపెట్టాలి. సుధీర్‌ను డబ్బు అడగటానికి వెళ్ళాలి" చెప్పాడు వీరాస్వామి.

"అయితే వెళ్ళి నీపని చూసుకో. కూలర్ ఇంటికి పంపించి సుధీర్ దగ్గరికి వెళ్లు. డబ్బు వ్యవహారం మాట్లాడుకుని అతడ్ని కూడా వెంటపెట్టుకొని సరిగ్గా ఎనిమిది గంటలకల్లా గెస్టుహవుసుకు వచ్చేయ్" అని చెప్పాడు హెడ్డు.

ముగ్గురూ హోటల్లోంచి బైటికి వచ్చారు. రైటరూ, హెడ్డూ పోలీసుస్టేషన్లోకి వెళ్ళిపోయారు. కానిస్టేబులు వీరాస్వామి బజారుకు వెళ్ళాలని కొంచెం దూరం తన సైకిలును నడిపించుకొంటూనే వెళ్ళి అక్కడ సైకిలుమీదికి ఎక్కబోగానే హేండిల్ను బలంగా పట్టుకొని ఆపాడు గూనోడు.

వీరాస్వామి ఆగి పరీక్షగా చూశాడు అతనివైపు. మరి ఎక్కడ తాగాడోగానీ





గూనోడి దగ్గర మందు వాసన గుప్పున కొట్టింది. ఫారిన్ విస్కీ అంత వాసన రాద నుకొని "ఏం తాగావ్‌రా. ఇంత వాసన కొడుతోంది? అయినా ఫారిన్ విస్కీతప్ప తాగవుకదా నువ్వు? " అని అడిగాడు ఎగ తాళిగా.

"దేవుడితోడు సారూ... తాగింది యిదేశా లమందే! కావాల్నంటే ఇంకా బాటిల్లోన సహం మందు మిగిలే వుండాది, నువ్వే సూడు" అంటూ బొడ్లోంచి స్కాచ్ విస్కీ సీసా బైటికితీసి చూపించాడు గూనోడు.

గూనోడితో వెళ్ళి ఫారిన్ విస్కీ తాగు దామా? అని కొంచెంసేపు ఆలోచించాడు వీరాస్వామి. కానీ బజారుకు వెళ్ళి కూలర్ కొనాలి. సుధీర్‌ను కలిసి డబ్బు అడిగి తీసు కోవాలి. అతన్ని వెంటపెట్టుకొని గెస్టుహవు సుకు వెళ్ళాలి.

అన్నిపనులు పాడుచేసుకొని గూనోడితో కలిసి వెళ్ళటం అనవసరం అనుకున్నాడు. "మనం తర్వాత కలుద్దాంగానీ ఇవ్వాల్టికి నువ్వే లాగించు" అని చెప్పాడు. హేండిల్ మీద వున్న గూనోడి చేతిని తొలగించాడు. సైకిలు ఎక్కి వేగంగా వెళ్ళిపోయాడు.

గూనోడు గుంభనంగా నవ్వుకున్నాడు.

ఇందాకటిదాకా కానిస్టేబులు వీరాస్వామి జీతం డబ్బు అతని జేబులోనే వుందిగానీ ఇప్పుడు ఆ డబ్బు తన జేబులోకి వచ్చింది. అంటే క్షణం క్రితం డబ్బుమీద సర్వాధికా రాలూ అతనికి వుంటే ఇప్పుడు ఆ అధికారా లన్నీ తనకు సంక్రమించాయన్నమాట.

అధికారానికీ, అనధికారానికీ మధ్యన విభ జనరేఖ ఎంత చిన్నది.

అలాంటి విభజనరేఖలు గీయటంగానీ, చెరిపివెయ్యటంగానీ ఎంత సులభం!

గూనోడు కానిస్టేబులు వీరాస్వామిని తలుచుకుని ఆనందంగా నవ్వుకున్నాడు. అతనూ బజారుకు బయల్దేరి వెళ్ళాడు.

కానిస్టేబులు వీరాస్వామి కూలర్లు అమ్మే షాపుకు వెళ్లాడు. అక్కడ వున్న అన్నిరకాల కూలర్లూ చూశాడు. ఒక మోడలు కూలరు అతనికి బాగా నచ్చింది. దాని ధర అడిగి తెలుసుకొని జేబులో చెయ్యిపెట్టాడు. జీతం డబ్బులేదు.

అతని గుండె ఝల్లుమంది.

డబ్బు ఏమైంది? ఎక్కడయినా జారిపో యిందా?

అలా జరిగివుండదు. జేబులోంచి జారి పోయే అవకాశం ఎంతమాత్రం లేదు.

మరి ఏమైవుంటుంది?

వీరాస్వామికి ఫ్లాష్‌లా అప్పుడు వెలిగింది ఆలోచన! ఇందాక గూనోడు కలిసి చాలా సేపు మాట్లాడాడు. తనతో మందు తాగటా నికి రమ్మంటూ ఒళ్ళంతా తడిమి మరీ బతి మాలాడు.

సందేహంలేదు, ఇది వాడిపనే! డి.ఎ స్.పి. దొరగారి దొరసానిగారి నెక్లెసు దొంగిలించినవాడికి తన జేబు దొంగిలిం చటం అంత పెద్ద పనేమీకాదు.

వీరాస్వామికి ఒళ్ళంతా చిరుచమటలు పట్టాయి. గుండెలయ తప్పి కొట్టుకోసా గింది. ఏం చెయ్యాలో అర్థం కావటంలేదు. అమ్మగారికోసం ఎయిర్‌కూలర్ కొనాలి. జేబులో డబ్బులేదు. గూనోడు కాజేశాడు ఎలా?

"ఏం సార్! ఈ కూలర్ పాక్ చేయించ మంటారా? " అని అడిగాడు షాపు అతను.

అతనికి ఏం చెప్పాలో తోచలేదు కానిస్టే బులు వీరాస్వామికి. పరసు పోయిందంటే నమ్మడు. పోలీసు దార్ష్టీకం చూపించి ఉద్దేరగా కూలరు పట్టుకుపోయేందుకు పథకం వేసినట్టు అనుకుంటాడు. ఎవరో తన జేబు కొట్టారని చెప్పేందుకూ వీల్లేదు. అది డిపార్టుమెంటుకే అవమానం.

"మీ షాపులో కూలర్లు బాగా లేవోయ్. అయినా చవుకబారు కూలర్లు తెచ్చి జనానికి అంటగడితే మీకే ప్రమాదం. చట్టం చేతులు చాలా పొడవు. జాగ్రత్త" అని హెచ్చరించి హడావుడిగా షాపులోంచి బైటపడ్డాడు.

గూనోడిమీద అతనికి కోపం గొంతుదాకా వచ్చింది. వాడ్ని ఎక్కడున్నా వెదకి పట్టుకొని లాకప్పులో పెట్టి నాలుగు ఇచ్చుకోవాలన్నంత ఆగ్రహంగా వుంది.

అయినా ఓసారి స్టేషనుకు వెళ్ళి జరిగింది హెడ్డుకూ, రైటరుకూ చెప్పి అప్పుడు ఏం చెయ్యాలో అందరూ కలిసి నిర్ణయించవచ్చునని సైకిలును స్టేషనువేపుకు తిప్పాడు. వేగంగా తొక్కుతూ వెళ్ళాడు.

కానిస్టేబులు వీరాస్వామి స్టేషనుముందు సైకిలు దిగగానే అతడ్ని చూసి, "రా... రా...! సమయానికి వచ్చావ్. ఇవ్వాళ మీ అందరికీ చేతినిండా పనిదొరికింది" అన్నాడు సెంట్రీ అదోలా నవ్వుతూ.

సైకిలు స్టాండు వేసి, "ఏమిటది? " అని అడిగాడు వీరాస్వామి.

"డ్యాన్సర్లను పట్టుకొని స్టేషనుకు తెమ్మని చెప్పారు పెద్ద దొరగారు. అందరూ అదే హడావుడిలో వున్నారు"

"దొరసానిగారు ఊరికి వెళ్ళారా? "

"ఏమోగానీ దొరగారు మాత్రం ఆర్డరిచ్చారు" చెప్పాడు సెంట్రీ.

వీరాస్వామి స్టేషన్ లోపలికి వెళ్లాడు. హెడ్డును కలిశాడు.

వీరాస్వామిని చూడగానే హెడ్డు ముఖం మరింత వికసించింది. "సుధీర్ కనిపించాడా? " అని అడిగాడు.

"ఇంకా అతని దగ్గరికి వెళ్ళలేదు. కూలర్ కొనటానికి వెళ్తుంటే దారిలో గూనోడు కనిపించాడు..."

"ఇంతకూ కూలరు కొన్నావా? లేకపోతే ఎక్కడైనా దొంగిలించి తీసుకురమ్మని గూనోడికి చెప్పావా? "

"వాడికెందుకు చెప్తానూ..."

"అదే అంటున్నాను. చిన్న చిన్న విషయాలకు కక్కుర్తిపడొద్దు. ఎస్.పి.గారు మహాస్ట్రిక్టు. అదీగాక గూనోడ్ని పూర్తిగా నమ్మకూడదు. నమ్మినట్టు నటించాలంతే"

"వాడ్ని నేనెందుకు నమ్ముతాన్లేగానీ ఇకనుంచి వాడిని నమ్మినట్టు నటించే అవసరం కూడా లేదు"

"ఏం జరిగింది? ".

"వాడు నా జేబే కొట్టాడు. జీతం డబ్బంతా కాజేశాడు"

అందరూ ఆశ్చర్యపోయారు.

"వాడ్ని తెచ్చి లోపల వెయ్యాలి. కీళ్ళూ కాళ్ళూ విరగ్గొట్టాలి" అన్నాడు వీరాస్వామి.

హెడ్డు విసురుగా కుర్చీలోంచి లేచాడు. బల్లమీద వున్న హేట్ తీసి తలమీద పెట్టుకొని, "గూనోడి విషయం తరువాతగానీ ముందు మనం డ్యాన్సర్లను తెచ్చి స్టేషన్లో పెట్టాలి. నువ్వూ మాతో వచ్చేయ్. వాళ్ళను తెచ్చి స్టేషన్లో పెట్టాక తీరికగా గెస్టుహవుసులో కూర్చొని మందు కొడుతూ ఆలోచిద్దాం" అన్నాడు.

అందరూ కలిసి బైటికి వెళ్ళారు. కొంతమంది సిబ్బందిని వెంటపెట్టుకొని సైకిళ్ళమీద డ్యాన్సర్ల వీధికి బయలుదేరారు.

వాళ్ళంతా కాకా హోటలు దగ్గరికి వెళ్ళేసరికి ఎదురొచ్చారు ఐ.డి. కానిస్టేబుళ్లు. హెడ్డునూ పోలీసు సిబ్బందినీ చూసి ఆగారు.

"పిట్టలన్నీ గూళ్లలోనే వున్నాయా? " హెడ్డు కూడా ఆగి అడిగాడు వాళ్ళను.

"అసలు పిట్టలేదు" చెప్పారు.

"ఎక్కడికి వెళ్లింది? "

"సినిమాకు"

"ఏ సినిమాకు వెళ్లింది? "

"ఒక మొగుడు ముగ్గురు పెళ్ళాలు"

"ఒక్కతే వెళ్ళిందా? "

"లేదు. దిల్ ఖుష్, రోజా ఇద్దరూ కలిసి వెళ్ళారు"

"సరే! మీరు వెళ్ళి స్టేషన్ దగ్గర వుండండి. మేం వాళ్ళను పట్టుకొని స్టేషనుకు తెస్తాం" చెప్పాడు హెడ్డు.

ఐ.డి. కానిస్టేబుళ్ళు వెళ్ళిపోయారు. వాళ్ళు వెళ్లిన కొంచెం సేపటికి హెడ్డూ, పోలీసు బృందం అక్కడినుంచి సినిమా





హాలుకు వెళ్లింది.

అంతమంది పోలీసులు ఒకేసారి అలా రావటంతో అందరూ ఎక్కడివాళ్ళు అక్కడ నిలబడి ఆశ్చర్యంగా చూస్తున్నారు.

టీ స్టాలుముందు నిలబడి వున్న చైతన్య, పానకాలు తాగిన టీలకు బిల్లు చెల్లించి మరికొంచెం ముందుకు వెళ్ళి శేషయ్య బీడీ బంకు దగ్గర నిలబడి సినిమా హాలువేపే చూస్తున్నారు.

అప్పటికే కొంతమంది పోలీసులు హాలు లోపలికి వెళ్లి సినిమా చూస్తున్న దిల్ ఖుష్‌నూ, ఆమె వెంటవున్న నేరానికేమో రోజాను కూడా బలవంతంగా బైటికి తెచ్చి రిక్షాలో ఎక్కించారు.

రోజా చంకలో వున్న పాపాయి ఆ పెను గులాటకు నిద్ర చెదిరిపోయి గుక్కపెట్టి ఏడుస్తోంది.

"అరేయ్! రిక్షానుపోలీసు స్టేషనుకు పోనివ్వరా" అని రిక్షా అతనికి చెప్పాడు హెడ్డు.

రిక్షా ముందుకు కదిలింది.

"ఎంత అన్యాయం! ఎంత డ్యాన్సర్లయితే మాత్రం అలా బలవంతంగా స్టేషనుకు తీసుకొని వెళ్ళాలా? వాళ్ళను కూడా విడిచి పెట్టటంలేదంటే ఆ ఉసురు తప్పకుండా తగుల్తుంది" అన్నాడు జరిగిందానికి నొచ్చుకుంటూ శేషయ్య.

చైతన్య సంభ్రమంనుంచి అప్పుడే తేరుకున్నాడు. తలతిప్పి శేషయ్యవేపు చూస్తూ, "ఎవరు వాళ్లు?" అని అడిగాడు.

"డ్యాన్సర్లు. దిల్ ఖుష్, రోజా అనీ..." చెప్పాడతను.

చైతన్యకు జరిగింది ఏమిటో? అలా జరిగింది ఎందుకో వెంటనే అర్థమైపోయింది. దిల్ ఖుష్‌ను కాంక్షించినవాళ్ళు విసరిన వలలో ఆమె చిక్కుబడిపోయింది. ఆమె కాముకులకు లొంగని కారణంగా ఉద్యమం పేరిట జరిగిన కుట్రలో కూటికి గతిలేని నిర్భాగ్యురాలు రోజా కూడా ఇరుక్కుపోయింది.

చైతన్య ఆవేశంతో చలించిపోయాడు. మెరుపువేగంతో ముందుకు దూకి కదిలివెళ్తోన్న రిక్షాను రెండు చేతులలో హేండిల్ పట్టుకుని బలంగా ఆపాడు.

"ఎవడ్రా అది?" అని అరుస్తూ ముందుకు వచ్చాడు హెడ్డు.

"ఈ అమ్మాయిలను ఎందుకిలా బలవంతంగా తీసుకొని వెళ్తున్నారు?" అని అడిగాడు చైతన్య.

"నువ్వెవడివిరా అడగటానికి?" అని లాఠీతో బలంగా చైతన్య కాళ్ళమీద రెండు దెబ్బలు వేశాడు హెడ్డు.

మరికొంతమంది కానిస్టేబుళ్ళు కూడా లాఠీలు పైకెత్తారు అతడ్ని కొట్టేందుకు.

కానిస్టేబులు వీరాస్వామి అందరికన్నా వెనుకగా వస్తూ అప్పుడు చూశాడు ఆ దృశ్యాన్ని. చైతన్యను గుర్తుపట్టి హడావుడిగా ముందుకు వెళ్ళి అతడ్ని కొట్టబోతోన్న పోలీసులను వారించాడు.

"చైతన్యా! ఇదంతా మన సుధీర్‌కోసం చేస్తున్నపని. అతనూ నీ స్నేహితుడేకదా! అనవసరంగా జోక్యం చేసుకోకుండా నీ దారిన నువ్వు వెళ్లు" అని చెప్పాడు చైతన్య దగ్గరికి వెళ్ళి. సరిగ్గా అప్పుడే రోజా వడిలో వున్న పాపాయి ఏడుపు లంకించుకొంది. చైతన్య కళ్లు అగ్నిగోళాల్లా మారాయి. తీక్షణంగా చూస్తూ "ఇంత ఘోరం కళ్లముందు జరుగుతూంటే చూస్తూ వూరకుండటం జరిగేపని కాదు. మర్యాదగా వాళ్ళను విడిచిపెట్టండి. లేకపోతే ఏ అభియోగంమీద వాళ్ళను పట్టుకుపోతున్నారో అదైనా చెప్పండి. అంతవరకూ రిక్షా కదిలే వీలు లేదు" అంటూ చైతన్య మళ్ళీ తన రెండు చేతులతో రిక్షా హేండిల్ను బలంగా పట్టుకున్నాడు.

ఒక సామాన్య పౌరుడు అలా నడిబజారులో పోలీసులను ప్రశ్నించటం కలా? నిజమా? అన్నంత ఆశ్చర్యంగా చూస్తున్నారు దూరంగా నిల్చున్న జనం.

పానకాలు భయంతో ఒణికిపోతూ శిలా ప్రతిమలా నిలబడిపోయాడు. అతనికి ఏం చెయ్యాలో తోచలేదు.

చైతన్య అలా 'శాసనధిక్కారం' చెయ్యగానే హెడ్డుకు కోపం నషాళానికి అంటింది. అతని ఆజ్ఞలకోసమే ఎదురుచూస్తున్న పోలీసులకు సైగ చేశాడు.

కానిస్టేబుళ్ళ చేతుల్లో వున్న లాఠీలు మళ్ళీ గాలిలోకి లేచి రివ్వురివ్వున శబ్దం చేస్తూ చైతన్య శరీరానికి తాకుతున్నాయి.

అతని శరీరం అంతా ఆ లాఠీ దెబ్బలకు కదుములు కడుతూ అప్పటికప్పుడే బుస బుసా పొంగుతున్నాయి.

అయినా అతను రిక్షా హేండిల్ విడిచిపెట్టలేదు.

కానిస్టేబులు వీరాస్వామికి కూడా చైతన్య మీద చాలా కోపం వచ్చింది. జరిగేదంతా స్నేహితుడు సుధీర్‌కోసం అని చెప్పినా వినకుండా తననూ ఖాతరు చెయ్యకుండా అలా ప్రవర్తించినందుకు అతడ్ని అలా శిక్షించవలసిందే అనుకుని పక్కకు తప్పుకున్నాడు.

పోలీసులు చైతన్యను లాఠీలతో కొడుతూనే వున్నారు. ఆ దెబ్బలకు అతని శక్తి అంతా వుడిగిపోయింది. చేతులు పట్టుతప్పి రిక్షా హేండిల్ మీదినుంచి కిందికి జారాయి. తలకు తగిలిన గాయంనుంచి ధారగా రక్తం కారుతుంటే నెమ్మదిగా నేల మీదికి ఒరిగిపోయాడు.

హెడ్డుకు ఇంకా కోపం చల్లారలేదు. చైతన్యను బండ బూతులు తిడుతూ "స్టేషనుకు పద!" అని రిక్షావాడిని గద్దించాడు.

రోడ్డుమీద అచేతనంగా పడివున్న చైతన్యను తప్పించుకొంటూ రిక్షా ముందుకు కదలి వెళుతోంది.

రిక్షాలో వున్న రోజా, దిల్ ఖుష్ నిస్సహాయంగా చూశారు అతని వైపు. రిక్షా ముందు వెళుతుంటే దాని వెనుక సైకిళ్ల మీద పోలీసులూ వెళ్లిపోయారు.

అప్పుడు భయం నుంచి తేరుకొని హడావుడిగా చైతన్య దగ్గరికి వెళ్లి "చైతన్యా! చైతన్యా!" అని గట్టిగా రెండుసార్లు పిలిచాడు పానకాలు.

దూరంగా నిలబడి చూస్తున్న జనం దగ్గరికి వచ్చారు. చైతన్య చుట్టూ గుమికూడారు.

చైతన్యలో ఎలాంటి చలనమూలేదు. పానకాలుకు ఆందోళన ఎక్కువైంది. మనసులో పోలీసుల మీద ద్వేషం విపరీతంగా పెరిగిపోతోంది. కసితో, నిస్సహాయతతో నిలువెల్లా కంపించిపోతున్నాడు.

బీడీ బంకునుంచి ఆంజనేయులు కిందికి దూకాడు. పక్కనే వున్న టీకొట్టులోనుంచి ఓ గ్లాసు మంచినీళ్లు తీసుకొని చైతన్య దగ్గరికి వెళ్లి అతని ముఖంమీద నీళ్లు చిలకరించాడు.

చైతన్య నెమ్మదిగా కదిలాడు. కళ్లు తెరచి చూశాడు.

"కొంచెం మంచినీళ్లు తాగన్నా!" అన్నాడు ఆంజనేయులు.

పానకాలు చెయ్యిని ఆసరా చేసుకొని లేచి కూర్చున్నాడు చైతన్య. ఆంజనేయులు ఇచ్చిన గ్లాసు అందుకొని మంచినీళ్లు తాగాడు.

"మనం రిక్షాలో ఎక్కి రూముకు వెళ్దామా? తలకు గాయం కూడా తగిలింది. ఏదైనా ఆస్పత్రికి వెళ్లి డాక్టరుకు చూపించుకొని అప్పుడు వెళ్దామా?" అడిగాడు పానకాలు దుఃఖాన్ని దిగమింగుకొంటూ.

"అదంతా తరువాత చూద్దాంకానీ తక్షణం మనం పోలీసుల అకృత్యాలను అడ్డుకోవాలి. లేకపోతే దిల్ ఖుష్ జీవితం పాడవుతుంది. రోజాను కూడా వాళ్లు విడిచిపెట్టరు" అన్నాడు చైతన్య.

"మనం ఏం చెయ్యగలం! వాళ్ల చేతిలో అధికారం వున్నది. దానిని వాళ్లు మంచికి వినియోగించినా చెడుకు వినియోగించినా అడిగేవాళ్లు లేరు. ఎవరి కోసమో సాహసం




చేసి మీ బతుకులు పాడు చేసుకోకండి. అనుభవంతో చెబుతున్నాను" అని నచ్చచెప్పబోయాడు బీడీ బంకు శేషయ్య.

చైతన్య అతని మాటలను పట్టించుకో లేదు. పానకాలు వైపు చూస్తూ "నువ్వు వెంటనే పోలీసు స్టేషను దగ్గరికి వెళ్లు. ఏం జరుగుతున్నదో గమనించు. నేను మన కాలేజి హాస్టలుకు వెళ్తాను. వాళ్లనూ రూముల్లో వున్న స్టూడెంట్సునూ వెంట పెట్టుకొని వస్తాను. పోలీసు స్టేషను ముందు ధర్నా చేద్దాం. ఆడవాళ్లను విడి పిద్దాం" అని చెప్పి పానకాలు భుజంమీద చరిచాడు చైతన్య త్వరగా వెళ్లమని.

పానకాలు ఒక్కక్షణం ఆలోచించాడు. తనకు పోలీసులన్నా పోలీసు స్టేషన్లన్నా చాలా భయం. అలాంటిది తననే ముందుగా స్టేషను దగ్గరికి వెళ్లమని చెప్పాడు చైతన్య.

వెళితే ఏమౌతుందో తను చైతన్య స్నేహితుడని కానిస్టేబులు వీరాస్వామికి తెలుసు. అతను తనను గుర్తుపట్టి మిగిలిన పోలీసు సిబ్బందికి చెబితే వాళ్లు ఏం చేస్తారో!

అంతా అయోమయంగా వుంది.

అయినా అంతమంది జనం ముందు తన భయాన్ని వెల్లడి చెయ్యటానికి మనసు ఒప్పక "అలాగే వెళ్తాను. అక్కడ ఏమి జరుగుతున్నదో చూస్తూ వుంటాను. నువ్వు మన వాళ్లను వెంట పెట్టుకొని త్వరగా వచ్చేయ్" అని చెప్పి పోలీసు స్టేషను వైపుకు సాగిపోయాడు పానకాలు.

అతను వెళ్లిపోగానే చైతన్య కూడా నెమ్మదిగా లేచి వెళ్లి ఓ రిక్షాలో ఎక్కికూర్చొని "కాలేజి దగ్గరికి పోనివ్వు" అన్నాడు రిక్షా అతనితో.

రిక్షా కాలేజి వేపుకు కదలిపోయింది.

అక్కడ గుమికూడిన జనం ఎవరి దారిన వాళ్లు వెళ్లిపోయారు.

పానకాలు పోలీసు స్టేషను దగ్గరికి చేరుకున్నాడు. స్టేషను ముందున్న చింతచెట్టు చాటున నిలబడి లోపలికి తొంగి చూశాడు.

పోలీసు స్టేషను అంతా చాలా హడావుడిగా వుంది. దిల్‌ఖుష్‌నూ, రోజానూ వరండాలోనే ఓ మూలగా కూర్చుండబెట్టారు. వాళ్లకు కాపలాగా లేడీ కానిస్టేబులు రత్తమ్మను వుంచారు. హెడ్డూ, రైటరూ డాన్సర్లను స్టేషనుకు తెచ్చిన విషయం డి. ఎస్. పి దొరగారికి తెలియజేసి వారి తదుపరి ఆజ్ఞల కోసం ఎదురు చూస్తున్నారు.

అప్పటికే రాత్రి తొమ్మిది గంటలైంది. ముసురుకున్న చీకట్లు బాగా ముదిరాయి. ఆ చీకట్లలో పోలీసు స్టేషను మీద ఓ ఎర్ర బల్బు రాక్షసుడి కన్నులా మెరుస్తోంది.

పాపాయి గుక్కపట్టి ఏడుస్తోంది. దాని ఏడుపుకు స్టేషను ఆవరణ అంతా దద్దరిల్లి పోతోంటే "మధ్యలో ఈ పీడాకారం ఏమిటి? " అని విసుక్కున్నాడు హెడ్డు. డాన్సర్ల దగ్గర కాపలా కూర్చున్న కానిస్టేబులు రత్తమ్మను పిలిచి మందలించాడు. "ఇది పోలీసు స్టేషనా? కాన్పుల వార్డా? " అని అడిగి "ఆ దరిద్రగొట్టు ముండను ఏడుపు మాన్పించండి. అది డాన్సరు. పిల్లలనెలా సముదాయించాలో దానికి తెలియదంటే అర్థం వుంది. లేడీ కానిస్టేబులివి, నీకైనా జ్ఞానం వుండొద్దూ? దొరలు వచ్చే వేళయింది. వెళ్లి దాన్ని ఏడుపు మాన్పించు" అని చెప్పాడు కోపంగా.

కానిస్టేబులు రత్తమ్మకు అనవసరంగా మాటలుపడినందుకు చాలా బాధనిపించింది. వళ్లు మండిందికూడా! కానీ ఆమెకు అలా ఒళ్లు మండింది తనను తిట్టిన హెడ్డు మీదకాదు. అతగాడి కోపానికి కారణభూతమైన ఏడుపుల పాపాయిమీదా, దాన్ని కన్న రోజామీద!

విసురుగా గదిలోంచి బైటపడి రోజా దగ్గరికి వెళ్లింది. ఆమెవేపు అదోలా చూస్తూ "గుంటముండ అట్టా ఏడుస్తాంటే గుడ్లప్పగిచ్చి సూత్తాకూకుంటావేంటే" అని గద్దించి రోజా ఒడిలో వున్న పాపాయిని తన చేతు

ల్లోకి తీసుకుంది.

నాలుకను కలకత్తా కాళికలా బైటపెట్టి పెదాల అంచులకు తాకిస్తూ "ఒళ్లొళ్లొళ్లొళ్లా" అంటూ నోటితో శబ్దాలు చేసింది.

పాపాయి మరింత పెద్దగా ఏడుపు లంకించుకుంది.

దిల్‌ఖుష్ తల ఎత్తి చూసింది రోజా వైపు. అప్పటికే ఆమె హృదయం గడ్డకట్టి బాధ, ఆవేదనల ఆవలి అంచున చేరి భావ రహితంగా చూస్తూ కూర్చుంది మరబొమ్మలా.

దిల్‌ఖుష్ మౌనంగా తల దించుకుంది.

పాపాయి అలా ఏడుస్తూంటే కానిస్టేబులు రత్తమ్మకు ఏం చెయ్యాలో అర్థం కాలేదు. ఇంకా ఏడుపు అలా వినిపించిందంటే హెడ్డు ఎంత మాత్రం సహించడు. తనను దండిస్తాడు. ఆ దండన పరమ నీచాతి నీచమైన బూతులతో వుంటుంది. అంతేకాదు ఏ క్షణాన అయినా దొరలు స్టేషనుకు వస్తారని చెప్పాడు హెడ్డు. వాళ్లు వచ్చినప్పుడు కూడా పాపాయి ఏడుపు వినిపిస్తే వాళ్లు వూరుకోరు ఎలా?

రత్తమ్మ ఆలోచించింది. ఎస్సై దొరగారు వచ్చినా పరవాలేదు. తనేమిటో తన బుడకోళ్ల వ్యవహారం ఏమిటో! అధికారులకు విందులూ వినోదాలూ ఎలా సమకూర్చాలో అంతేగానీ ఇలాంటి స్వల్పమైన విషయాలను అసలికి పట్టించుకోడు.

సిఐ దొరగారూ దర్మరాజే! రికవరీ బంగారంలో వాటా ఎంత వచ్చింది? కోర్టుదాకా వెళ్లకుండా ఏ కేసును ఎలా సెటిల్ చేస్తే ఎంత లాభం దక్కుతుంది? అన్న విషయాలు తప్ప ఎవరి ఏడుపులనూ వారు లెక్కచెయ్యరు.

ఎటొచ్చీ డిఎస్పీ దొరగారితోనే వున్నది పేచీ అంతా! మనిషి మహా స్ట్రిక్టు! కాలం కలసిరాక కానిస్టేబుళ్ల మధ్య ఇండియాలో వున్నానుగానీ నా టాలెంటుకు స్కాట్లాండు పోలీసు అధికారిని కావాల్సిన వాడ్నని దొరసానిగారు వినకుండా ఆయన చాలాసార్లు అంటూ వుంటారు. ఆయనగారే ఒక లా అండ్ ఆర్డరయితే ఆ లా అండ్ ఆర్డరుతో ఆడాళ్ల హక్కులను కాపాడుతూ తన ఆనం దాన్ని వాళ్లకు పంచటం దొరగారి జీవిత ధ్యేయం!

అంత కమిట్‌మెంటుతో విధులు నిర్వహించే డిఎస్పీ దొరగారు పాపాయి అలా గుక్కపట్టి ఏడిస్తే ఎలా సహిస్తారూ! పాపాయిని బైటనే వదిలేసి రోజాను మాత్రమే స్టేషనుకు ఎందుకు తీసుకొని రాలేదు? అని తప్పకుండా కోపగించుకుంటారు.

రత్తమ్మ అటూ ఇటూ చూసింది. పక్కనే టీ తాగి ఎవరో గోడ పక్కన పెట్టిన ఖాళీ గ్లాసు కనిపించింది. ఆ గ్లాసులో అడుగున కొంచెం టీ వుంది.

"వీరాస్వామీ! కొంచెం ఈడకొస్తావా?" అని దూరంగా నిలబడి గూనోడి విషయం ఏం చెయ్యాలా? అని ఆలోచిస్తూ నిల్చున్న వీరాస్వామిని దగ్గరికి పిల్చింది.

వీరాస్వామి అక్కడికి వెళ్లి "ఏమిటి?" అని అడిగాడు రత్తమ్మను దిల్‌ఖుష్ వైపు ఓరగా చూస్తూ.

రత్తమ్మ అతడి చేతిలోంచి లాఠీ అందుకున్నది. లాఠీ పొన్నును ఎంగిలి టీలో ముంచింది. దానిని పాపాయి పెదాలకు తాకించింది.

ఆ స్పర్శకు అమాంతం ఏడుపు ఆపి ఆబగా తన లేత పెదాలతో లాఠీ పొన్నును చీకుతూ పాల రుచికన్నా భిన్నంగా వున్న టీ రుచికి ముఖాన్ని వికారంగా పెట్టింది పాపాయి.

రోజా, దిల్‌ఖుష్ నిస్సహాయంగా చూస్తున్నారు. కానిస్టేబులు వీరాస్వామి రత్తమ్మ తెలివి తేటలకు అబ్బురపోయాడు. లాఠీ పొన్నును తల్లి స్తన్యంలా పాపాయిని నమ్మించి దగా చెయ్యగలిగినందుకు గర్వంగా చూస్తోంది లేడీ కానిస్టేబులు రత్తమ్మ.




సరిగ్గా అదే సమయంలో పోలీసు స్టేషను ముందు జీపు ఆగింది. ఎస్సై, సిఐ ఇద్దరూ జీపు దిగి స్టేషన్లోకి వెళ్లారు. ఎవరి గదిలో వాళ్లు కూర్చున్నారు.

"సార్! దిల్ ఖుష్ కోసం వెళితే దాని పక్కనే రోజా కూడా వుంది. రోజాను విడిచిపెట్టి ఒక్క దిల్ ఖుష్‌ను మాత్రమే స్టేషనుకు తెస్తే అనుమానం వస్తుందని దాన్ని కూడా తెచ్చాం" సిఐ గదిలోకి వెళ్లి అతనితో చెప్పాడు హెడ్డు.

"మంచిపని చేశావ్! ఇవాళ మా ఇంట్లో మీ అమ్మగారు కూడా లేదు. పిల్లల్ని వెంట పెట్టుకొని పెళ్లికి వెళ్లింది. నేనూ వెళ్లేవాడినే గానీ దిల్ ఖుష్ విషయం తేల్చి వెళ్లమన్నారు డిఎస్‌పి దొరగారు. అందుకోసం ఆగాను. అదీ ఒకవిధంగా మంచిదే అయింది" అని హెడ్డు వైపు చూస్తూ నర్మగర్భంగా నవ్వాడు సిఐ.

హెడ్డు కూడా ముసిముసిగా నవ్వి "సార్! మా డ్యూటీ ఏమిటో చెబితే త్వరగా ముగించుకొని ఇళ్లకు వెళ్తాం. ఏం చెయ్యమంటారో చెప్పండిసార్" అని అడిగాడు వినయంగా.

"ఎందుకయినా మంచిది! డాన్సర్ల దగ్గర సంతకాలు తీసుకొని అఫిషియల్‌గా రికార్డు తయారు చెయ్యండి. ఇక డాన్సులు చెయ్యం అని వాళ్లనుంచి హామీ పత్రాలు రాయించుకొని ఫైల్ చెయ్యండి. వాళ్లను స్టేషనుకు ఎందుకు తెచ్చారని ఎవరైనా అడిగితే ఆ ఫైలు చూపించవచ్చు. ఇది కేవలం ముందు జాగ్రత్త కోసమే" అని హెడ్డు ముఖంలోకి చూశాడు సి.ఐ.

వినయంగా తల ఆడించాడు హెడ్డు అలాగే అన్నట్టు.

"దిల్ ఖుష్‌ను డి.ఎస్.పి దొరగారే స్వయంగా విచారిస్తారట"

"ఎక్కడ సార్? స్టేషన్లోనేనా? " అడిగాడు హెడ్డు.

"కాదు దొరగారి బంగళాలో"

"దొరసానిగారువుంటారుకదా సార్? "

"లేరు.. ఊరికి వెళ్లారు"

"మరి రోజాను ఏం చేద్దాం సార్? "

"దాన్ని నేను విచారిస్తాను. ఇక మీరు వెళ్లి దిల్ ఖుష్ ఇంటరాగేషన్ ఏర్పాట్లు చెయ్యండి. జీపులో దాన్ని దొరగారి బంగళాకు పంపించండి. ఆ తర్వాత అదే జీపులో నేను ఇంటికి వెళ్తాను" చెప్పాడు సి.ఐ.

హెడ్డు సి.ఐ దొరగారికి సెల్యూట్ చేశాడు. హడావుడిగా బైటికి వెళ్లి ఇద్దరు కానిస్టేబుళ్లను దగ్గరికి పిలిచి వాళ్లకు రహస్యంగా ఏదో చెప్పాడు.

కానిస్టేబుళ్లు తలలు వూపారు. టోపీలు సరిచేసుకొని ఇద్దరూ దిల్ ఖుష్ దగ్గరికి వెళ్లి "వెళ్దాం పద" అన్నారు అధికారం ధ్వనించిన గొంతుతో.

"ఎక్కడికి? అసలు నన్నెందుకు తెచ్చారు? " అడిగింది దిల్ ఖుష్.

కానిస్టేబుళ్లు ఇద్దరూ ఒకళ్లవైపు ఒకళ్లు చూసి నవ్వుకున్నారు.

అప్పటిదాకా లాఠీ పొన్నునే తల్లి స్తనం అనుకున్న పాపాయి లేడీ కానిస్టేబులు చేసిన దగా తెలుసుకున్నట్టుంది. పెదాలూ, నాలుకా మంటలుపుట్టి కాబోలు అమాంతం ఏడుపు లంకించుకుంది.

కానిస్టేబుళ్లు దిల్ ఖుష్‌ను ఎక్కడికో తీసుకొని వెళ్లే సన్నాహంలో వున్నారని తెలుసుకున్న రోజా ఏం జరగబోతున్నదో అన్న ఆందోళనతో వుంది అప్పటికే. దానికి తోడు పాపాయి అలా ఏడుపులకు లేవటంతో నిస్పృహాయతలో గత్యంతరం లేక తిరగబడే ఒక స్త్రీమూర్తీ, కన్న పేగుకు కళ్లముందే కష్టం వస్తే సహించలేక ఎదురు తిరిగే ఒక మాతృమూర్తీ ఆమెలో నిద్రలేచారు.

ప్రభంజనంలా లేచింది రోజా. దిల్ ఖుష్ చెయ్యి పట్టుకొని పైకి లేపబోతోన్న కానిస్టేబుళ్లను అడ్డుకొంటూ "మమ్మల్ని స్టేషనుకు ఎందుకు తెచ్చారో చెప్పండి. మేం చేసిన నేరం ఏమిటో చెప్పండి. మావల్ల తప్పు

ఏదైనా వున్నదంటే కేసులు పెట్టి కోర్టుకు పంపించండి. విచారించి వాళ్లే శిక్షలు వేస్తారు. అంతేగానీ ఇలా అధికార మదంతో మామీద జులుం చెయ్యకండి" అని దిల్‌ఖుష్ చుట్టూ తన రెండు చేతులతో పెనవేసుకొని కవచంలా నిలబడి "మా దారిన మేము సినిమా చూస్తుంటే వచ్చి స్టేషనుకు రమ్మంటే కాదనకుండా వచ్చాం. చట్టాన్ని గౌరవించాలని మాకూ తెలుసు. అదే చట్టాన్ని మీరూ గౌరవించాలికదా! మా హక్కులను, స్వేచ్ఛనూ ఇలా హరించటం అన్యాయం. దిల్‌ఖుష్‌ను ఏం చెయ్యబోతున్నారో అంతా తెలుసు నాకు. అలా జరగటానికి వీల్లేదు" అని అరిచింది రోజా పెద్దగా.

తల్లి గొంతు గుర్తుపట్టి పాపాయి ఇంకా బిగ్గరగా ఏడవసాగింది. దాని ఏడుపులూ, రోజా అరుపులూ, దిల్‌ఖుష్ మౌన రోదనలూ పోలీసు స్టేషను అంతా నరకంలా వుంది.

ఎస్సై విసుగ్గా చెక్కల గదిలోనుంచి బైటికి వచ్చి కానిస్టేబుళ్లను మందలించబోయి ఎందుకో ఆగాడు. స్టేషన్లో సి.ఐ దొరగారు కూడా వున్నారు గనుక తన జోక్యం అనవసరం అనుకున్నారేమో కానిస్టేబులు వీరాస్వామిని దగ్గరికి పిలిచి "గదిలో వున్న బుడకోళ్లను జీపులో పెట్టు" అని ఆజ్ఞాపించాడు.

"ఎందుకు సార్!" అడిగాడు వీరాస్వామి.

"కాకా హోటల్లో కూర వండించాలి. డి.ఎ స్.పి దొరగారికీ సి.ఐ దొరగారికీ పంపించి మిగిలింది మా ఇంటి దగ్గర పెట్టి వస్తాను"

"జీపు తీసుకొని వెళ్లటం కుదరదు సార్!"

"ఎందుకని?"

"సి.ఐ గారు వెళ్తారా జీపులో"

"మరేం చెయ్యాలి!" అడిగాడు ఎస్సై అయోమయంగా చూస్తూ.

"రిక్షా పిలవనా సార్?"

"ఏం చేస్తాం! అలాగే కానివ్వు" అన్నాడు క్షణం తర్వాత.

కానిస్టేబులు వీరాస్వామి బైటికి వెళ్లి రిక్షా పిలుచుకొని వచ్చాడు. ఎస్సై దొరగారి చెక్కల గదిలో వున్న మూడు బుడకోళ్లను రిక్షాలోకి ఎక్కించి "రిక్షా రెడీసార్" అని చెప్పాడు.

"నేను వెళ్తున్నాను. స్టేషన్ జాగ్రత్త" అని అందరినీ ఒకసారి హెచ్చరించి రిక్షాలో ఎక్కి వెళ్లిపోయాడు ఎస్సై బుడకోళ్లతో సహా.

స్టేషను ముందు చింత చెట్టుకింద నిలబడి అక్కడ జరుగుతున్నది గమనిస్తున్న పానకాలు గుండె వేగంగా కొట్టుకోసాగింది. ఒళ్లంతా చెమటలు పట్టాయి. తల ఎత్తి దిల్‌ఖుష్, రోజాల వైపు చూశాడు.

దిల్‌ఖుష్‌ను కానిస్టేబుళ్లు బైటికి తీసుకొని వెళ్లబోతే అడ్డుకున్నది రోజా. అనరాని మాటలు అని అధికారానికి ఎదురు తిరిగింది.

కానిస్టేబుళ్లు కోపంతో రెచ్చిపోతూ ముందుగా రోజాను విసురుగా అవతలికి తోసి దిల్‌ఖుష్ రెక్కపట్టుకొని బరబరా ఈడ్చుకొంటూ తీసుకొని వెళ్లి జీపులో కుదేశారు.

వీరాస్వామి ఆ దృశ్యం చూసి నవ్వుకున్నాడు. అతనికప్పుడు సుధీర్ గుర్తొచ్చాడు. అతనికోసం జరిగిందే అదంతా! కానీ ఫలితం మాత్రం దొరగారికి దక్కబోతోంది తప్ప సుధీర్‌కు కాదు. అతను ఏమంటాడో!

అయినా ఒక మంచిదాన్ని చెడగొట్టటమే కష్టం. చెడిపోయిన తరువాత చేరదియ్యడం ఎవరికయినా అంత కష్టం కాదు. దొరగారు ఆమెను చెడగొట్టి వీధిలో వేశాక సుధీర్ పని సులువవుతుంది. అతని కోర్కె తేలిగ్గా నెరవేరుతుంది.

సుధీర్ ఒకవేళ జరిగిందానికి కోపం తెచ్చుకుంటే అతనికి అలా చెప్పి శాంతపరచాలని మనసులో అనుకున్నాడు కానిస్టేబులు వీరాస్వామి.





సరిగ్గా అప్పుడే పాపాయి ఏడుపు విని పించి సి.ఐ దొరగారు తమ గదిలోనుంచి బైటికి వచ్చారు. గుమ్మం దగ్గర నిలబడి వరండాలోకి తొంగిచూశారు.

పాపాయిని ఏడవకుండా లేడీ కానిస్టే బులు రత్తమ్మ సముదాయిస్తుంటే ఇద్దరు కానిస్టేబుళ్లు అప్పుడే రోజాను అవతలికి నెట్టి దిల్‌ఖుష్‌ను జీపులో ఎక్కించారు. రోజా కిందకు తూలిపడిపోయిందల్లా లేచి నిలబడి పెద్దగా అరుస్తోంది.

"అరేయ్ ఎవడ్రా అక్కడ!" కేకవేసి పిల్చారు సి.ఐ దొరగారు.

"ఏం కావాలి సార్?" వెళ్లి దొరగారి ఎదు రగా నిలబడి చాలా వినయంగా అడిగాడు హెడ్డు.

"దాన్ని త్వరగా పెద్ద దొరగారి బంగ ళాలో దించి జీపు తీసుకొని డ్రయివర్ని వెంటనే రమ్మని చెప్పు!"

"అలాగే సార్!" అని హెడ్డు స్టేషను ముందున్న జీపు దగ్గరికి వెళ్లాడు. డ్రయివ రుతో ఏదో చెప్పాడు.

క్షణంలో జీపు కదలి వేగంగా డి.ఎస్.పి దొరగారి బంగళా వైపుకు దూసుకొని పోయింది.

సి.ఐ పరీక్షగా అప్పుడు చూశాడు రోజా వైపు! పేదరికంవల్ల భద్రతలేని జీవితం ప్రసాదించిన దిగుళ్లవల్ల క్షీణించిపోతూన్నా ఇంకా ఆమె ముఖంలోని కాంతి పూర్తిగా క్షీణించి పోలేదు. వృత్తిపరమైన అలవా టుతో శరీరం ఇంకా ఒంపులు తిరుగుతూనే వుంది. లావణ్యం కొడిగట్టి పోలేదు పూర్తిగా. ఆమె ఎండకు కమిలిన రోజా పువ్వులాగే వుంది.

సర్వీసులో ఎన్నో అందాలను, ఆనందా లనూ చూసిన సి.ఐ దొరగారికి రోజా వెరైటీగా వుంటుందనిపించింది. "జీపు తిరిగి రాగానే దాన్ని ఎక్కించి నాకు చెప్పండి. త్వరగా వెళ్లాలి. ఇంట్లో ఎవ్వరూ లేరు. అసలే దొంగల భయంగా వుంది" అని మళ్లీ తన గదిలోకి వెళ్లి కుర్చీలో కూర్చు న్నాడు.

కానిస్టేబులు వీరాస్వామికి దొరగారి మాటలు వినిపించాయి. వారు దొంగల భయంగా వుంది అనగానే అతనికి గూనోడు గుర్తొచ్చాడు. వాడు తన జేబు కొట్టేసినందుకు ఎలాంటి శిక్ష వెయ్యాలో తర్వాత ఆలోచిద్దామని అన్నాడు హెడ్డు.

సి.ఐగారు రోజాను వెంటపెట్టుకొని వెళ్లి పోతే రైటరూ హెడ్డూ తనూ కలసి గెస్టు హవుసుకు వెళ్లాలి. సుధీర్ వస్తే సరే! లేక పోతే అతనికి కబురు పెట్టాలి. అలా ఆలో చిస్తూ నిల్చున్నాడు వీరాస్వామి.

సి.ఐ దొరగారు గుమ్మం దగ్గర నుంచి కదిలి లోపలికి వెళ్లేదాకా ఏడుపు వినిపించ కుండా పాపాయి ముఖాన్ని తన పొట్టకు అదిమిపట్టి వుంచింది రత్తమ్మ. గాలి పీల్చు కునేందుకు మధ్యమధ్యలో అవకాశం కల్పిస్తూ కూర్చుంది. దొరగారు లోపలికి వెళ్లగానే పాపాయిని భుజంమీదికి ఎత్తుకొని బాగా గాలి తగలాలని బైటికి తీసుకొని వెళ్ల బోయింది.

"నా పాపాయిని నాకు ఇవ్వు" వస్తూన్న ఏడుపును నిగ్రహించుకొంటూ అడిగింది రోజా.

లేడీకానిస్టేబులు రత్తమ్మ అదోలా నవ్వి ఏదో అనబోయి కానిస్టేబుళ్లను చూసి ఆగింది.

జీపు దొరగారి బంగళానుంచి తిరిగి వచ్చే దాకా కానిస్టేబుళ్లకు పనిలేదు. ఆలోగా సిగ రెట్లు కాల్చుకొని వద్దామని ఇద్దరూ స్టేషను బైటికి వెళ్లారు.

పాపాయిని అప్పుడు రోజా చేతులకు అందించింది రత్తమ్మ. పాపాయి తల్లి స్తనా లను వెదుకుతూ లేత చేతులతో ఆమె గుండెమీద తడుముతూంటే మళ్లీ నవ్వింది రత్తమ్మ. ఆ నవ్వులో ఎంత విషాదం ధ్వనించిందో!

"ఎంత పోలీసునైనా నేనూ ఆడకూతు

ర్నేనే! నీ పాలగుబ్బలు ఎండిపోయినయ్యని తెల్సు నాకు. అందుకే గుంటదానికి ఎంగిలి టీ పట్టినాను. దాని ఏడుపు దొరలు వింటే నన్ను పోలీసు బూతులు తిడతారు. వాటికి ఎంత అలవాటు పడ్డా రేత్తిరిళ్లు ఆ బూతులు గుర్తొస్తే నిదరపట్టదు. ఏడుపొస్తది. నీ కోసం నీ బిడ్డ కోసం నేనేంటికి యాడవాలి? ప్రెతి అడ్డాల ఎదవలతో మాటెందుకు పడాలి. అందుకు గసిర్నాను గానీ నీ మీద కోపంతోగాదు!"అంది రత్తమ్మ.

రోజా ఆమెవైపు జాలిగా చూసింది. "అక్కా! పాలసీసా ఇంటిదగ్గరుంది. ఒక స్సారి కడుపునిండా పాలు తాగిస్తే పిచ్చి ముండ మళ్లీ నాలుగు గంటలదాకా గొడవ చెయ్యదు. డాన్సు చూద్దామని దానికి పాలు తాగించి ఎత్తుకొని దిల్ ఖుష్‌తో కలసి సినిమాకు వెళ్లాను. మధ్యలోనే పోలీసులు వచ్చి మా ఇద్దర్నీ స్టేషనుకు తెచ్చారు. చాలాసేపైంది. ఆకలికి అది ఏడుస్తోంది. ఏం చెయ్యనూ? " అని అడిగింది.

లేడీ కానిస్టేబులు రత్తమ్మ రోజావైపు ఎగాదిగా చూస్తూ ఏదో పెద్ద బూతు మాట అనబోయి ఎందుకో ఆగి ఫక్కుమని నవ్వింది. "మామూలుగా మాట్లాడదామన్నా నోటికి బూతులే వస్తాయి. అట్టా అలవాటైంది డ్యూటీలో. ఏం చేస్తాం" అని దీర్ఘంగా ఓ నిట్టూర్పు విడిచింది.

"ఇంకా ఎంతసేపు వుండాలి నేను పోలీసు స్టేషన్లో? దిల్ ఖుష్‌ను ఎక్కడికి తీసుకొని వెళ్లారు? " నెమ్మదిగా అడిగింది రోజా.

"దాన్ని పెద్దపులి బోన్లోకి ఎత్తకెళ్లారు. నిన్ను చిరతపులి బోన్లోకి పంపిస్తారు. ఎంతసేపు వుండాలి? అంటే ఏం చెప్పనూ! ఏలినవారి ఇష్టం నీ అదృష్టం. అంతే" అని రత్తమ్మ తన మాటలను ఎవరైనా వింటున్నారా అని తల తిప్పి చుట్టూ చూసింది.

వరండాలో ఎవ్వరూలేరు. హాయిగా గాలి పీల్చి ఒదిలింది.

"పాపాయి ఆకలికి ఇక వుండలేదు. నువ్వు లారీతో నాకించిన ఎంగిలి టీ వల్ల కొంచెం కునుకు తీస్తున్నదిగానీ ఎంతోసేపు అలా నిద్రపోదు. లేచిందంటే గుక్కపట్టి ఏడుస్తుంది. త్వరగా ఒదలిపెట్టించవూ? " అని అడిగింది రోజా.

"నిన్ను తొందరగా వదిలిపెట్టించటం నా వల్ల జరిగేదికాదు గానీ పాపాయి విషయమే ఆలోచిస్తున్నాను ఎలాగా అని. మా దున్నలకి అస్సలు జ్ఞానం అన్నదే వుండదు. ఎంతోమంది ఉసురుపోసుకుంటున్నా బాధనిపించలేదుగానీ ఈ గుంటముండదే బాధనిపిస్తుంది. జీపు రాగానే చిరతపులి నిన్ను తీసుకుపోతుంది. నీతో పాపాయి వుండే వీల్లేదు. దాని యవ్వారం అంతా నువ్వొచ్చేదాకా నన్నే చూస్కోమని ఆర్డరేస్తుంది చిరతపులి. ఏం చెయ్యాలి? "

"నన్ను ఎక్కడికి తీసుకొని వెళ్తారు? ఏం చేస్తారూ? " అమాయకంగా అడిగింది రోజా.

అంత చెప్పినా ఇంకా అర్థం చేసుకోలేని ఆడవాళ్లుంటారా? అన్నంత ఆశ్చర్యంగా రోజావైపు చూసింది లేడీ కానిస్టేబులు రత్తమ్మ! చిరాకుగా ముఖంపెట్టి "నువ్వసలికి మనిషివేనా! నువ్వొచ్చింది పోలీసు స్టేషనుకు. నిన్ను తెచ్చింది పోలీసోళ్లు. నిన్ను కావాలనుకుంది చిరతపులి. చెప్పాను కదా! ఆడ పెద్దపులికి దిల్ ఖుష్, ఈడ చిరతపులికి నువ్వూ బలికావాలంతే. అప్పుడు మాత్రమే ఇడిచిపెడ్తారు మిమ్మల్ని" అని గారపళ్లు కనిపించేలా వికృతంగా నవ్వింది.

చిన్న జంతువును పెద్ద జంతువు హింసించి చంపి ఆకలి తీర్చుకోవటం అరణ్యాల్లో ఎంత సహజమో ఈ జనారణ్యంలో పై అధికారులు తనవంటి బడుగు ఉద్యోగులనూ, అందునా ఆడవాళ్లనూ అంతే హింసించి క్షణక్షణం చంపుతూ వుండటం అంతే సహజం అన్నంత నిర్లిప్తంగా





చూసింది లేడీ కానిస్టేబులు రత్తమ్మ తను చెప్పిందానికి బెంబేలు పడుతున్న రోజాను చేత్తో భుజం తట్టి.

"అట్లా భయపడమాకే ఎర్రిదాన! నేనూ తొలిసారి అట్టాగే భయపడ్డాను. ఉజ్జోగం దొరికిందిగదా హాయిగా బతుకుతూ చాతనైనంత సాయం అందరికీ చేద్దామనుకున్నాను. డ్యూటీలో చేరిన రోజు రాత్రే చిరతపులి పట్టుకుంది. మంచిగా బతకాలన్న మనిషి ఆశకూ జరిగేదానికీ సంబంధంలేదని ఆ రాత్రే తెలిసిపోయింది. శానా రోజులు ఏడ్చాను. యాడవటం అనవసరం అని తెలుసుకొని నిమ్మళంగా ఏడుపు మానేశాను. బతుకు తీరే అట్టా మారినప్పుడు మనమేం చెయ్యగలం? మనసు చంపుకోవాలంతే" అని రత్తమ్మ ఎందుకో తల తిప్పి బైటికి చూసింది.

డి.ఎస్.పి దొరగారి బంగళా నుంచి వచ్చిన జీపు వాకిట్లో ఆగింది అప్పుడే. కానిస్టేబుళ్లు నవ్వుకుంటూ కిందికి దిగి స్టేషన్లోకి వెళ్లారు.

"దిల్ ఖుష్ సెటిలైనట్టేనా? " వెకిలిగా నవ్వుతూ ఓ కానిస్టేబులును అడిగాడు వీరాస్వామి.

"ఓ నిక్షేపంగా. ఈ రాత్రంతా దొరగారి బంగళా అంతా గానా బజానాలతో కళకళ్లాడుతుంది" అని నవ్వాడతను.

ఎవరో వెళ్లి జీపు వచ్చిన విషయం సి.ఐ దొరగారికి చెప్పారు.

"త్వరగా వెళ్లాలి. దాన్ని జీపులో ఎక్కించండి. క్విక్" అని కుర్చీలోంచి లేచాడు సి. ఐ.

కానిస్టేబుళ్లు వరండాలోకి వెళ్లారు. రోజా, కానిస్టేబులు రత్తమ్మ కూర్చున్న చోటు దగ్గరికి వెళ్లి "యాయ్ రోజా! పద పద జీపులో ఎక్కి సి.ఐ దొరగారి వెంట వెళ్లాలి" అని లాఠీతో రోజా ఛాతీమీద సుతారంగా పొడిచాడో కానిస్టేబులు.

"ఎక్కడకి వెళ్లాలి? " భయంతో ఒణుకుతూ అడిగింది.

"ఇంటరాగేషన్‌కి" అని వెకిలిగా నవ్వారు వాళ్లంతా.

"రోజా ఇంటరాగేషన్ పూర్తయి వచ్చే దాకా పాపాయిని చూస్తూ వుండు" రత్తమ్మతో చెప్పాడు హెడ్డు.

రత్తమ్మ లేచి పాపాయిని ఎత్తుకొని వరండా మెట్లు దిగి బైటికి వెళ్లింది.

పోలీసుల ఇనప నాడాల బూట్ల శబ్దానికీ, కరకుగా వినిపిస్తున్న వాళ్ల మాటలకీ పాపాయి నిద్రలేచింది. తను వున్నది తల్లి ఒడిలో కాదని గ్రహించి పెద్దగా ఏడుపు లంకించుకుంది మళ్లీ.

ఆ ఏడుపు సి.ఐ. దొరగారికి వినిపించకుండా వేగంగా నడుస్తూ ఎదురుగా వున్న చింతచెట్టు దగ్గరికి వెళ్ళింది రత్తమ్మ. అక్కడ నిలబడి భయంభయంగా పోలీసు స్టేషన్లోకి తొంగిచూస్తున్న పానకాలు కనిపించాడు.

"ఎవరు నువ్వు? ఎందుకు నిలబడ్డావిక్కడ? " అని అడిగింది.

పానకాలు కంగారు పడ్డాడు. గొంతు పెగల్చుకొంటూ ఏదో చెప్పబోయి దూరంగా ఏవో అరుపులు వినిపించి అటువైపు చూశాడు.

రత్తమ్మ కూడా చివాలున తల ఎత్తి దూరంగా చూసింది!

చాలామంది విద్యార్థులను వెంటపెట్టుకొని వస్తూ కనిపించాడు చైతన్య. వాళ్ళందరూ పోలీసుల జులుంకు వ్యతిరేకంగా నినాదాలు చేస్తూ చాలా ఆవేశంగా స్టేషను వైపుకు దూసుకొని వస్తున్నారు.

రోజాను లాఠీలతో నెడుతూ స్టేషను గేటుదాకా వచ్చిన కానిస్టేబుళ్ళూ, ఆమెను జీపులో ఎక్కించుకొని వెళ్ళేందుకు బయల్దేరిన సి.ఐ. ఆ దృశ్యాన్ని చూసి ఒక్కక్షణం నిర్ఘాంతపోయారు.

విద్యార్థుల నినాదాలు ఇప్పుడు చాలా స్పష్టంగా వినిపిస్తున్నాయి. వాళ్ళంతా

రోజా, దిల్ ఖుష్ విషయంలోనే ఆగ్రహావేశాలతో వస్తోన్నారని గ్రహించారు పోలీసులు.

ఇప్పుడు ఏం చెయ్యాలి? అని ఆలోచించాడు సి.ఐ.

ఒకవేళ పరిస్థితి చెయ్యిదాటిపోతే డ్యాన్సర్లను సుధీర్ బృందం యిచ్చిన రిపోర్టుమీద విచారించేందుకు తెచ్చామని చెప్పవచ్చు కానీ వాళ్ళు 'దిల్ ఖుష్ ఏది?' అని అడిగితే యిబ్బంది! రోజాను యిక్కడా దిల్ ఖుష్‌ను అక్కడా విచారిస్తున్నామని చెబితే చాలా అసంబద్ధంగా వుంటుంది. ఎవ్వరూ నమ్మరు.

బలప్రయోగంతో వాళ్ళను చెల్లాచెదరు చెయ్యటం మినహా ప్రమాదంనుంచి బయటపడేందుకు మరోమార్గం లేదన్న నిర్ణయానికి వచ్చి స్టేషన్లో వున్న సిబ్బంది మొత్తాన్నీ అలర్టు చేశాడు సి.ఐ.

అలాంటి పరిస్థితిలో తను పాపాయిని ఎత్తుకొని అలా లాలిస్తూవుంటే అధికారులు క్షమించరని, స్టేషనుకు రక్షణగా వెళ్ళకపోతే శిక్షిస్తారనీ కానిస్టేబులు రత్తమ్మకు తెలుసు.

అంతకంతకూ విద్యార్థుల గుంపు స్టేషన్ను సమీపిస్తోంది. కొంతమంది పోలీసులు లాఠీలతోనూ, కొంతమంది తుపాకులతోనూ సిద్ధంగా వున్నారు అప్పటికే. సి.ఐ. వాళ్ళకు ఏవో ఆదేశాలు యిస్తూ వున్నాడు. అక్కడ క్షణాలలోనే వాతావరణం మారిపోయింది. పూర్తిగా ఉత్కంఠ నెలకొంది.

లేడీ కానిస్టేబులు రత్తమ్మ చివాలున తన చేతిలో వున్న పాపాయిని పానకాలు చేతికి అందించింది. అతను చాలా యాంత్రికంగా పాపాయిని చేతుల్లోకి తీసుకొని ఏమీ అర్థం కానట్టు ఆమెవేపు చూశాడు.

"పాపాయిని తీసుకొని దూరంగా వెళ్ళు వాళ్ళు రాళ్ళు విసిరినా, మా వాళ్ళు లాఠీలు ఝళిపించినా తగిలేది సంబంధంలేనివాళ్ళకే! చిన్నదెబ్బ తగిలినా పాపాయి తట్టుకోలేదు. దాన్ని దూరంగా తీసుకొని వెళ్ళి గొడవ తగ్గింతర్వాత తెచ్చి నాకు యివ్వు" అని హడావుడిగా స్టేషను లోపలికి పరుగెత్తుకొంటూ వెళ్ళింది రత్తమ్మ. లాఠీ అందుకొని బైటికి వచ్చి యితర లేడీ కానిస్టేబుళ్ళ మధ్యన నిలబడి 'డ్యూటీకి' సన్నద్ధమైంది.

"అందరూ వెంటనే వెళ్ళిపోండి. పోలీసు స్టేషను దగ్గర యిలా గొడవచేస్తే లా అండ్ ఆర్డరు ఒప్పుకోదు. లాఠీలకు పని కల్పిస్తాం. అనవసరంగా దెబ్బలు తినకుండా అందరూ వెళ్ళిపోండి" అని పరిసరాలు ప్రతిధ్వనించేలా పెద్దగా అరిచాడు సి.ఐ. దగ్గిరికి వచ్చిన విద్యార్థులతో.

వాళ్ళు మరింత బిగ్గరగా నినాదాలు యిస్తూ ముందుకు తోసుకొని వస్తూన్నారు. కానిస్టేబుళ్ళమధ్య పెనుగులాడుతున్న రోజాకు వాళ్ళను చూసి ధైర్యం వచ్చింది!

ఇందాక సినిమాహాలు దగ్గర పోలీసులను ప్రతిఘటించి దెబ్బలుతిన్న ఆ వ్యక్తే యిప్పుడు విద్యార్థులను వెంటపెట్టుకొని వచ్చాడంటే అది తమను పోలీసుల బారి నుండి కాపాడేందుకే అని గ్రహించింది!

"దయచేసి కాపాడండి. దిల్ ఖుష్‌ను డి.ఎస్.పి. బంగళాకు బలవంతంగా పంపించారు. నన్ను సి.ఐ. జీపులో ఎక్కడికో తీసుకొని వెళ్ళే ప్రయత్నంలో వున్నాడు. ప్లీజ్, కాపాడండి" అని అరిచింది రోజా చైతన్యవైపు దీనంగా చూస్తూ.

అది విని విద్యార్థులు రెచ్చిపోయారు. వాళ్ళకు అడ్డుగా నిల్చున్న పోలీసు సిబ్బంది మీద రాళ్ళవర్షం కురిపించారు.

సి.ఐ. మనసులో కోరుకుంటుంది కూడా అదే! క్షణం కూడా ఆలస్యం చెయ్యకుండా "ఛార్జ్...!" అని అరిచాడు.

లాఠీఛార్జి మొదలైంది. పోలీసులు విచక్షణలేకుండా వీధిలో కనిపించిన వాళ్ళందరి మీదా విరుచుకొని పడి లాఠీలతో కొట్టటం ప్రారంభించారు. పరిస్థితి అంతా గందరగోళంగా మారింది. అరుపులు, ఆర్తనాదాలతో వాతావరణం భయానకంగా తయారైంది.





జనం పరుగులు పెడుతున్నారు. దుకాణాల షట్టర్లు 'గరగరా' శబ్దంచేస్తూ మూతలు పడుతున్నాయి. మూసిన షట్టర్లకు తాళాలు వేసి దుకాణాల యజమానులు దూరంగా పారిపోతున్నారు.

విద్యార్థులు తుపానులా చుట్టుముట్టిన పోలీసులను తప్పించుకొని తలా ఒక దిక్కుకు పారిపోయినా వెంటనే తిరిగి ధైర్యం కూడగట్టుకొని గుంపులుగుంపులుగా వస్తూ పోలీసుస్టేషను వైపుకు బలంగా రాళ్ళు విసుర్తున్నారు.

సి.ఐ. దొరగారికి ఫైర్ ఓపెన్ చేసి కొంతమందినైనా కాల్చి చంపుదామన్నంత కోపం వచ్చింది. కానీ తమాయించుకు న్నాడు. కాల్పులు జరిగితే విచారణ పెద్ద ఎత్తున జరుగుతుంది. అందువల్ల నష్టం వుండదుగానీ అప్పటికప్పుడు అధికారులూ, జర్నలిస్టులూ అక్కడికి వస్తారు. అలా జరి గితే దిల్ ఖుష్‌ను డి.ఎస్.పి. దొరగారు బలవంతంగా తన బంగళాకు తెప్పించిన విషయం బైటపడుతుంది. ఇవ్వాళ రాత్రికి రోజాను అనుభవించాలన్న తన వాంఛ కూడా నెరవేరదు.

కాల్పులు జరపాలన్న ఆలోచనను బల వంతంగా నిగ్రహించుకొని లాఠీలతో మాత్రమే గుంపులను చెదరగొట్టాలన్న నిర్ణ యానికి వొచ్చాడు సి.ఐ. వెంటనే తాలూకా పోలీసుస్టేషనుకు ఫోన్ చేసి అక్కడి సిబ్బం దిని కూడా రమ్మని ఆదేశించాడు.

కొద్దిసేపటికే అదనపు పోలీసుబలగాలు వచ్చాయి. అందరూ కలసి విద్యార్థులమీద లాఠీలతో దాడిచెయ్యటం మొదలుపెట్టారు.

అప్పటికే చైతన్యతోసహా చాలామంది గాయపడ్డారు. భయంతో కొంతమంది పారి పోయారు. మిగిలిన వాళ్ళు సందుల్లో గొందుల్లో మాటువేసి యింకా పోలీసుల మీద రాళ్ళు రువ్వుతూనే వున్నారు.

పోలీసుస్టేషను బయట ప్రధాన రహదా రులన్నీ పోలీసులు ఆక్రమించి అందరినీ పారదోలిన తరువాత వాళ్ళు దృష్టిని గొందుల వైపుకు సారించి జట్లు జట్లుగా పరుగులు పెడుతూ అక్కడినుంచి రాళ్ళు రువ్వుతున్న వాళ్ళమీద దాడి ఉధృతం చేశారు.

అరగంట గడిచింది. రాళ్ళ వర్షం క్రమంగా ఆగిపోయింది. విద్యార్థులు దూరంగా పారిపోయారు. పోలీసులు లా అండ్ ఆర్డరును పరిరక్షించటంలో విజయం సాధించారు. ఇక సి.ఐ. దొరగారి వెంట రోజాను జీపులో పంపించి అతడి దాహం తీర్చటమే వాళ్ళకు మిగిలిన కర్తవ్యం!

పాపాయి పెద్దగా ఏడుస్తూంటే పొదివిప ట్టుకొని స్టేషనుకు దూరంగా రెండు బీడీ బంకులమధ్య వొదిగి కూర్చొని వున్నాడు పానకాలు.

అక్కడ అంతా చీకటిగా వుంది. ఎవ్వరూ అతడ్ని గమనించకపోయినా అక్కడ్నించి అతనికి అంతా కనిపిస్తూనే వుంది. కానీ పాపాయి అలా ఏడుస్తుంటే పోలీసులు తనను గమనించవచ్చు!

అలాంటి ఆలోచన కలగగానే పానకా లుకు భయంవేసింది. ఏం చెయ్యాలో తోచక దిక్కులు చూస్తూ కూర్చున్నాడు.

కొంచెంసేపటికి చాలామంది పోలీసులు వెళ్ళిపోయారు. స్టేషను భద్రతకోసం కొంత మంది మాత్రం అక్కడ వున్నారు. అప్పటి దాకా భీభత్సంగా వున్న వాతావరణం క్రమంగా మారిపోయి శ్మశాన శాంతివంటి ఏదో శాంతిని నెలకొల్పగలిగారు పోలీసులు.

పానకాలు ఆలోచించాడు! పాపాయిని కానిస్టేబులు రత్తమ్మకు అప్పగించి వెళ్ళాలి. లాఠీ ఛార్జిలో ఎంతమంది గాయపడ్డారో? చైతన్య ఎలా వున్నాడో?

పానకాలుకు వెంటనే దిల్ ఖుష్, రోజా గుర్తొచ్చారు. వాళ్ళ జీవితాలు యీ రాత్రి ధ్వంసం కావాల్సిందేనా? అన్న ప్రశ్న అతడి గుండెలో ములుకులా గుచ్చుకుంది.

అయినా ఆ సమస్యకు పరిష్కారం కని

పించలేదు పానకాలుకు. అంతమంది విద్యార్థులు ప్రతిఘటించినా ఆ దారుణాన్ని ఆపలేకపోయారు. పోలీసుల లాఠీలకు, వాళ్ళ అధికారానికీ తలవంచక తప్పలేదు!

ఎందుకో అతని గుండె ఝల్లుమంది. నరాల్లో రక్తం వేగంగా ప్రవహించ సాగింది! అవే లాఠీలూ, తుపాకులూ విద్యార్థుల దగ్గరా వుంటే రోజా, దిల్ ఖుష్‌ల జీవితాలు నాశనం అయ్యేవి కావేమో? అన్న ఆలోచన వచ్చింది పానకాలుకు.

అతను పాపాయిని భద్రంగా గుండెకు హత్తుకొని లేచాడు. ధైర్యం కూడగట్టుకొని నెమ్మదిగా నడుస్తూ స్టేషను దగ్గరికి వెళ్ళాడు.

"ఎవడ్రా... నువ్వు?" మెయిన్ గేటు దగ్గర ఆపి పానకాలును అడిగాడు సెంట్రీ.

"పాపాయి...పాపాయి...!" ఆ పైన పానకాలు గొంతులోంచి మాటలు పెగల్లేదు.

సెంట్రీ పకపకా నవ్వాడు. "దాన్తల్లి రోజా సి.ఐ. దొరగారితో కలిసి నైట్ డ్యూటీకి వెళ్ళబోతోంది. ఓపికవుంటే అది డ్యూటీనుంచి తిరిగివచ్చేదాకా పాపాయిని ఆడిస్తుండు. ఓపిక లేకపోతే ఎత్తుకొని నువ్వే తీసుకువెళ్ళు" అన్నాడు నొసలతో వెక్కిరిస్తూ.

ఆ సమయంలో రోజాను వరండాలో వుంచలేదు పోలీసులు. స్టేషను వెనుక వున్న చీకటి గదిలో వుంచారు. ఆమెకు తోడుగా వుంది కానిస్టేబులు రత్తమ్మ. అందుకే వాళ్ళు పాపాయినిగానీ, ఎత్తుకొని తెచ్చిన పానకాలునుగానీ చూడలేదు.

"అంతా క్లియరైనట్టేనా?" హెడ్డును అడిగాడు సి.ఐ.

"ఎస్సార్!"

"రోజాను రెడీ చేశారా?"

"ఎస్సార్!"

"ఐతే యిక బయల్దేర్తాను. దాన్ని జీపు ఎక్కించండి. స్టేషన్ జాగ్రత్త" అని చెప్పి కుర్చీలోంచి లేచి వరండాలోకి వచ్చాడు సి.ఐ. జీపు దగ్గరికి వెళుతుంటే మెయిన్ గేటుదగ్గర అతనికి పాపాయి ఏడుపు వినిపించింది.

"ఏడుస్తున్నది రోజా కూతురు కదూ?" కానిస్టేబులు వీరాస్వామిని అడిగాడు సి.ఐ. జీపు ఫుట్‌బోర్డుమీద కాలు పెడుతూ.

"ఎస్సార్!"

"దాన్ని ఎత్తుకున్నవాడు ఎవరు?"

"వాడి పేరు పానకాలు సార్!"

"ఏం చేస్తుంటాడు?"

"స్టూడెంటు సార్!"

సి.ఐ. కళ్ళలో క్రౌర్యం కనిపించింది వెంటనే! "ఏ కాలేజి?" అడిగాడు.

"చైతన్య చదివే కాలేజియే సార్! ఇద్దరూ స్నేహితులు కూడా" చెప్పాడు వీరాస్వామి.

"అరేయ్ పానకాలూ... ఇటు రారా!" అని అరిచాడు సి.ఐ.

ఉరుములా వినిపించిన అతడి గర్జనకు ఉలిక్కిపడి చూశాడు పానకాలు.

"దొరగారు పిలుస్తున్నది నిన్నేరా నా కొడక! దిక్కులు చూస్తావేం! వెళ్ళు" అని తుపాకి మడమ పానకాలు వీపుమీద ఆనించి బలంగా ముందుకు తోశాడు.

ఆ విసురుకు తూలిపడబోయి తమాయించుకొని ముందుకు వెళ్ళాడు పానకాలు. జీపుదగ్గరికి వెళ్ళి సి.ఐ. ఎదురుగా నిలబడి భయం నిండిన కళ్లతో అతనివైపు చూశాడు.

"చైతన్యగాడి స్నేహితుడివటరా నువ్వు?" అడిగాడు సి.ఐ.

"ఇద్దరం... ఇద్దరం ఒకే ఊరివాళ్ళం" చెప్పాడు పానకాలు మాటలను కూడపలుక్కుంటూ.

"మీరందరిదీ ఒకే కాలేజి కదూ?"

"అ...వు...ను"

"చైతన్య మీ అందరికీ నాయకుడా?"

"తెలీదు"

"ఏమీ తెలియకుండానే ఏకంగా పోలీసు స్టేషనుమీదనే దాడిచేస్తార్రా మీరు. మీ అంతు తేలుస్తాను. ప్రభుత్వం అంటే





ఏమిటో మీ అందరికీ అర్థమయ్యేట్టు చేస్తాను" అని సి.ఐ. జీపు సీటుమీద వున్న లాఠీని విసురుగా చేత్తో అందుకొని "మాకు వ్యతిరేకంగా మీరంతా కలిసి కుట్రచేస్తార్రా...!" అంటూ లాఠీతో బలంగా పానకాలు కాళ్ళమీద బాదాడు.

కెవ్వుమని అరిచాడు పానకాలు. పాపాయికింద పడిపోకుండా ఒక చేత్తో పట్టుకొని రెండవ చేతితో కాళ్ళమీద రుద్దుకున్నాడు.

లాఠీ తగిలినమేరకు రెండు కాళ్ళూ బూరెల్లా పొంగి క్షణంలో కదుములు కట్టాయి. విపరీతంగా మంట పుడుతూంటే బాధ భరించలేక పెద్దగా ఏడుపు లంకించుకున్నాడు పానకాలు.

అతని ఏడుపూ, పాపాయి ఏడుపూ కలసి అక్కడి పరిసరాలు ప్రతిధ్వనించిపోతోన్నాయి.

రత్తమ్మ, మరో ఇద్దరు కానిస్టేబుళ్ళూ అప్పుడే రోజాను చీకటిగదిలోనుంచి జీపు దగ్గరికి తెచ్చారు.

అక్కడి దృశ్యాన్ని చూసింది రోజా! హృదయవిదారకంగా వినిపిస్తున్న కన్నబిడ్డ ఏడుపుకు హృదయం ద్రవించిపోతూంది. నీళ్ళలోంచి నిప్పు పుట్టినట్టు ఆ ద్రవించిన హృదయంలోనే నిప్పులు రాజుకొని రాజుకున్న ఆ నిప్పులు అంతలోనే నాల్కలు చాపిన మంటల్లా ఎగసిపడుతూ ఆగ్రహంతో విజృంభించి లేచింది!

"లంజాకొడకల్లారా! జనం శిస్తులు కడుతుంటే ఆ డబ్బులోంచి జీతాలు మింగుతూ అదే జనాన్ని వేపుకు తింటార్రా? మంచి కోసం పోట్లాడితే విద్యార్థులను చావబాదారు. మీరు చెడుపని చెయ్యటానికి నన్నూ, దిల్‌ఖుష్‌నూ బంధించారు. కంచే చేను మేస్తే కాలం కలిసొచ్చేదాకా క్రూరత్వం సాగుతుంది గాని జనం కళ్ళు తెరిస్తే ఉసిళ్ళలా రెక్కలు తెగి రాలిపోతారురా మీరు. మా ఉసురు తగుల్తుంది మీకు. గత్తరొచ్చి పోతారు!" అని అరుస్తూ,

నిస్సహాయతను పక్కకుపెట్టి సుడిగాలిలా లేచింది రోజా.

కానిస్టేబుళ్ళ వలయాన్ని ఛేదించుకొని మెరుపులా పానకాలు దగ్గరికి దూకి వెళ్ళి అతడి చేతుల్లోంచి పాపాయిని లాక్కొని అమాంతం ఎండిన గుండెకు హత్తుకుంది.

సి.ఐ. దొరగారికి అలా ఒక మనిషి, అందునా ఆడది అలా ఎదురుగా దూషించిన అనుభవం సర్వీసులో యింత వరకూ లేదు. ఇప్పుడు ఎదురు కావటంతో ఉక్కిరిబిక్కిరయ్యారు కొంచెంసేపు. నిదానంగా తేరుకొని కానిస్టేబులు వీరాస్వామివైపు అదోలా చూశాడు!

వీరాస్వామికి ఆ చూపుల అర్థం బాగా తెలుసు! నరమాంసం, బండెడు భోజనం ఏరోజు అందకపోతే ఆరోజు ఊరిమీద విరుచుకుపడి విధ్వంసం సృష్టించే బకాసురుడి చూపులు అవి!

రోజాను వెంటనే జీపులోకి ఎక్కించేందుకు సిద్ధమయ్యాడు. రోజా దగ్గరికి వెళ్ళి ఒక చేతితో ఆమె జడ మెలిపెట్టి లాగుతూ ఆ బాధకు ఆమె విలవిల్లాడుతూంటే మరో చేత్తో పురుటిబిడ్డను మంత్రసాని లాగినట్టే పాపాయిని లాగి పక్కనే నిల్చున్న పానకాలుకు అందించాడు. రోజాను నెట్టుకుంటూ వెళ్ళి అమాంతం ఎత్తి జీపులో కుదేశాడు.

సి.ఐ. కళ్ళు వింతగా మెరిశాయి. వీరాస్వామి విధి నిర్వహణకు అమితంగా మెచ్చి అబ్బురంగా చూశాడు అతనివైపు. కళ్ళతో అభిమానం కురిపిస్తూనే తనూ జీపులో ఎక్కికూర్చున్నాడు.

పానకాలుకు దుఃఖం బైటికి తన్నుకొచ్చింది మళ్ళీ. అతడి కళ్ళవెంట ధారాపాతంగా కన్నీళ్ళు కారుతూంటే దీనంగా చూశాడు జీపులో వున్న రోజావైపు.

ఆమె కళ్ళన్నీ బిడ్డకేసే చూస్తున్నాయి జాలిగా, నిస్సహాయంగా. ఏమాత్రం అవకాశం వున్నా జీపులోంచి కిందికి దూకి బిడ్డను అక్కున చేర్చుకొని లాలించాలని

తపిస్తున్నాయి ఆమె కళ్లు! కానీ పోలీసులు అలాంటి అవకాశం ఆమెకు యివ్వరు.

పానకాలు గుండె అగ్నిపర్వతంలా రగిలి పోతోంది. సెంట్రీ చేతిలో వున్న తుపాకివైపు చూశాడు! అవినీతినీ, అక్రమాలనూ అంటిపెట్టుకొని వుంటూ రాక్షస నైజంతో నరమేధం సాగిస్తున్న అధికారపీఠానికి కావలి కాసే ఆ కానిస్టేబులు చేతిలో వున్న తుపాకి తనచేతిలోకి వస్తే ఎంత బావుంటుంది! అన్న ఆలోచన కలిగింది పానకాలుకు.

అంత విషాదంలో కూడా తన ఆలోచనకు తనకే అంతలోనే నవ్వొచ్చింది! ఎన్.సి.సి.లో పేరేడ్ చెయ్యాలన్నా, తుపాకీ మొయ్యాలన్నా గడగడా ఒణికే తను ఆ తుపాకిని ఏం చేసుకుంటాడు! తన కున్న సిగ్గరితనాన్నీ, భయాన్నీ, రాజ్యంమీది భ్రమలనూ పూర్తిగా పోగొట్టుకొని ధ్యేయానికి అంకితమైతేనే తప్ప ఆయుధం కూడా అనవసరం.

అతను కళ్ళు వాల్చేశాడు.

పోలీసు జీపు ఇంజను స్టార్టయింది.

"రత్తమ్మక్కా...!" అని పెద్దగా ఏడుస్తూ పిలిచింది రోజా.

కానిస్టేబులు రత్తమ్మ ఉలిక్కిపడి చూసింది. యాంత్రికంగా నాలుగు అడుగులువేసి జీపుదగ్గరికి వెళ్ళి నిలబడి "ఏమిటి?" అని అడిగింది.

"నన్ను కాపాడలేకపోతే పోనీగానీ నా బిడ్డనయినా చూస్తుండు. సాటి ఆడదానివి నువ్వయినా అర్థంచేసుకో అక్కా నా బాధ" అంటూ రెండు చేతులూ ఎత్తి దణ్ణం పెట్టింది రోజా.

సి.ఐ. అదోలా నవ్వాడు. కానిస్టేబులు రత్తమ్మను పిలిచి "ఒసేయ్, నువ్వూ జీపు ఎక్కు- మా ఇంటికి వెళ్దాం. వచ్చేప్పుడు పాపం రోజా నడుచుకుంటూ ఒంటరిగా రావాలి కదా! దానికి నువ్వు తోడుండాలి!" అన్నాడు మాటలను వొత్తిపలుకుతూ.

దొరగారి ఉత్తర్వు వినగానే అమాంతం జీపు ఎక్కింది లేడీ కానిస్టేబులు రత్తమ్మ. రోజా పక్కనే సర్దుకొని కూర్చుంది.

జీపు ముందుకు కదిలింది.

"పడక గదిలో ఎలా అణకువగా వుండాలో దానికి నువ్వయినా చెప్పవే రత్తమ్మా! అల్లరిచేసిందో, హార్టు బీటింగూ, పల్సు బీటింగూ పెరిగిపోతాయి నాకు. ఆనక నేనేం చేస్తానో నాకే తెలియదు కోపంలో. లాఠీతో బీటింగు మొదలెట్టానంటే తెల్లవారేసరికల్లా శవమైతేల్తుంది. ఇక దానిష్టం, నీ ఇష్టం" అన్నాడు సి.ఐ.

జీపు వేగం పుంజుకొని వెళ్ళిపోయింది.



నేరేడు ఇంట్లో పగలంతా పొయ్యి రాజుకోనేలేదు. దొంగతనం జరిగిందన్న బాధతో ఆమెగానీ, నేరేడు అమ్మగానీ భోజనం చెయ్యలేదు. ఒకవిధంగా వాళ్ళిద్దరికీ భోంచెయ్యాలన్న ఆలోచనే కలగలేదు.

పరామర్శించేందుకు వచ్చేపోయేవాళ్లూ, ఇరుగుపొరుగుల ఓదార్పులతోనే కాలం గడిచిపోతోంది.

రాత్రి దీపాలు వెలిగించేవేళకు నేరేడుకు తల్లి ఆకలి అప్పుడు గుర్తొచ్చింది! అసలికే ఆమె అనారోగ్యంతో వుంది. దానికి తోడు





దిగులు. దాంతో తల్లి బాగా కృంగిపోతుం దని గ్రహించింది నేరేడు. ధైర్యం చెప్పింది మాటలతో. కానీ మాటలతో కడుపు నిండదు కదా!

గబగబా పొయ్యి వెలిగించి వంటచేసి అమ్మను భోజనానికి పిలిచింది.

"నాకు ఆకలి కావటంలేదు. నువ్వు తిని పడుకో" అంది ఆమె నేరేడుతో.

"నాకు విపరీతంగా ఆకలివేస్తోంది. అయినా నువ్వు తింటేనే నేను తింటాను. లేకపోతే పస్తు పడుకుంటాను" అని మొండికి వేసింది నేరేడు.

అమ్మకు భోజనానికి లేవటం తప్పలేదు. కూతురుకోసం నెమ్మదిగా లేచి కాళ్లూ చేతులూ కడుక్కొని వెళ్ళి భోజనానికి కూర్చుంది. ఇద్దరూ కంచాలు పెట్టుకొని అన్నం వడ్డించుకున్నారు. తల్లికోసం కూతురూ, కూతురుకోసం తల్లి అన్యమన స్కంగానే చెరో నాలుగు మెతుకులు తిని భోజనాలు ముగించి లేచారు.

ఇంటిముందు రిక్షా ఆగింది.

"ఇదే ఇల్లు... సామాన్లు దించు" అంటూ రిక్షా దిగాడు గూనోడు.

రిక్షా అతను, గూనోడూ కలసి సోడామి షనూ, సిలిండరూ పట్టుకొని లోపలికి చేర్చారు.

రిక్షా అతనికి బాడుగ చెల్లించి పంపించి 'ఉస్సో'మని నిట్టూరుస్తూ లోపలికి వచ్చి కూర్చొని 'సెల్లెమ్మా! కొంచెం మంచినీళ్ళియ్యి' అని అడిగాడు గూనోడు.

నేరేడు మంచినీళ్ళు తెచ్చి యిచ్చింది. తాగి ఖాళీగ్లాసుకిందపెట్టి "అన్నమాట ప్రకారం సావాను కొని తెచ్చాను సెల్లెమ్మా... యింక నువ్వు నిచ్చేపంగా యాపారం సేసుకో. దేనికీ అధైర్యం పడ గాకు. ధైర్నంలోనైనా, అధైర్నంలోనైనా జల్మలో ఎప్పుడూ పోలీసులకాడికి ఎళ్ళ మాకు. ఆళ్ళకాడికి ఎళ్ళేబదులు గుడికాడికి ఎళ్ళినా కొంత నయం! దేవుడు మనసుమం టోళ్ళని పట్టిచ్చుకోకపోయినా ఆయన పట్టి చ్చుకున్నోళ్ళు పున్యం కోసరం సేతిలో ఒక కొబ్బెరముక్కయినా పెడ్తారు. సలువ బండ లమీన కొంచెంసేపు ప్రెశాంతంగానైనా కూకోవొచ్చు. టేశనుకాడికి మాత్రం ఎళ్ళ మాకు" అని చెప్పి కుర్చీలోంచి లేచి "యింక నేను ఎల్తాను. మళ్ళా కనిపిచ్చనేమో! కనిపి చ్చినా, కనిపిచ్చకపోయినా నాగ్గాడా ఒక సెల్లి వుందని అందరికీ సెప్పుకుంటాను" అని నేరేడు ముఖంలోకి ఎంతో అభిమా నంగా తొంగిచూశాడు గూనోడు.

నేరేడుకు ఏం మాట్లాడాలో కొంచెంసేపు అర్థంకాలేదు. అంతకు ముందు కనీస పరి చయంకూడా లేని వ్యక్తి తనకలా సహాయం చెయ్యటం ఆమెకింకా విచిత్రంగానే తోస్తోంది.

గూనోడు 'చెల్లెమ్మా' అని ఎంతో అభిమా నంగా పిల్చినా, ఆపదలో ఆదుకుంటానని వాగ్దానం చేసినా అతడి మాటలను విశ్వ సించలేదు నేరేడు. అందుకే అయాచిత సహాయంవద్దని అంతగా తిరస్కరించలేదు. చాలామందికి ఆపదలో వున్న ఆడవాళ్ళకు, అందునా వయసులో వున్నవాళ్ళకు సహా యపడటం చాలా ఆనందం! ఆ సహాయం కూడా అట్టే ఖర్చు తగలకుండా ఎక్కువ శ్రమ పడకుండా తెలియని అడ్రసులు చెప్ప టానికో, వాళ్ళ ఉత్తరాలు పోస్టుబాక్సులో వెయ్యటానికో సినిమా టిక్కెట్టు దొరకక తిరిగి వెళ్తుంటే ఉదారంగా తన టిక్కెట్టు యివ్వటానికో, యింకా యిలాంటివే చాలా! అంతేగానీ వేలరూపాయల ఖర్చుకు వెనుకా డని సహాయం ఊహించలేదామె. నాయ కుల వాగ్దానాలను నమ్మినట్టు నటించినట్టే నటించిందిగానీ అది నిజం అనుకోలేదు. అందుకే గూనోడు అలా సామాన్లు తెచ్చి యివ్వగానే ఆశ్చర్యపోయింది.

కొంచెంసేపటికి తేరుకొని "అన్నా...! ఇవ్వన్నీ నా కెందుకు తెచ్చావ్? ఆపదలో నువ్వు నన్ను ఆదుకున్నా నీ రుణం తిరిగి

చెల్లించే స్తోమత నాకు లేదు. నీ బాకీ తీర్చ లేను. తీర్చే అవసరం లేదని అనచ్చు నువ్వు. కానీ తీర్చే అవసరం లేని సహాయం స్వీకరించే అలవాటు ఉండాలికదా నాకు. అలాంటిది లేనప్పుడు నీ సహాయాన్ని తిర స్కరించకుండా ఎలా ఉండగలను నేను. ఎప్పుడో వడ్డీల జంగయ్య దగ్గర నేను బాకీ పడిన ఐదువందల రూపాయలే ఇంతవ రకూ తిరిగి చెల్లించలేకపోయాను. అలాం టిది నీ బాకీ ఎలా చెల్లించగలను? " అని కాలి బొటనవేలుతో నేలను గిల్లుతూ తల వంచుకుని నిల్చుంది నేరేడు.

"సెప్పటం అయిపోనాదా సెల్లెమ్మా...? " అడిగాడు గూనోడు.

నేరేడు పల్చగా నవ్వింది.

"...ఉద్దెరగా నాకాడ సావాను తీసుకోటం యిష్టంలేకపోతే ఒక పని సెయ్యి!" అని నేరేడు వైపు చూశాడు గూనోడు.

"ఏమిటది? " అడిగింది తల పైకెత్తి.

"సామానుకోసం నేను కర్చుబెట్టిన డబ్బులు నువ్వు మళ్ళీ నాకు యియ్యాలన్నా నేను కనిపిత్తానో లేదో! అందుశాత నువ్వే నిమ్మళంగా రోజూ కూసిని డబ్బులు కూడ బెట్టి ముంతలో దాపెట్టు. అవి అట్టాగా పెరిగీ పెరిగీ పెద్దమొత్తం అయినాక ఆ డబ్బుల్తో యింకో సోడా మిసనూ, కావా ల్సిన సాంవాన్లూ గొని నీ అసుమంటోళ్లకే యింకోర్కికైనా యియ్యి. ఆళ్ళూ బతుకు తారు. అట్టాగే యింకోళ్ళను బతికియ్యమని ఆళ్ళకీ సెప్పు. అప్పుడు ఎవురూ ఉద్దెరగా ఎవురికాడా సాంవాన్లు తీసుకున్నట్టూ కాదు, శానామందికి జీవనం గూడా జరుగుద్ది" చెప్పాడు గూనోడు.

గూనోడి ఆలోచనకు ఆశ్చర్యపోయింది నేరేడు. "అన్నా! మళ్లీ కనిపించనంటున్నావు కదా, ఎక్కడికి వెళ్తావ్" అని అడిగింది.

గూనోడు అదోలా నవ్వి "ఇది మాయా పెపంచకం. ఈ మాయా పెపంచకంలో యాడికి బోయినా ఎదురయ్యేది యిసు మంటి మడుసులే! అయినా యీడ వుండా ల్నంటే నాకు శానా సిక్కులుండాయి. మంచోళ్ళకాడనైతే మంచిగా వుండొచ్చు సెడునాయాళ్ళకాడ సెడుగా వుండొచ్చు మంచి సెబుతా సెడుజేసే యదవ నాయా ళ్ళకాడ అస్సలికి వుండలేము. అందుకే సెల్లెమ్మా ఎళ్ళిపోతున్నాను" అని ఎంతో తాత్త్వికంగా మళ్ళీ నవ్వాడు గూనోడు.

అతను అలా ఎందుకు చెప్పాడో నేరే డుకు అసలు అర్ధంకాలేదు. అడిగినా అతను చెబుతాడన్న నమ్మకం కుదరక మౌనంగా తల పంకించింది నేరేడు.

గూనోడు అక్కడ్నుంచి కదిలాడు. గుమ్మందాకా వెళ్ళి ఎందుకో ఒక్కక్షణం ఆగాడు. వెనక్కు తిరిగి నేరేడువైపు చూస్తూ "వొడ్డీల జంగయ్యగాడికి నువ్వియ్యాల్సిన డబ్బంతా యిచ్చేశాను. నువ్వు రాసిచ్చిన నోటు కాయితం చించేశాను. ఆ బాధగూడా తీరింది కాబట్టి నువ్వింక హాయిగా బతుకు సెల్లెమ్మా, ఎళ్ళొత్తాను" అని చెప్పి వేగంగా నడుస్తూ వెళ్ళిపోయాడు గూనోడు.

నేరేడు హృదయం ఎందుకో చాలా బరు వెక్కింది. అలా వెళ్ళిపోతూన్న గూనోడివైపే కళ్ళార్పకుండా చూస్తూ వాకిట్లో నిల్చుంది.

గూనోడు వెళ్లిపోయిన కొంచెంసేపటికి వీధిలో వెళుతూ ఎవరో నేరేడును చూసి ఆగి "ఇయ్యాళ ఊర్లో ఏం జరిగిందో తెలి సిందా నేరేడూ? " అని అడిగి డ్యాన్సర్లను పోలీసులు పట్టుకొని వెళ్లిన దగ్గర్నించి లాఠీ ఛార్జీ జరిగిందాకా వివరాలన్నీ చెప్పి వెళ్లారు.

నేరేడు మనసంతా కంగారుగా మారింది. దిల్ ఖుష్, రోజాల పరిస్థితి ఎలా వున్నదో లాఠీఛార్జిలో ఎవరెవరు గాయపడ్డారో, చైతన్య, పానకాలూ ఎలా వున్నారో అన్న రకరకాల ప్రశ్నలూ, అనుమానాలూ ములు కుల్లా పొడుస్తూంటే ఏం చెయ్యాలా అని ఆలోచించింది.

సినిమా హాలు దగ్గరికి వెళితే వివరాలు





తెలిసే అవకాశం వుంది. ఊర్లో ఏం జరిగినా సమాచారం ముందుగా అందేది సినిమాహాలు సెంటరుకే!

"అమ్మా! నేనలా వెళ్లొస్తానుగానీ నేను వచ్చేదాకా ఇల్లు జాగ్రత్త" అని చెప్పి బయల్దేరింది నేరేడు.

★ ★ ★

రోజాను ఎక్కించుకొని సి.ఐ వెళ్లిపోగానే రైటరూ, హెడ్డు, వీరాస్వామి కలిసి స్టేషను బైటికి వచ్చారు.

"పానకాలుగాడు వెళ్లిపోయాడా? " సెంట్రీని అడిగాడు హెడ్డు గేటు దగ్గర ఆగుతూ.

హెడ్డు అలా అడగగానే దూరంగా వేలు పెట్టి చూపిస్తూ "ఇంకా వెళ్లలేదు. పాపాయిని ఎత్తుకొని అక్కడ కూర్చున్నాడు రోజా కోసం ఎదురు చూస్తూ" చెప్పాడు సెంట్రీ.

అందరూ తలలు ఎత్తి అటువైపు చూశారు. షట్టరు వేసి తాళం పెట్టిన ఓ దుకాణం ముందు మెట్లమీద కూర్చొని వున్నాడు పానకాలు.

"వీరాస్వామీ! ఇప్పటికే బాగా ప్రొద్దుపోయింది. ఈ వెధవ గొడవతో బాగా అలసిపోయాం. ఆ గెస్టు హవుసుకు వెళ్లి కొంచెం మందు తాగి ఇంటికి వెళ్తే హాయిగా భోంచేసి నిద్రపోవచ్చు. ఏమంటావ్? " అని అడిగాడు హెడ్డు.

వీరాస్వామి విషాదంగా నవ్వాడు. గూనోడు తన జేబుకొట్టేసిన విషయం లాఠీ ఛార్జి గొడవలో మర్చిపోయాడుగానీ హెడ్డు అలా అనేసరికి అప్పుడు ఆ విషయం మళ్లీ అతనికి గుర్తొచ్చింది.

"గూని లంజాకొడుకు నా జేబే కొట్టేశాడు కదా! జేబులో చిల్లిగవ్వలేదు. మీ అందరి జీతాలూ భద్రంగానే వున్నాయి కనుక ఇవ్వాల్టికి బిల్లు మీరే భరించాలి" అన్నాడు వీరాస్వామి.

రైటరుకు ఏదో అనుమానం వచ్చింది. "లాఠీఛార్జి గొడవలో మా పర్సులు భద్రంగా వున్నాయో లేవో చూడనివ్వు" అంటూ హడావుడిగా జేబు తడుముకుని "హమ్మయ్య! పర్సుపోలేదు" అన్నాడు సంతోషంగా.

హెడ్డుకూడా జేబు తడుముకొని పర్సు భద్రంగా వుందని రూఢి చేసుకున్నాడు.

కానిస్టేబులు వీరాస్వామి నిట్టూర్చాడు! కాల మహిమకు గల చమత్కారానికి అబ్బురపడుతూ, "డ్యూటీ దిగివెళుతున్న నాకు దారిలో గూనోడు ఎందుకు కనిపించవలె? కనిపించినాడె పో! వాడ్ని చూసి నేనేల ఆగవలె? ఆగితినె పో! కానిస్టేబులునన్న కనికరం కూడా లేకుండా వాడు నా జేబు ఏల కొట్టవలె? కొట్టెనెపో! గుట్టుచప్పుడు కాకుండా గూటికి వెళ్లకుండా పోటుగాడికి మల్లే పోలీసు స్టేషనుకు నేనేల తిరిగి రావలె? వచ్చితినెపో! గూనోడి మీద ఓ కంప్లయింటు ఇచ్చి వెళ్లకుండా డి.ఎస్.పి దొరగారికి దిల్‌ఖుష్‌నూ, సి.ఐ దొరగారికి రోజానూ అప్పగించే తార్పుడు విధిని నేనేల నిర్వహించవలె? " అని ఎందుకో కొంచెం ఉలిక్కిపడి,

"నిర్వహించితినెపో! నా సొమ్ము తింటూ నేను కోరిన దిల్‌ఖుష్‌ను నాకు కాకుండా దొరగారికి ఏల సమర్పించినారురా? అని సుధీర్ అడిగితే సమాధానం ఏం చెప్పాలండీ హెడ్డుగారూ? " అని అడిగాడు కానిస్టేబులు వీరాస్వామి కంగారు పడుతూ.

హెడ్డు కూడా అదే సినిమా ఫక్కీలో వీరాస్వామి భుజం తట్టి ధైర్యం చెబుతూ "వత్సా! ఊరడిల్లుము. 'అవసరానికో అమ్మాయి' పథకం కింద వేశ్యలను తయారు చేసే సమాజం మనది. ఫలితాన్ని ఎంతమంది అనుభవించినా ప్రారంభించే వాడికి ఒక స్థాయంటూ వుండాలి.

"లాడ్జింగులను మంత్రులు ప్రారంభిస్తారుగానీ రోజూ వాళ్లే మంచాలమీద దొర్లరు. పచ్చజండాలు వూపి కొత్త రైళ్లను లైన్లోకి తెచ్చిన వాళ్లే నిత్యం రైళ్లలో ప్రయాణం

# ఏరిన ముత్యాలు

★ కళ, సాహిత్య రంగాలలో విఫలురైనవారే విమర్శకులవుతారు.

—బెంజిమన్ డి(స్రేలీ

★ సుగుణమే నిజమైన గొప్పధనం.

—థామస్‌ఫుల్లర్

★ న్యాయాన్ని తెలుసుకుని న్యాయం చేయకపోవడం అన్నది పిరికితనం అవుతుంది.

—షింటో

★ మీరు నిజాన్ని చెబితే ఏ విషయమూ గుర్తు పెట్టుకోవలసిన అవసరం ఉండదు.

—మార్క్‌ట్వైన్

★ సంతోషం అన్నది మీరు పొందే వస్తువుపై కాకుండా మీరు ఇచ్చే వస్తువుపై ఆధారపడి ఉంటుంది.

—వివేకానంద

★ విజయం అన్నది ఒక మనోభావన. అది మీ మనోబలంతో ప్రారంభమవుతుంది.

—వాల్టర్ డి.వింట్లే

★ పుస్తకం విలువను ధర కాదు, దాని ఉపయోగం నిర్ణయిస్తుంది.

—జెర్రివాకర్

★ ధనవంతుడి జోకులు ఎల్లప్పుడూ ఖరీదుగానే ఉంటాయి.

—బెర్నార్డ్‌షా

★ ప్రేమ ప్రేరణను పొంది, విద్య మార్గదర్శకత్వాన్ని అభిలషించే జీవితమే మంచి జీవితం.

—బెర్నాడ్ రస్సెల్

★ అన్నింటిని గురించి ఎంతో కొంత తెలుసుకోవడం తేలికే. కానీ అన్నింటిని గురించి అంతా తెలుసుకోడం చాలా కష్టం.

—ఎమ్మాన్స్

★ ప్రతిభ, పరావర్తనం ద్వారా కాదు. అనుభూతి కారణంగానే మనం ఔన్నత్యాన్ని, పవిత్రమైన నిజాన్ని సాధించగలం.

—అనటోలెఫ్రాన్స్

★ బాధలను తట్టుకోగల అనంత సామర్థ్యాన్నే ప్రతిభ అంటారు.

—కార్లైల్

★ ఎవరు ఎక్కువ వివేకవంతుడు అని అడగడకుండా ఎవరు ఉత్తమ వివేకవంతుడు అని అడగండి.

—మోంటైగ్నే

★ సంతోషం మనిషి తీరు అవుతుందేగానీ! మనిషి దగ్గరున్న వస్తువు ఏమాత్రం కాదు.

—సిసిరో

సేకరణ: పి.వి.రమణకుమార్

చెయ్యరు. వెండి కత్తెరతో బ్రాందీషాపుల రిబ్బన్లు తెంపినవాళ్లే అస్తమానం అక్కడ తాగుతూ కూర్చోరు.

"ఒక దేవాలయంలో ఆడదానికి అర తులం బంగారం ఇచ్చి కత్తికి భాషికం కట్టించి కన్నెరికం పెట్టించిన కామందుగాడే జోగిని నిత్యం అనుభవించడు.

అలాగే మన డి.ఎస్.పి దొరగారూ, సి.ఐ దొరగారు కూడానూ. అప్పనంగా వచ్చిన ఆనందాలను యితరులకు అందించకుండా అట్టేపెట్టుకోరు. అంచేత సుధీరుబాబుకు దొరగారి దయచేత లైన్ క్లియరైందనీ ఇక ఎప్పుడైనాసరే దాన్ని అనుభవించవచ్చుననీ విపులంగా చెప్పాలంతే" అని చెప్పాడు జ్ఞానిలా చూస్తూ.

సత్యం బోధపడినట్టే తలాడించాడు కాని స్టేబులు వీరాస్వామి. అయినా ఈ వెధవది పిడికెడంత మెదడుకు అన్నీ సందేహాలే! అన్నీ అనుమానాలే!

"సుధీరుకు అలాగే చెబుతానుగానీ కూలరు విషయం అడిగితే మా అమ్మకేం చెప్పాలి? గూనోడి గుడ్లు పీకేదాకా నాక స్సులు నిద్రపట్టదు. వాడి విషయం ఏం చెయ్యాలి? " అని అడిగాడు సూటిగా.

హెడ్డు నవ్వాడు! "మందు దేవత వంటి మీదికి వస్తేగానీ ప్రశ్నలకు సమాధానాలు పలకవు. పలకాలంటే మనం గెస్టు హవుసుకు వెళ్లి మందు మీద కూర్చోవాలి. కూర్చోవాలంటే మన డబ్బుతో. కూర్చుంటే మనకు కిక్కెక్కదు. ఎక్కాలంటే మందుకు మంది డబ్బుకావాలి" అని ఒక్క క్షణం ఆలోచించి

"అరేయ్ సెంట్రీ! పానకాలుగాడ్ని పట్టుకురా!" అని చెప్పాడు హెడ్డు.

సెంట్రీ తుపాకిని ప్రహరీగోడకు ఆనించి నిలబెట్టి టకటకా బూట్ల శబ్దం చేస్తూ రోడ్డు దాటి వెళ్లాడు. ఎదురుగావున్న దుకాణం మెట్లమీద కూర్చున్న పానకాలును కాలరు పట్టుకొని లాక్కొచ్చి హెడ్డు ముందు హాజరుపెట్టాడు.

"ఏందిరా ఇంకా ఇక్కడే వున్నావ్? " పానకాలును తీక్షణంగా చూస్తూ అడిగాడు హెడ్డు.

"పాపాయి! పాపాయి!!"

"పాపాయి ఐతే ఏంటంటావ్? "

"పాపాయిని ఇచ్చి వెళ్దామనీ!"

"చిన్న పాపాయిలు మాకెందుకురా దొంగనా కొడక! దాన్ని అడ్డం పెట్టుకొని స్టేషను రహస్యాలు తెలుసుకోటానికే ఇక్కడ కూర్చున్నావు నువ్వు. అవును కదూ? "

"కా...దు"

"రహస్యాలు తెలుసుకొని అదను చూసి స్టేషను మీద మళ్లీ దాడి చేయిస్తావుకదూ? "

"కా...దు"

"తీవ్రవాదులతో ఎంత కాలం నుంచి సంబంధాలు వున్నాయి నీకు? "

"నాకు తెలియదు వాళ్లెవరో"

"మర్యాదగా అడిగితే నిజం చెప్పర్రా మీరు!" అంటూ చేత్తో బలంగా పానకాలు చంపమీద కొట్టాడు హెడ్డు.

టపాకాయ పేలినట్టే ఠాప్పున శబ్దమైంది. "అమ్మా!" అని అరుస్తూ చేత్తో చెంప రుద్దుకున్నాడు పానకాలు. కలత నిద్రపోతోన్న పాపాయి ఉలిక్కిపడి లేచి మళ్లీ ఏడుపు మొదలుపెట్టింది.

హెడ్డు అలా ఎందుకు చేస్తున్నాడో ఎవ్వరికీ అర్థం కాలేదు. ఆశ్చర్యంగా చూస్తూ నిల్చున్నారు.

"అరేయ్ వాడి జేబులు వెదకండిరా! ఇలాంటి వాళ్లను అసలు నమ్మకూడదు. బాంబులూ, పిస్తోళ్లూ వుంటాయి వీళ్ల జేబుల్లో. కమాన్ క్విక్" అని అరిచాడు హెడ్డు.

సెంట్రీ మెరుపు వేగంతో అలర్టయ్యాడు. పానకాలు రెండు చంకల్లోనుంచి చేతులు దూర్చి అతడ్ని అంగుళం కూడా కదలకండా బిగించిపట్టుకొని వీరాస్వామి వైపు

చూశాడు.

వీరాస్వామి కూడా అంతే వేగంతో పాన కాలు మీదికి లంఘించి అతడి చొక్కా జేబులూ, ప్యాంటు జేబులూ వెదకి బాంబులూ, పిస్తోళ్లూ లేవని నిర్ధారించుకొని వున్న ఓ రెండు వంద రూపాయల కాయి తాలూ, కొంత చిల్లర డబ్బులూ బైటికి తీసి హెడ్డుకు చూపించాడు.

హెడ్డు కూడా మెరుపు వేగంతో కాయి తాలూ, చిల్లరా అందుకొని ఖాకీ చొక్కా జేబులో వేసుకొని "అరేయ్ నా కొడకా! పాపాయిని తీసుకొని పరుగెత్తాలి నువ్వు. ఒక్క క్షణం ఆలస్యం చేసినా తుపాకితో కాల్చేస్తాను. కమాన్ మూవ్" అని అరిచి "వన్... టు... త్రీ!" అంటూ లెక్కించటం మొదలుపెట్టి ఫోర్ అంటూ చూసేసరికల్లా పానకాలు పరుగెత్తుతూ కనిపించాడు చాలా దూరంగా.

హెడ్డు అలా ఎందుకు చేశాడో అందరికీ అప్పుడు అర్థమైంది. గలగలా నవ్వారు. చూపులతోనే హెడ్డును అభినందించారు.

"రెండొందలకు పైనే వున్నాయి. ఇవ్వా ల్టికి వీటితో సరిపెట్టుకుందాం, పదండి" అన్నాడు హెడ్డు.

సెంట్రీ నిరాశగా చూస్తూ అక్కడే నిల్చుంటే హెడ్డు, రైటరు, వీరాస్వామి గెస్టు హౌసుకు దారి తీశారు.

"వచ్చింది అందరూ పంచుకోవాలిగానీ ఛీఛీ మరీ ఇది అన్యాయపు డిపార్టుమెం టైంది. కొంచెం కూడా నీతీ, న్యాయం లేక పోతే ఎలా?" అని తిట్టుకుంటూ తుపాకిని భుజం మీదికి ఎత్తుకున్నాడు సెంట్రీ.

పోలీసు త్రయం గెస్టు హవుసుకు చేరుకు న్నారు. అటెండరును పిలిచి పానకాలు దగ్గర కొట్టేసిన డబ్బు అతని చేతిలో పెట్టి బజారుకు వెళ్లి మందు తీసుకు రమ్మని చెప్పి పంపించారు.

అటెండరు వెళ్లిన కొంచెంసేపటికి ఆదరా బాదరా వచ్చాడు సుధీర్, వాళ్లను వెదు క్కుంటూ.

పోలీసు త్రయాన్ని చూసి అతడి ముఖం సంతోషంతో విప్పారింది! "దిల్‌ఖుష్‌ను పట్టుకొచ్చారటగా... ఎక్కడుంది?" అని అడిగాడు ఆత్రంగా.

కానిస్టేబులు వీరాస్వామి హెడ్డుకేసి చూశాడు అతనికి ఏం సమాధానం చెప్పాలి అన్నట్టు.

హెడ్డు పల్చగా నవ్వాడు. "అన్నిటికీ అంత తొందర అయితే ఎలా సుధీర్! కొంచెంసేపు అలా ప్రశాంతంగా కూర్చో మనం చాలా విషయాలు మాట్లాడుకోవాలి. ఇప్పటిదాకా నీకోసం స్టేషను దగ్గరే ఎదురు చూసి ఇక నువ్వు రావనుకొని మేమే వచ్చాం. నువ్వు రావటం చాలా మంచి దైంది" అని వీరాస్వామి వేపుకు తిరిగి "సుధీరు వస్తాడని నేను చెప్పలేదూ. అలాగే వచ్చేశాడు. స్నేహం అంటే అది" అన్నాడు తల ఎగురవేస్తూ.

సుధీర్ ఛాతీ ఉబ్బించి కుర్చీలో కూర్చు న్నాడు. "మందు మాట ఏమిటి?" అని అడిగాడు వీరాస్వామిని.

"ఇప్పుడే అక్కడా ఇక్కడా పోగుచేసి రెండొందలు దొరికితే మందుకోసం అటెండ రును పంపించి కూర్చున్నాం. మందు తెస్తాడు. అందరమూ అదే సర్దుకొని తాగు దామంటే సరే! చాలదు అనుకుంటే డబ్బు విషయంలో ఇక నువ్వే ఓపిక చేసుకోవాలి. ఇవ్వాళ ఫస్టు తారీకు గనుక మాకు జీతాలు వచ్చాయనుకుంటావేమో! గవర్నమెంటు దగ్గర బడ్జెట్టు లేదని జీతాలు ఇవ్వలేదు. ఆ పనిమీదనే సి.ఎం.గారు రాష్ట్రం విడిచి వెళ్లా రుట. ఎక్కడైనా ఆయనగారికి అప్పు దొర కాలి. వారు రాష్ట్రానికి తిరిగి రావాలి. అప్పుడే మాకిక జీతాలు" అని చెప్పాడు హెడ్డు.

రైటరు, వీరాస్వామి రహస్యంగా నవ్వుకు న్నారు.

"దిల్‌ఖుష్ ఎక్కడుంది?" అడిగాడు





సుధీర్.

"చెప్తానుగా తొందరెందుకూ! అది మనకు అందుబాటులోనే వున్నదిగానీ అసలు విషయం విను! నాలుగు రోజులు జీతాలు రావటం అటూ ఇటూ అయినా నాకుగానీ రైటరుగారిగ్గానీ అంత ఇబ్బంది వుండదు. ఉన్నదాన్లోనే కలోగంజో తాగుతూ కాలం వెళ్లబుచ్చగలం. కానీ మన కానిస్టేబులు వీరాస్వామికే చిక్కొచ్చింది"

"ఏమిటది? "

"వాళ్ల అమ్మగారికి ఉన్నట్టుండి పక్షవాతం వచ్చి కాలూ, చెయ్యీ పడిపోయాయి"

"అయ్యో! అంత ఘోరం జరిగిందా? మాటమాత్రమైనా నాతో చెప్పలేదేమండీ వీరాస్వామిగారూ? " నొచ్చుకున్నాడు సుధీర్.

"ఆ విషయంలోనే నేనూ, రైటరుగారూ వీరాస్వామిని మందలిస్తున్నాం. అంతలోనే నువ్వొచ్చావు. టాపిక్కు మారిపోయింది. మందుమీదికి మళ్లింది. "ఇంతకీ అసలు విషయం ఏమిటంటే" అని హెడ్డు చెప్పబోయినవాడల్లా ఆగి గుమ్మం వైపుకు చూశాడు.

తలుపు చప్పుడు చేస్తూ అటెండరు లోపలికి వచ్చాడు. తెచ్చిన సరంజామాను టీపాయ్ మీద సర్ది బైటికి వెళ్లబోయాడు.

"ఆగు" పిల్చాడు సుధీర్.

"ఏంటి సార్? "

"నేనూ వచ్చానుకదా! మందు చాలదు. మళ్లీ వెళ్లి ఇంకొక హాఫ్‌బాటిల్ మందూ కోడివేపుడూ పట్టుకొనిరా!" అని సుధీర్ జేబులోంచి వంద రూపాయి కాయితాలు రెండు తీసి ఇస్తూ మిగిలిన చిల్లర వుంచుకో" అన్నాడు.

అటెండరు ముఖం విప్పారింది. సంతోషంగా వెళ్లిపోయాడు.

"ఇక మొదలు పెడదామా? " గ్లాసుల వైపు చూస్తూ అన్నాడు సుధీర్.

కానిస్టేబులు వీరాస్వామి గ్లాసుల్లో మందు పోశాడు. నీళ్లు కలిపాడు. అందరూ తాగుతూ కూర్చున్నారు. కాలం దొర్లిపోతోంది.

"ఆ! ఇందాక మనం ఎక్కడ ఆగాం? " అని చేత్తో నొసలు రాసుకొంటూ "మన వీరాస్వామికి అంత కష్టం వచ్చినా సుధీర్‌కు కబురు ఎందుకు చెయ్యలేదు అన్న పాయింటు దగ్గర ఆగాం. అవునా? " అడిగాడు హెడ్డు.

"అవును... అక్కడే ఆగాం" అన్నాడు రైటరు వెంటనే.

"వీరాస్వామి చాలా మొహమాటస్తుడు. ఎంత కష్టం వచ్చినా కడుపులోనే దాచుకుంటాడుగానీ ఎదుటి వాళ్లను యాచించడు. జీతాలు రాలేదు. తల్లి మంచానపడ్డది. ఆస్పత్రి ఖర్చులే ఐదు వేలు అవుతాయట. నిన్ను డబ్బు అడగలేక ఆ బాధకు తట్టుకోలేకా మనిషి బేజారెత్తిపోతున్నాడనుకో! కోపం కూడా విపరీతంగా పెరిగింది వీరాస్వామికి. ఆ కోపంలో ఇందాక ఎంత బీభత్సం చేశాడో తెలుసా? "

సుధీర్ ఠక్కున తల ఎత్తి హెడ్డువైపు చూశాడు.

"దాని దుంపతెగ! ఆ దిల్ ఖుష్ అందంగా ముస్తాబై సినిమా హీరోయిన్లా సినిమా హాలుకు వస్తే దాన్ని నీకోసం మన వాడు అమాంతం రిక్షాలో వేసుకొని స్టేషనుకు తెచ్చాడు"

సుధీర్ కళ్లు తళుక్కున మెరిశాయి. అభిమానంగా చూశాడు వీరాస్వామివైపు.

"దాన్నీ, రోజానూ స్టేషనుకు తేగానే విద్యార్థుల దండు వచ్చిపడింది. డ్యాన్సర్లను విడిచిపెట్టమని ఒకటే గోల! వాళ్లు దిల్ ఖుష్‌ను నీకు దక్కకుండా చేస్తారేమోనని కంగారుపడ్డాడు వీరాస్వామి. సి.ఐ దొరగారు ఛార్జ్ అని అరవగానే ఆ కోపంలో మన వీరాస్వామి ఎంతమంది స్టూడెంట్లును చావబాదాడనుకున్నావ్? వీర విహారమే చేశాడనుకో!" అని సుధీర్ ముఖంలోకి

సూటిగా చూస్తూ

"నీకోసం అంత చేసినవాడు సహాయం అడగటానికి ఎందుకు నీ దగ్గర కూడా అంత మొహమాట పడుతున్నాడో మాకేమీ అర్థం కావటంలేదు" అన్నాడు హెడ్డు.

సుధీర్ వీరాస్వామికేసి చూశాడు. వీరాస్వామి ఎందుకో చాలా ఇబ్బందిగా నవ్వాడు.

"మనం మనం ఒకటి. అలాంటప్పుడు నా దగ్గర మొహమాటం ఎందుకూ? మీరు భలేవారేనే" అని ఆప్యాయంగా వీరాస్వామి భుజం మీద చేత్తో చరిచి "మన వాడికి నానుంచి ఏం సహాయం కావాలో మీరే చెప్పండి గురువుగారూ" అని అడిగాడు హెడ్డును.

"మరేం లేదుగానీ అర్జంటుగా ఐదు వేల రూపాయలు కావాలి మనవాడికి"

"ఐదు వేలే? ఇప్పటికిప్పుడు అంత డబ్బు కావాలంటే ఎలా? నా దగ్గర అంతా కలిసి ఐదొందలు కూడాలేవు. ఏం చేద్దాం? " అని ఆలోచనలో పడ్డాడు సుధీర్.

"మన వాడికి ఆ మాట కూడా ఇందాకనే చెప్పాను, అంత డబ్బు సుధీర్ దగ్గర వుండదని. అనుకున్నట్టే జరిగింది. దిల్ ఖుష్ తనను ఏమీ చెయ్యకుండా విడిచిపెడితే పది వేల రూపాయలు ఇస్తానన్నది. అందరమూ ఆశపడి తలలు వూపాంకానీ వీరాస్వామి ఒప్పుకోలేదు. వాళ్ల అమ్మగారికి పక్షవాతం వచ్చి అంత సీరియస్‌గా వున్నా స్నేహం అంటూ మాట ఇచ్చానంటూ అతను నీకోసం మొండికి తిరిగాడు. అనవసరంగా దిల్ ఖుష్ ఇస్తానన్న డబ్బు తీసుకోకుండా చేశాడు" అని సుధీర్ తొడమీద చరిచి,

"సుధీర్! పోనీ ఒక పని చేద్దామా? " అని అడిగాడు హెడ్డు.

"ఏంటి సార్? "

"పదివేలు తీసుకొని ఈసారికి దిల్ ఖుష్‌ను ఒదిలేద్దాం. ఐదు వేలు వీరాస్వామి అవసరాలకు ఇచ్చినా స్టేషనుకు ఇంకా ఐదు వేలు మిగుల్తాయి. ఇక నీ విషయం అంటావా! కొంతకాలం తర్వాత మళ్లీ దాన్ని పట్టుకోవచ్చు మన ఉచ్చులోనుంచి అది ఎక్కడికి పోగలదు. బాగా ఆలోచించు. వాళ్ల అమ్మగార్ని కాపాడాలంటే అంతకన్నా మరో మార్గం లేదుకదా? "

సుధీర్ తల ఒంచుకొని ఆలోచనల్లో కూరుకుపోయాడు. ఎంతోకాలంగా తను ఎదురు చూస్తున్న సమయం వచ్చి దిల్ ఖుష్‌ను పోలీసులు తనకోసం పట్టుకొచ్చారు. ఈ అవకాశం చెయ్యిజారిపోతే మళ్లీ ఇలాంటి సందర్భం ఎన్నాళ్లకు కుదుర్తుందో! పైగా కానిస్టేబులు వీరాస్వామి అవసరం మామూలు అవసరంకాదు. అనారోగ్యంతో వున్న అతని తల్లికి వైద్యం చేయించాలి.

ఇప్పుడు తను డబ్బు ఇవ్వకపోతే పోలీసులు దిల్ ఖుష్ దగ్గర డబ్బు తీసుకొని విడిచిపెడతారు. వాళ్ల అవసరాలు ఆగవు. తన కోర్కె తీరకపోగా తను అవసరానికి ఆదుకోలేదన్న కోపం రావచ్చు వాళ్లకు.

"డబ్బు చాలా అర్జంటా? " అని అడిగాడు సుధీర్.

"అవును. ఈ రాత్రికే వాళ్ల అమ్మగారిని ఆస్పత్రిలో చేర్చాలి"

సుధీర్ ఇంకేమీ మాట్లాడలేదు. మెడలో వున్న బంగారపు గొలుసు. వేళ్లకు వున్న రెండు ఉంగరాలూ తీసి వీరాస్వామి చేతిలో పెడుతూ "స్నేహితుల దగ్గర మరీ అంత మొహమాటం పనికిరాదు. కష్టసుఖాలు చెప్పుకోవాలి. సమయానికి నా దగ్గర డబ్బు లేదు. ఈ వస్తువులు ఎక్కడయినా తాకట్టు పెట్టి నీకు కావలసినంత డబ్బు తీసుకో. నిదానంగా వస్తువులు విడిపించుకుందాం!" అని చెప్పాడు.

"మన వాడికింకా మొహమాటంగా వుంది. పుట్టుకతో వచ్చింది ఎక్కడికి పోతుంది. ఛీఛీ! ఎలా బతుకుతాడో ఏమో" అని వీరాస్వామి చేతిలోవున్న వస్తువులను




లాక్కొని తన జేబులో వేసుకున్నాడు.

"ఈ వ్యవహారం నేను చూస్తాను. వీరా స్వామికి ఇవి తాకట్టు పెట్టించి డబ్బు ఇప్పిస్తాను" అని ఈసారి అన్ని గ్లాసుల్లో తనే స్వయంగా మందు నింపాడు హెడ్డు.

అటెండరు వచ్చాడు. మందు సీసా ఇచ్చి వెళ్లాడు. అందరూ మౌనంగా తాగుతూ కూర్చున్నారు.

సుధీర్ తెప్పించిన సీసా కూడా సగం ఖాళీ అయ్యాక కనురెప్పలు బలవంతంగా తెరచి చూస్తూ "ఇంతకీ దిల్‌ఖుష్ ఎక్కడుంది? ఆమే నా దగ్గరికి వస్తుందా, నేనే వెళ్లాలా? " అని అడిగాడు సుధీర్ నంగిగా.

అప్పటికే అతనికి నిషా తలకు ఎక్కింది. చీకటి తెరల్లో ఎక్కడో కొన్ని నక్షత్రాలు మెరవటం తప్ప అంతా అంధకారంగా వుంది. ఆ అంధకారంలో కూడా దివ్యంగా వెలిగిపోతూ చిర్నవ్వులు చిందిస్తూ తన సుకుమార హస్తాలను ముందుకు చాచి ఆహ్వానిస్తూ కనిపించింది దిల్‌ఖుష్.

ఎంతటి అందమైన దృశ్య భ్రమ.

"చెప్పరేం! దిల్‌ఖుష్ ఎక్కడ? " అని అడిగాడు సుధీర్.

రైటరు, వీరాస్వామి హెడ్డు వైపు చూశారు.

"అదే చెప్పబోతున్నాను. అన్నిటికీ అంత తొందరైతే ఎలా!" అని చాలా తాపీగా రెండు గుక్కల మందు తాగి గ్లాసు బల్ల మీద పెట్టి "దిల్‌ఖుష్ ఇప్పుడు డి.ఎస్.పి దొరగారి బంగళాలో వుంది" చెప్పాడు హెడ్డు.

"అక్కడ ఎందుకుంది? " అడిగాడు సుధీర్ నొసలు చిట్లించి.

"ఇంటరాగేషన్ చేస్తున్నారు"

"ఎవరు? "

"దొరగారే"

"ఇంతరాత్రివేళ ఆమెను దొరగారే స్వయంగా ఇంటరాగేషన్ చేసేంత అవసరం ఏమొచ్చింది? "

"అవసరం గనుకనే దొరగారు పూనుకున్నారు"

"కారణం? "

"దొరగారు తింటున్న ఉప్పుకారం" అని పెద్దగా నవ్వాడు హెడ్డు. రైటరు, వీరాస్వామి కూడా నవ్వు ఆపుకోలేకపోయారు.

"మీరేమి అంటున్నారో అర్థం కాలేదు నాకు. ప్లీజ్! దిల్‌ఖుష్ దొరగారి బంగళాలో ఎందుకు వుందో చెప్పండి" అని హెడ్డు చేతులు పట్టుకొని అడిగాడు సుధీర్.

హెడ్డు అతని వైపు సౌమ్యంగా చూశాడు. జ్ఞానిలా తల పంకించి "పిచ్చివాడా! మనం అందరమూ అల్ప మానవులమేగానీ అరిషడ్వర్గాలను జయించిన మహోన్నత వ్యక్తుల ముకాము! బిల్‌క్లింటన్ నుంచి బిచ్చగాడి దాకా అందరిలోనూ వున్నది వ్యామోహమే"

"అంటే? "

"దిల్‌ఖుష్‌ను నువ్వు కాంక్షించినట్టు డి.ఎస్.పి దొరగారూ కాంక్షించారు. కాంక్షించిన నిన్ను కాదన గల్గిందిగానీ దొరగార్ని కాదన లేదు పోలీసు అధికారి గనుక. ఈ రాత్రికి ఆయన ఓనమాలు దిద్దిస్తే రేపటి నుంచి అదే అందరికీ దిద్దించటం మొదలు పెడుతుంది. అప్పుడు నీ పని సులువవుతుంది. దొరగారు గానీ నువ్వుగానీ దానికేమీ తాళి కట్టే వాళ్లుకారు. బులపాటం తీర్చుకొని బజార్న వేసేవాళ్లే! కనుక నువ్వు నా మాట విని ఈ రాత్రికి దాన్ని మర్చిపో! రేపటినుంచి నువ్వు దాన్ని మర్చిపోయేదాకా అనుభవించు. ఎవరు కాదన్నారు? " అని సుధీర్ గ్లాసులో మందు పోశాడు హెడ్డు.

సుధీరుకు తాగిన నిషా అంతా దిగిపోయింది. ఎవరి కోసమైతే తను అంతగా అర్రులు చాచాడో! ఎవరి కోసమైతే తను పోలీసు స్నేహితులను ఆశ్రయించి వాళ్ల విలాసాలకోసం డబ్బు వెచ్చిస్తున్నాడో ఆ దిల్‌ఖుష్‌నే వాళ్లు దొరగారికి ఒప్పగించారు.

వాళ్లందరూ కలసి పథకం ప్రకారం తనను అవసరాలకు వాడుకొంటూ తెలివిగా

పూల్ని చేస్తున్నారా?

అతని వళ్లంతా కంపరం ఎత్తింది. తల విదుల్చుకున్నాడు. ఇక ఆ వాతావరణంలో క్షణం కూడా వుండలేక "నేను వెళ్తాను" అని అందరికీ వినిపించేలా చెప్పి కుర్చీలోంచి లేచి నాలుగు అడుగులు వేసి గుమ్మం దగ్గర ఆగి "నా వస్తువులు మళ్లీ ఎప్పుడు తెచ్చి ఇస్తారు? " అని అడిగాడు అక్కడినుంచే.

హెడ్డు కూడా లేచాడు. సుధీర్ దగ్గరికి వెళ్లాడు. చేత్తో అతని భుజంమీద తడుతూ "నీ వస్తువులు ఎక్కడికీ పోవు. ఆ పూచీ నాది" అన్నాడు ముఖమంతా నవ్వు పులుం కొంటూ.

సుధీర్ గబగబా నడుస్తూ బైటికి వెళ్లాడు. గెస్టు హవుసు ముందువున్న తన మోటారు బైక్‌మీద ఎక్కి విసురుగా ముందుకు దూకించాడు.

చల్లగాలిలో అలా రయ్యిన బండిమీద వెళుతున్నా అతని హృదయం రగిలిపోతూ ఆవిర్లు చిమ్ముతోంది. ఆలోచనలు ఎగసిపడుతూ అంతర్మథనం ఆరంభమైంది.

అందలాలు ఎక్కుతున్న వారిని ఆదర్శంగా తీసుకొని అదే మార్గంలో ప్రయాణం చేసినందుకు తనకిలాంటి అనుభవం, అవమానం చాలదు. చేసిన అకృత్యాలకు ఇంతకన్నా పెద్ద శిక్ష కావాల్సిందే.

అలా ఆలోచిస్తూ న్యూనతతో కృంగిపోయాడు సుధీర్. భావోద్వేగంతో చలించిపోతూ ఒక్క క్షణం మోటారు బైక్ హేండిలును వదిలేశాడు.

బైక్ అతని కంట్రోలు తప్పి రోడ్డు అంచున వున్న మురుగు కాలువదాకా వెళ్లి అందులో పడబోయిన చివరి క్షణంలో తెలివి తెచ్చుకొని బండిని అదుపు చేశాడు.

ఆ శబ్దానికే లైటు వెలుతురు మీద పడిన డిస్టర్బెన్సుకు కాలువ మురుగులో పడుకున్న ఒక పంది చివాలున లేచి మురుగును దులపరించుకొంటూ చివాలున కాలువ గట్టుమీదికి దూరంగా వెళ్లిపోయింది.

ఎంత చక్కని సందేశం!

కాకుంటే అది పంది గనుక మురుగును సుగంధ పరిమళంగా ఆనందిస్తూ ఆ ఆనందానికి అంతరాయం కలగ్గానే లేచి వెళ్లిపోయింది. అది మరో మురుగు గుంటను ఆశ్రయించవచ్చు. అవాంతరాలు, అంతరాయాలూ సంభవించినప్పుడైనా ఆ అనుభవాల వెల్తురులో మనిషి తెలివి తెచ్చుకోవాలి. అంతదాకా గడిపిన మురుగ్గుంట బతుకు నుంచి బయటపడాలి. తిరిగి మళ్లీ వాటి కోసం అన్వేషించకూడదు. ఆ కూడనిదే తేడా మనిషికీ, పందికీ.

సుధీరు మోటారు బైకు సినిమా హాలు సెంటరు చేరింది.

అప్పటిదాకా బీడీకొట్టు శేషయ్యద్వారా విషయాలన్నీ అప్పటికే అడిగి తెలుసుకుంది నేరేడు. దిల్‌ఖుష్, రోజాలను పోలీసులు పట్టుకొనిపోవడం, ఆ అన్యాయాన్ని ప్రతిఘటించిన విద్యార్థులను లాఠీలతో చెదరగొట్టటం, చైతన్యకు దెబ్బలు తగలటం.

పోలీసులు సుధీర్ కోర్కె తీర్చటంకోసం అంత ఘాతుకం చేసినందుకు కోపంతో ఉడికిపోయింది నేరేడు.



పోలీసుస్టేషను దగ్గర హెడ్డుగార

అంకెలు లెక్కపెట్టి మరీ ఉరికిస్తే పాపాయిని ఎత్తుకొని ప్రాణభయంతో పారిపోయిన పానకాలు ఆయాసంతో వగరుస్తూ ఇల్లు చేరుకున్నాడు.

చైతన్య కనిపిస్తే చాలు అతగాడికి కొండంత ధైర్యం! అసలే అనుభవంలేని పోలీసు వాతావరణాన్ని జీవితంలో ప్రప్రథమంగా చూసిన భయం ఒకవైపూ, అనవసరంగా నెత్తిన పడిన పాపాయి బాధ్యత మరోవైపూ...! పాపాయి అలా ఏడుస్తున్నదంటే అమ్మకోసం అన్న నిర్ణయానికి వచ్చాడు పానకాలు. తనకూ అమ్మ వుంది. ఆ అమ్మ మురిపెంగా పాలకోసం తను పోయిన గారాలను కథలు కథలుగా చెప్పేది తన బాల్యాన్ని గుర్తుచేస్తూ.

పాపాయి కూడా పాలకోసం అలా ఏడుస్తోందా? అన్న సందేహం వచ్చి, హెడ్డు లాఠీతో కొట్టిన దెబ్బ కాలుమీద సలుపుతీస్తున్నా నొప్పిని ఓర్చుకుంటూ ఇంటికి ఉరికాడు పానకాలు.

స్టేషనుదగ్గర జరిగిన గొడవ తరువాత చైతన్య తప్పకుండా ఇల్లు చేరుకొని వుంటాడు. సమయానికి ఎవరూ లేకపోయినా పాలవాడు వస్తే ఇంటివాళ్ళే తమ కోసం కూడా పాలు పోయించుకొని వుంటారు గనుక ఆ పాలే పాపాయికి తాగిస్తే ఏడుపు మానేస్తుందని అతగాడి ఆశ!

పానకాలు అలా పాపాయిని భుజంమీద మోస్తూ ఆత్రంగా ఇల్లు చేరుకొనేసరికల్లా ఇంటిముందు చాలామంది జనం గుమికూడి కనిపించారు. ఆడవాళ్ళు అధిక సంఖ్యలో వున్నారు.

పానకాలుకు సంతోషం వేసింది! వాళ్ళందరూ చైతన్య కోసమూ- దిల్ ఖుష్, రోజా అనబడే ఇద్దరు అమ్మాయిల జీవితాలను ఛిద్రం చేస్తున్న పోలీసుల రాక్షస కృత్యాన్ని ప్రతిఘటించటం కోసమూ కాకపోతే ఎందుకు పోగవుతారూ!?

ముఖం విప్పార్చుకొని హడావుడిగా తమ గదిలోకి వెళ్ళేందుకు నాలుగుమెట్లు ఎక్కినవాడల్లా పై గది తాళంవేసి వుండటం గమనించి యింకా చైతన్య ఇంటికి రానందుకు ఆశ్చర్యపోతూ అక్కడే నిల్చున్నాడు పానకాలు.

గది ఒక తాళంచెవి తన దగ్గర కూడా వున్నా చైతన్య యింకా గూటికి ఎందుకు చేరుకోలేదు? పాపాయికి పాలు తాగించేందుకు మార్గం ఏమిటి? ఇంటివాళ్ళు పాలు తీసుకున్నారా, లేదా? యిత్యాది శంకలతో అక్కడే నిల్చున్న పానకాలుకు అక్కడ గుమికూడిన జనం సాయిబాబా భజనకు వచ్చి ఆ సత్కార్యం పూర్తిచేసుకొని ప్రసాదాల కోసం నిలబడ్డవాళ్ళని తెలియటానికి అట్టేసేపు పట్టలేదు! గుంటూరునుంచి వచ్చిన ఛాలెంజి భజన పాటగాడు వెళ్ళాడేమో మైకువాడు సామాగ్రిని రిక్షాలో సర్దుకొని వెళ్ళే సన్నాహాల్లో కనిపించాడు. అద్దెకు తెచ్చిన కరెంటు జనరేటరు వాడికి బాడుగ యిస్తూ కరెంటు రాకడా- ప్రాణం పోకడా తెలీని యీ రోజుల్లో కూడా యివ్వాళ కరెంటు పోలేదంటే అంతా మన భజన మహిమే! కాకపోతే యివ్వాళ కరెంటు పోనివ్వనని మాటమాత్రం తెలిస్తే జనరేటరు బాడుగ తప్పేది! అని నొచ్చుకొంటూ ఇంటి ఓనరు యాదృచ్ఛికంగా చూశాడు మెట్లమీద నిల్చున్న పానకాలువైపు.

"ఏమేవ్... పానకాలు వచ్చాడు" అని అరిచాడు పెద్దగా.

పానకాలు హతాశుడయ్యాడు- తను ఊహించినట్టు ఆ జనం చైతన్యకోసమూ, బతుకులు ఛిద్రం కాబోతున్న ఆడవాళ్ళకోసమూ రాలేదు. భజనకోసం వచ్చారంతే. ప్రసాదాలకోసం ఒకళ్ళనొకళ్ళు నెట్టుకుంటున్నారంతే!

ఆ భక్తులవైపు వింతగా చూస్తూ నిల్చున్నాడు పానకాలు.

భర్త తనను పిలిచిన పిలుపు వింది

ఇంటి ఓనరిణి! ఓనరూ, ఓనరిణీ ఒకళ్ళ భావాలనొకళ్ళు గౌరవించుకొని సఖ్యతగా జీవితాలు వెళ్ళదీసేవాళ్లే.

"వీడి ముఖంమండ! అయినా వీడిదేముం దిగానీ చైతన్యను అనాలి ఇలాంటి గొడవ లను ఇంటిమీదికి తెచ్చినందుకు. వాడు వచ్చాడా? " అని అరుస్తూ రుసరుసలా డుతూ భర్త చెయ్యి పట్టుకొని లాగుతూ ఇద్దరూ పానకాలు దగ్గరికి వచ్చారు. అతని చేతుల్లోవున్న పాపాయిని చూశారు ఆశ్చ ర్యంగా.

"చైతన్య యింకా ఇంటికి రాలేదా? " అడి గాడు పానకాలు.

"రాలేదుగానీ ఆ పాపాయి ఎవరు? " అడి గిందామె.

ఏం చెప్పాలో పానకాలుకు తోచలేదు "పాపాయి... పాపాయి" అని నసిగాడు.

"నిజం చెప్పు, యీ పిల్ల ఎవరు? ఇంత కుముందే చైతన్యకోసం పోలీసులు వచ్చి వెళ్లారు. పెళ్ళికాని నువ్వు పసిపిల్లను ఇంటికి తెచ్చావు. మాది సంసారం చేసు కొనే ఇల్లుకానీ సానికొంపకాదు. హవ్వ...! ఇంటిమీదికి పోలీసులు వచ్చారంటే ఎంత సిగ్గుచేటు! అసలే మాది నిత్యపూజలూ, భజనలూ జరిగే ఇల్లు. అలాంటి ఇంట్లో మీ ఆటలు సాగవు. తక్షణమే ఇల్లు ఖాళీచేసి వెళ్ళండి" అని గుడ్లు మిటకరించిన భర్త వైపు చూస్తూ,

"అయినా మిమ్మల్ని కాదు అనాల్సింది, ఈయన్ను. మంచీచెడూ తెలుసుకోకుండా ఎవరికిపడితే వాళ్ళకు ఇళ్లు అద్దెకిస్తే ఇలాగే జరుగుతుంది" అని మళ్ళీ పానకాలు వైపుకు తిరిగి "చెప్పింది వినిపించిందా నీకు? " అని అడిగింది.

"చైతన్య ఎక్కడున్నాడో చూస్తాను. రేపే మీ ఇల్లు ఖాళీచేస్తాం" అని చెప్పి అక్కడ క్షణం కూడా వుండబుద్ధికాక పాపాయిని చేతుల్లోంచి భుజంమీదికి మార్చుకొని ఆ నాలుగు మెట్లూ కిందికి దిగి బైటికి దారితీ శాడు పానకాలు. వీధిలో నిలబడి కొంచెం సేపు ఆలోచించాడు.

పాపాయి ఆకలి తీర్చే మార్గం ఏమిటి? పాపాయిని బుజ్జగించి నిద్రపుచ్చి రోజా తిరి గిరాగానే ఆమెకు అప్పగించే మార్గం ఏమిటి?

అప్పుడు అతనికి నేరేడు గుర్తొచ్చింది. ఆమెకోసం బయల్దేరాడు. వడివడిగా నడుస్తూ సినిమాహాలు సెంటరుకు చేరు కొని ఎందుకో యాదృచ్ఛికంగా తలపైకి ఎత్తి శేషయ్య బీడీ బంకువైపుకు చూశాడు.

అక్కడ నిలబడి కనిపించింది నేరేడు. ఆమె పక్కనే సుధీర్ కూడా వున్నాడు.

పానకాలుకు నేరేడును చూడగానే కొండంత ధైర్యం చిక్కింది. కొద్దిపాటి పరి చయంలోనే అతనామె మనస్తత్వం గ్రహిం చాడు. మాట కరకు, మనసు మెత్తన!

ఈ దుర్మార్గపు ప్రపంచంలో సన్మార్గంలో బతకాలన్న ప్రతి మనిషికీ ఆపాటి కరకు తనం ఎంతో అవసరం. సందర్భాన్నిబట్టి ఒక్కోసారి తెగించి పోరాడేందుకు కూడా సిద్ధపడని సన్మార్గుడ్ని ఈ దుష్టప్రపంచం, దానిని పరిపాలిస్తున్న రాజ్యం బతకని వ్వదు. ఇనపముక్కుల కాకుల్లా పొడుచు కొని తింటుంది. గేదె గాయానికి ముక్కుతో మందురాసి నయం చేస్తున్నానని కాకి చెప్పి నట్టే చట్టం, శాంతి, నీతి, రాజభక్తి, యిత్యాది నీతి సూత్రాలను వల్లిస్తుంది. అలా వల్లి స్తూనే సన్మార్గులను వేపుకొని తింటుం టుంది!

పానకాలు నేరేడు దగ్గరికి వెళ్ళాడు. ఆమె చాలా రౌద్రంగా సుధీర్‌మీద విరుచుకొని పడుతోంది.

"మైనరుబాబూ! యిప్పుడు నీ కళ్ళమంట చల్లారిందా? దిల్‌ఖుష్‌ను పోలీసులకు అప్పగించావు. దానివెంట సినిమాకు వెళ్ళిన నేరానికి రోజాను కూడా పోలీసులకు బలిచే శావు. కోరుకున్న అమ్మాయి మనసును జయించటం మగతనం కానీ యిలా చివరికి





పోలీసులకు అప్పగించటం మగతనం కాదు. దాన్ని డాఫర్ పని అంటారు. ఆ పని పక్కలు వేసేవాళ్ళు చేస్తారు. అలా చేసినందుకు నీకు సిగ్గుగా లేదూ? " అంది నేరేడు.

సుధీర్ తల వంచుకొని మౌనంగా నిల్చు న్నాడు.

నేరేడు కేకలకు పానకాలు భుజంమీద తలవాల్చి కునుకు తీస్తున్న పాపాయి ఉలి క్కిపడి నిద్రలేచింది. లేవగానే ఏడుపు లంకించుకుంది.

అప్పుడు చూసింది నేరేడు పానకాలువైపు "పాపాయి ఎవరు? " అని అడిగింది అతడి చేతిలోంచి పాపాయిని అందుకొంటూ.

"రోజా కూతురు" చెప్పాడు పానకాలు.

నేరేడు హృదయం భగ్గున మండింది. కొలుములా మండే కళ్ళతో సుధీర్‌వైపు కోపంగా చూస్తూ, "నువ్వు చేసిన వెధవప నికి ఈ పాపాయి చూడు ఎంతగా అల్లాడి పోతుందో! దీని అమ్మను సి.ఐ.గాడికి తార్చావు. దిల్‌ఖుష్‌ను డిఎస్‌పి బంగళాకు సరఫరా చేశావు. వాళ్ళ ఉసురు నీకు కొంచెం ఆలస్యంగా తగుల్తుందేమోగానీ యీ పసిదాని ఉసురు వెంటనే తగు ల్తుంది" అని అతడ్ని పురుగును చూసినట్టు చూసింది నేరేడు.

బీడీ బంకులో కూర్చొని అంతా వింటున్న ఆంజనేయులుకు ఎందుకో ఒళ్ళు మండింది!

"అందరూ బీడీ బంకులకాడ నిలబడి ముచ్చట్లు ఆడుకోండి. ఆడ అన్యాయం జరి గిపోతోంది. నలుగుర్ని పోగేసుకొని వెళ్ళి ఆడాళ్ళను యిడిపించాలిగానీ యీడుంటే ఏంటి జరిగేది? " అన్నాడు కోపంగా.

అంత చిన్న వయసులోనే ఆ కుర్రవాడికి అలాంటి ఆలోచన కలగటానికీ, పోలీసుల మీద ద్వేషం ఏర్పడటానికీ కారణం ఏమిటో అర్థంచేసుకుంది నేరేడు! బీడీ బంకు దగ్గర చాలాకాలంగా వాళ్ళు చలాయిస్తున్న దాష్టీ కాన్ని అతను చూస్తున్నాడు. నిరంకుశంగా వాళ్ళు అమలుచేస్తున్న దండనీతిని గమని స్తున్నాడు. అందుకే ఆంజనేయులు అలా కోపంగా మాట్లాడాడని చిర్నవ్వు నవ్వుతూ అభిమానంగా అతనివైపు చూసింది నేరేడు.

కొడుకు మాటలకు కొంచెం భయపడ్డాడు శేషయ్య. ఎవరైనా విన్నారేమో అని చుట్టూ చూశాడు. ఎవరూ వినటంలేదని గమనించి,

"పిల్లకాకికేం తెలుసు వుండేలు దెబ్బ! అని నీకేం తెలుసురా పోలీసుల వ్యవ హారం. అనవసరపు విషయాల్లో జోక్యం కలిగించుకోవద్దు" అని మందలించాడు.

తిరస్కారంగా చూశాడు ఆంజనేయులు.

నేరేడు వాళ్ళ మాటలు వింటూనే టీ బంకు దగ్గరకి జరిగింది. ఒక గ్లాసులో పాలు పోయించుకొని వేడిపాలు చల్లారే దాకా నోటితో వూదింది. అక్కడే వున్న చెక్కబల్లమీద కూర్చొని చూపుడు వేలును పాలలో ముంచుతూ, పాపాయి నోటికి అందిస్తూ కూర్చుంది.

చాలా సేపటినుండి స్థాణువులా అక్కడే నిల్చున్న సుధీర్ నెమ్మదిగా కదిలి నేరేడు దగ్గరికి వెళ్ళాడు. వంచిన తల ఎత్తకుండానే "పొరపాటు చేశాను" అని యిక అక్కడ నిలబడకుండా వెళ్ళి మోటారు బైక్ స్టార్టు చేసి ముందుకు దూకించాడు.

గ్లాసులో వున్న పాలను అలా పాపాయికి తాగించి భుజంమీద వేసుకొని లేచి నిల్చుంది నేరేడు.

పాపాయి యిప్పుడు ఏడవటంలేదు. నేరేడు భుజంమీద మగతగా పడుకుండిపో యింది.

"చైతన్య కనిపించాడా? " పానకాలును అడిగింది నేరేడు.

"లేదు... వాడికోసమే ఇంటికి వెళ్ళాను. పోలీసులు వచ్చి వెళ్ళారుట. అరెస్టు చేస్తా రేమో! ఆ విషయం తెలిసే వాడు ఎక్క డైనా దాక్కొని వుంటాడు"

"దిల్‌ఖుష్, రోజాల విషయంలో ఏమీ చెయ్యలేమా? " అడిగింది నేరేడు.

"అలాంటి ప్రయత్నం చేసినందుకే కదా విద్యార్థులను పోలీసులు లాఠీలతో బాదింది. చైతన్య కోసం వెతుకుతున్నది"

"నిస్సహాయంగా చూస్తూ వుండట మేనా? "

"అంతకన్నా మనం ఏం చెయ్యగలం! వాళ్ళ దగ్గర అధికారం వుంది. ఆయుధాలు వున్నాయి" అని యిక ఆ విషయాన్ని కట్టి పెట్టి "పాపాయి విషయం ఎలా? " అని అడిగాడు పానకాలు.

"రాత్రికి నా దగ్గరే వుంటుంది. రోజా వస్తేనేగానీ ఏ విషయమూ తెలియదు మనకు. పొద్దున్నే దాని ఇంటికి వెళ్తాను. పాపాయిని యిచ్చి వివరాలు కనుక్కుం టాను"

"అయితే యిక నేను వెళ్తాను. వేరే రూమ్ కూడా చూసుకోవాలి. వున్న ఇల్లు ఖాళీ చెయ్యమన్నారు" అని వెళ్ళేందుకు నాలుగు అడుగులు వేశాడు పానకాలు.

అతను కుంటుతూ నడవటం గమనిం చింది నేరేడు. పెద్దపెద్ద అంగలు వేస్తూ అతనికి దగ్గరికి వెళ్ళి "కాలికి ఏమైంది? " అని అడిగింది.

"పోలీసులు కొట్టారు" చెప్పాడతను.

"లాఠీచార్జిలోనా? "

"కాదు"

"మరి? "

"మందు తాగే డబ్బులకోసం!"

అక్కడ కొంచెంసేపు మౌనం పరచు కుంది.

"నువ్వా యీ రాత్రికి మా ఇంట్లోనే వుండు. పొద్దున్నే ఇద్దరం కలసి రోజా దగ్గ రికి వెళ్దాం" అని మొహమాటపడే అవకాశం అతనికి యివ్వకుండా చెయ్యి పట్టుకొని ముందుకు నడిపించింది నేరేడు.

★ ★ ★

తెల్లవారింది... రాత్రి నేరేడు ఇంట్లో భోజనం చేసి నిద్రపోయాడు పానకాలు. కాలికి నేరేడు నూనెతో మర్దన చేసి కాపడం పెట్టింది వద్దని వారిస్తున్నా వినకుండా. రాత్రంతా పానకాలు కలల్లోకి పోలీసులే వచ్చారు.

ఉదయాన్నే పానకాలు, నేరేడూ రోజా ఇంటికి బయల్దేరారు. పాపాయికి స్నానం చేయించి ముస్తాబు చేసింది నేరేడు. ఎత్తు కొని, పానకాలు వెంట డ్యాన్సర్ల వీధికి చేరు కుంది.

ఎప్పుడూ అరుపులూ, కేకలతో కిక్కిరిసిన జనంతో సందడిగా వుండే ఆ వీధి వాతావ రణం పూర్తిగా మారిపోయి కనిపిస్తోంది. అరుగులమీద కూర్చొని కబుర్లాడే జనం గానీ, ఏ డ్యాన్సు పార్టీని ఎవరు బుక్ చేశారా అన్న వ్యాపారపరమైన చర్చలుగానీ అక్కడ కనిపించలేదు. అంతగా వీధిలో జనసంచారం లేకపోగా కనిపించిన వాళ్ళ ముఖాలు కూడా చాలా గంభీరంగా వున్నాయి.

నడక వేగం పెంచింది నేరేడు. పాన కాలు కూడా ఆమె వెంట వేగంగా నడవసా గాడు వీధిని పరీక్షగా చూస్తూ.

అది చాలా యిరుకు వీధి. ఇళ్ళముందు చిన్నచిన్న బడ్డీకొట్లూ, రెండోమూడో టీ దుకాణాలూ వున్నాయి. ఆ వీధిని ఎవరూ పట్టించుకోరేమో! పారిశుద్ధ్యం బొత్తిగా లేదు. గతుకుల రోడ్డు పక్కని మురుగు కాల్వలు నిండిపోయి వీధిలోకి ప్రవహిస్తూ.

పాడుబడిన ఆ ఇళ్ళలో డ్యాన్సర్లూ, ఆర్కెస్ట్రా వాళ్లూ... వీధిలో ప్రతి అడుగు లోనూ మూర్తీభవించిన పేదరికం స్పష్టంగా కనిపిస్తుంటే ఎందుకో పానకాలు మనసుకు బాధనిపించింది! రికార్డు డ్యాన్స ర్లను గురించి రకరకాల పుకార్లు విన్నాడు. అదే నిజమైతే ఆ వీధిలోని డ్యాన్సర్ల ఇళ్ళు అలా ఎందుకుంటాయి? అన్న ఆలోచన వచ్చిందతనికి.

'మంచిని చెడు, చెడును మంచి అనే మాయాప్రపంచం యిది' అనుకున్నాడు మనసులో.





వాళ్ళు రోజా ఇల్లు చేరుకున్నారు. ఎలక బొరియల మట్టిగోడల ఇంట్లోకి వెళ్ళారు. రోజా ఇంట్లోనే వుంది. గది మధ్యలో చింకి చాపమీద శోకదేవతలా కూర్చున్న దల్లా మనుషుల అలికిడి విని ఉలిక్కిపడి చూసింది.

నేరేడు భుజంమీద కనిపించిన తన సర్వస్వమూ అయిన పాపాయిని గమ నించి రివ్వున లేచి వెళ్ళి పాపాయిని లాక్కొని అపురూపంగా చూస్తూ ముఖం మీద ముద్దుల వర్షం కురిపించి హృదయా నికి హత్తుకుంది.

అప్పుడు గమనించారు వాళ్ళు రోజా బుగ్గలమీద కందిన గాట్లను! అప్పటిదాకా ఏడుస్తూ కూర్చున్నందుకు దాఖలాగా కళ్ళు జ్యోతుల్లా ఎర్రగా మండుతూ ఉబ్బి వున్నాయి. రేగిపోయిన జుట్టును ఆమె యింకా దువ్వుకోలేదు.

రాత్రి ఏం జరిగి వుంటుందో వాళ్ళు ఊహించుకున్నారు. ఆ విషయం ఆమెను పానకాలు ముందు ఎలా అడగాలి? అని సంశయిస్తూంది నేరేడు. ఆమె భావాన్ని పానకాలు అర్థంచేసుకున్నాడు. "ఇక నేను వెళ్తాను" అని చెప్పాడు పెద్దగా.

పాపాయి స్పర్శతో పులకించిపోతూ బాహ్యప్రపంచాన్ని మరచిపోయిన రోజా అతని మాటలు విని తల విదుల్చుకొని చూసింది అతనివైపు. నేరేడునూ అప్పుడు పలుకరించింది. రాత్రంతా పాపాయిని భద్రంగా చూసుకున్నందుకు కృతజ్ఞతలు చెప్పింది.

"అలా వున్నావేం? " ఆత్రుత అణచుకో లేక పానకాలు విషయం మర్చేపోయి అడి గింది నేరేడు రోజాను.

పానకాలు బైటికి వెళ్ళబోతే వారించింది రోజా! గాజుగోళీల్లాంటి కళ్ళతో నిర్వికా రంగా చూస్తూ "ఇందులో దాపరికమే ముంది! రాత్రి నేను సి.ఐ. కామదాహానికి సమిధనయ్యాను" అని చెప్పింది గద్గద స్వరంతో.



పానకాలు స్నేహితుల రూముల్లో అక్క డక్కడా రాత్రులు పడుకొంటూ రెండురో జులు గడిపాడు. చైతన్యకోసం ఎంత ఆరా తీసినా అతని జాడ తెలియరాలేదు. పరీ క్షలు మళ్ళీ ఎప్పుడు జరుపుతారో తేల లేదు.

ఇల్లు ఖాళీచేసి సామాన్లను స్నేహితుడి గదిలోకి మార్చాలని ఒకరోజు వెళుతుంటే దారిలో కనిపించింది లేడీ కానిస్టేబులు రత్తమ్మ. అతడ్ని గుర్తుపట్టి పలుకరించి "పాపాయిని రోజా దగ్గరికి చేర్చావా? " అని అడిగింది.

"చేర్చాను" చెప్పాడు పానకాలు.

"చైతన్య నీకు స్నేహితుడు కదూ? "

"అవును"

"అతన్ని మావాళ్ళు అరెస్టు చేశారు!"

పానకాలు నిర్ఘాంతపోయాడు కొంచెం సేపు. "ఎందుకూ? " అని అడిగాడు ఒణికే గొంతుతో.

"అలా కుర్రాళ్ళను వెంటపెట్టుకొని పోలీ

సుస్టేషనుమీద దాడి చేస్తే గవర్నమెంటు వూరుకుంటుందా! అతని మీద కుట్ర- అక్రమంగా ఆయుధాలు కలిగి వుండటం- పథకం ప్రకారం పోలీసుస్టేషనుమీద దాడి చెయ్యడటం- ఉగ్రవాదాన్ని ప్రోత్సహించటం- యిత్యాది ఆరోపణలతో కేసు పెట్టారు. అరెస్టుచేసి రిమాండుకు పంపించారు"

"ఇప్పుడెలా? " మధ్యలోనే అడిగాడు పానకాలు.

"ఎవరు చేసేదీ ఏమీలేదు. లొసుగులు లేకుండా కేసు బలంగా తయారుచేశారు. అతనికి శిక్ష తప్పించటం జరిగే పనికాదు" అని సైకిలు తొక్కుకుంటూ వెళ్ళిపోయింది రత్తమ్మ.

పానకాలుకు ఏం చెయ్యాలో అర్థంకాలేదు. కొంచెంసేపు అక్కడే నిలబడి ఆలోచించి చివరికి ఆ విషయాన్ని చైతన్యవాళ్ళ ఇంటికి టెలిగ్రాం యివ్వాలన్న నిర్ణయానికి వచ్చాడు.

అక్కడికి దగ్గర్లోనే వుంది టెలిగ్రాఫ్ కార్యాలయం. వెళ్ళాడు. చైతన్య తండ్రికి అరెస్టు విషయం టెలిగ్రాం యిచ్చి ఇంటికి వెళ్ళాడు.

ఇంటి యజమాని మళ్ళీ ఏదో భజనకు సన్నాహాలు చేస్తూ కనిపించాడు. దగ్గరికి వెళ్ళి ఆ నెల అద్దె చెల్లించి సామాన్లను రిక్షాలో వేసుకొని వెళ్ళిపోయాడు. స్నేహితుడి రూమ్‌లోకి చేర్చాడు.

ప్రశ్నపత్రాల లీకేజితో వాయిదా పడ్డ పరీక్షలు సోమవారంనుంచి ప్రారంభమౌతాయని వార్తల్లో చెప్పారు. ఆరోజు గురువారం. అంటే మరో నాలుగు రోజులకు పరీక్షలు జరుగుతాయన్నమాట!

పానకాలుకు పరీక్షల విషయం ఆసక్తి కలిగించలేదు. ఒక విధంగా అతనికి రాయ బుద్ధికూడా కావటంలేదు. మనసంతా చైతన్య మీదనే లగ్నమైవుంది. అతని విషయం తెలిసి ఊర్నించి చైతన్య తరపు వాళ్ళెవరైనా వచ్చేలోగా తనూ ఏదో ఒకటి చెయ్యాలి అనుకున్నాడు. కాలేజి విద్యార్థులను కలసి చైతన్యను పోలీసులు అరెస్టుచేసిన విషయం చెప్పి అతనిమీద బనాయించిన అక్రమ కేసులు ఎత్తివెయ్యాలని ఆందోళన చేద్దామని అడిగాడు.

ఎవ్వరూ అతని మాటలు పట్టించుకోలేదు. అతని నిర్ణయాన్ని సమర్థించలేదు. జరిగిన లాఠీఛార్జికే వాళ్ళంతా బెదిరిపోయారు. అదీకాక పరీక్షల తేదీ ప్రకటించారు.

ఒక స్నేహితుడు మాత్రం అప్పుడే తనకి తెలిసిన విషయాన్ని పానకాలుకు చెప్పాడు! చైతన్యకు ఒకవేళ బెయిలు దొరికి బైటికి వచ్చినా, లేదా న్యాయమూర్తి అనుమతితో పోలీసు ఎస్కార్టుతో వచ్చినా అతను పరీక్షలు రాసే అవకాశంలేదుట. కాలేజి కమిటి చైతన్యను కళాశాలనుంచి బహిష్కరిస్తూ పరీక్షలు కూడా రాసేందుకు వీలులేకుండా ఉత్తర్వులు జారీచేసి నోటీసు బోర్డుమీద అంటించారుట.

పానకాలు ముఖం వివర్ణమైంది! ఆనాడు సుధీర్ గ్యాంగు రాగింగు చేస్తుంటే ఎదుర్కొన్నందుకు, కళాశాల ప్రిన్సిపాలుకు నీతిబోధలు చేసినందుకూ వాళ్ళు మనసులో పెట్టుకున్న కక్షను యీవిధంగా తీర్చుకున్నారన్న మాట!

పానకాలు పరీక్ష రాయకూడదన్న నిర్ణయానికి వచ్చాడు.

చుట్టూ వున్న ప్రపంచం యింత అక్రమాల పుట్టగానూ, అన్యాయాల మయంగానూ వుంటే తను పరీక్షలు రాసి ఏం చెయ్యాలి. పాసవ్వాలి. నిరుద్యోగం చెయ్యాలి. ఒకవేళ ఉద్యోగం వచ్చినా జీవితం అద్భుతంగా మార్తుందా?

జీవితాన్ని వెచ్చించి తెచ్చే జీతంతో సుష్టుగా భోంచెయ్యొచ్చు. పొద్దున్నే కారప్పొడికి నెయ్యి జోడించి వేడివేడి ఇడ్లీ తినొచ్చు. భార్యాబిడ్డలతో కలసి కూర్చొని టీవీలో అంతంలేని సీరియల్సు చూడొచ్చు. ఊహ





లోకాల్లో తేలిపోవచ్చు. అదే జీవితం అని భ్రమపడొచ్చు. కానీ,

అడుగు అడుగునా హక్కులు కోల్పోతూ బలవంతులకూ అక్రమ రాజ్యానికీ, దానిని పరిరక్షించే పేరిట ప్రజలను వేధిస్తున్న పోలీసు యంత్రాంగానికీ తలలు వంచుతూ, అవమానాలను సహిస్తూ ఆనందంగా బతికే వెధవాయితనం వద్దు. బానిసకు యజమాని విసిరేసే రొట్టెముక్కకన్నా హీనాతి హీనం యీ సౌఖ్యం!

క్షణంకూడా తాను హక్కులను కోల్పోలేడు. అవమానాలు భరించలేడు. ఎవరి హక్కులనూ భగ్నం చెయ్యడు. ఎవరైనా తన హక్కులను భగ్నంచేస్తే అగ్నిలా ప్రజ్వరిల్లి దగ్ధం చేస్తాడు.

పానకాలు దీర్ఘంగా నిట్టూర్చి లేచి నిల్చున్నాడు. ఎందుకో కొంతకాలం ఆ వాతావరణానికి దూరంగా వెళ్ళాలనిపించింది. ఊళ్లు తిరిగి కొత్త ప్రదేశాలు చూస్తే అక్కడయినా కలతపడిన తన మనసుకు కాస్తంత వూరట చిక్కుతుందని అనుకున్నాడు.

చైతన్య విషయంలో తను ఏమీ చెయ్యలేడు. ప్రయత్నాలు ఏమైనా చేస్తే అతని తల్లిదండ్రులే చేస్తారు గనుక అక్కడ తన అవసరంలేదు.

ఆరోజు రాత్రికే సూట్ కేసులో బట్టలు సర్దుకొన్నాడు.

★ ★ ★

ఆ రాత్రి దిల్ ఖుష్‌ను జీపులో తీసుకొని వెళ్లి కానిస్టేబుళ్ళు డిఎస్పీ బంగళాలో విడిచిపెట్టాక దిల్ ఖుష్ పులిని ప్రతిఘటించిన జింకపిల్లలా కొంచెంసేపు ఆయన్ను ప్రతిఘటించింది. కానీ చివరికి లొంగిపోక తప్పలేదు.

అంతా ఐపోయింది. తన జీవితం సర్వనాశనమైంది. చెరిపినా చెరగని మచ్చ తనకు మిగిలింది. ఎన్నో ఆశలు చూపించినా సుధీర్‌కు లొంగని తనను అతని ప్రోద్బలంతో పోలీసులు వెంటాడి వేధించారు. అనుకున్నది సాధించారుగానీ అవకాశం సుధీర్‌కు ఇవ్వకుండా తన శరీరాన్ని డిఎస్పీకి రక్తపు కూడుగా మార్చి నైవేద్యం పెట్టారు!

మంచంమీద కూర్చొని ఆమె వలవలా ఏడుస్తుంటే తన పబ్బం గడుపుకొని పడుకున్న డిఎస్పీ నెమ్మదిగా లేచి కూర్చున్నాడు. అనునయంగా ఆమెను అక్కున చేర్చుకొని కన్నీళ్లు తుడిచాడు.

సర్వీసులో అలాంటి అనుభవాలు ఎన్నో వున్నాయి అతగాడికి! కానీ దిల్ ఖుష్ అంత అందగత్తె ఎప్పుడూ అతనికి తారసపళ్ళేదు. ఆమె హొయలూ, ఒంటి ఒంపులూ, అవయవాల సౌష్టవం అతడ్ని ముగ్ధుడ్ని చేశాయి. ఆమెతో పొందిన అనుభవం హృదయాన్ని గిలిగింతలు పెట్టింది. దిల్ ఖుష్‌తో శాశ్వతంగా 'అనుబంధం' కొనసాగించాలన్న నిర్ణయానికి వచ్చి,

"ఇప్పుడు ఏం జరిగిందని అలా ఏడుస్తావ్? నిన్ను వాడుకొని వొదిలెయ్యను. నేనే వుంచుకుంటాను. నీ జీవితాన్ని అద్భుతంగా మారుస్తాను. నీకో మంచి ఇల్లు కట్టిస్తాను. అన్ని సౌకర్యాలూ కల్పిస్తాను. కోరినంత డబ్బిస్తాను. డిఎస్పీ ఉంపుడుకత్తెగా నీకు వుండే గౌరవమర్యాదలు రికార్డు డ్యాన్సరుగా వుండవుకదా!" అని ఆమె ముంగురులు సవరించి-

"దిల్ ఖుష్! నువ్వు జీవితాంతం రికార్డు డ్యాన్సులు వేసినా మెడలో చిన్నమెత్తు బంగారానిక్కూడా నోచుకోలేవు. కడుపునిండా తిండీ, అనువైన గుడ్డా, గూడూ కూడా అమరవు నీకు. ఒకవిధంగా నువ్వు నా ఆశ్రయం పొంది చాలా అదృష్టవంతురాలివయ్యావు. వేధించిన పోలీసులే ఇక నీకు సలాములు చేస్తారు. నా బంగళాలో ఆర్డర్లీలు నీ ఇంటి పనిమనుషులుగా సేవలు చేస్తారు. కొండమీది కోతిని తెమ్మని నువ్వు ఆదేశిస్తే చాలు మరుక్షణమే వెళ్ళి మా కానిస్టేబుళ్ళు నాలుగు కోతుల్ని

తెస్తారు. నా అధికార పరిధిలో వున్న అన్ని పోలీసుస్టేషన్లలో నీ అధికారం చెల్లుబాటవుతుంది. నీ వల్ల ఇతర డ్యాన్సర్లకు మేలు జరుగుతుంది. సుధీర్ మీకు వ్యతిరేకంగా డ్యాన్సులు నిషేధించమని వచ్చిన ఫిర్యాదు కాయితం చింపేస్తాను. డ్యాన్సుల్లో అశ్లీలం లేదని అధికారులకు రిపోర్టు చేస్తాను. నా ఉంపుడుగత్తెగా నువ్వూ నీ రికమండేషన్తో డ్యాన్సర్లూ ఎలాంటి ఇబ్బందులూ లేకుండా హాయిగా బతకొచ్చు" అని ఆమెను రెండు జబ్బలూ పట్టుకొని తన వేపుకు తిప్పుకున్నాడు డిఎస్పీ.

సుధీర్ పేరు వినగానే దిల్ ఖుష్ గుండెలో అగ్నిపర్వతం బద్దలైంది. తన జీవితం కుక్కలు చింపిన విస్తరిగా మారటానికి కారణమైన సుధీర్ను తలచుకొని ప్రతీకారేచ్ఛతో రగిలిపోతూ కల్లోలం కడుపున దాచుకొని వాలిపోయింది.



నేరేడు యధాప్రకారం మళ్ళీ సినిమా హాలు దగ్గర సోడాలు అమ్ముతూంటే కానిస్టేబులు వీరాస్వామే కాదు, మొత్తం పోలీసు డిపార్టుమెంటే ఆశ్చర్యపోయింది. దొంగతనం జరిగి సోడా మిషను, గ్యాస్ సిలిండరూ పోయినా మళ్ళీ నేరేడు వ్యాపారం ప్రారంభించింది ఎలా అన్నది వాళ్ళందరికీ అంతుచిక్కని ప్రశ్నగా మారింది.

ఆమె ఇంట్లో కొత్త సోడా మిషను, సిలిండరూ వున్నాయని ఆరాతీశాడు వీరాస్వామి. ఆమెకు అప్పిచ్చేవాళ్ళు ఎవ్వరూ లేరు. పోయిన సామాన్లు కొనుక్కునే ఆర్థికస్థోమత లేదు. అలాంటప్పుడు నేరేడు అవ్వన్నీ ఎలా సంపాదించగలిగింది?

కానిస్టేబులు వీరాస్వామికి హఠాత్తుగా గూనోడు గుర్తొచ్చాడు!

ఆరోజు వాడు తన జేబుకొట్టి జీతం డబ్బంతా దొంగిలించి వెళ్ళాక చాలా రోజులుగా అతడి కోసం గాలిస్తూనే వున్నాడు వీరాస్వామి. ఎక్కడా వాడి ఆచూకీ చిక్కలేదు.

గెస్టుహౌస్లో పార్టీ ఇచ్చి నేరేడు ఇంట్లో దొంగతనం చెయ్యమని ముందుగా అడిగింది గూనోడ్నే. వాడు ఆ పని చెయ్యకుండా తెలివిగా తప్పించుకున్నాడు. అంటే- నేరేడుమీద వాడికి సానుభూతి వుందన్న మాట.

కానిస్టేబులు వీరాస్వామి గుండె ఝల్లుమంది. అతని పోలీసు బుర్రకు తన జీతం కాజేసి వాడు నేరేడుకు సామాన్లు కొనిపెట్టాడా? అన్న అనుమానం కలిగి ఎకాఎకిన సినిమాహాలు దగ్గరికి వెళ్ళాడు సైకిల్ మీద.

సోడాబండి దగ్గర సైకిలు దిగి "నేరేడూ, ఇన్నాళ్ళూ అడగటం మర్చిపోయాను. సోడా సామాన్లు ఎలా కొన్నావూ?" అని అడిగాడు.

"డబ్బులతో కొన్నాను" చెప్పింది నేరేడు పెడసరంగా.

"అది సర్లేగానీ... డబ్బు ఎక్కడిది?" మళ్ళీ అడిగాడు.

నేరేడుకు చిరెత్తుకొచ్చింది! "ఎక్కడివా... డిఎస్పీకి దిల్ ఖుష్నూ, సిఐకి రోజానూ తార్చాను. వాళ్ళిచ్చిన డబ్బుతో కొన్నాను. అయినా తార్చేవాళ్ళకు డబ్బు కొదవ





వుంటుందా వీరాస్వామీ తెలియనట్టే అడుగు తావ్" అంది గుడ్లు మిటకరించి.

వీరాస్వామి సైకిలు ఎక్కి అదే పోతపో యాడు మాట్లాడకుండా.

ఆరోజు సెషన్సు కోర్టులో పోలీసులు చైత న్యమీద పెట్టిన కేసులో తీర్పు చెప్పారు. ఆరోపించిన నేరాలన్నింటినీ ప్రాసిక్యూషన్ వారు సమర్ధవంతంగా నిరూపించినందుకు న్యాయమూర్తి వారిని అభినందించారు. ముద్దాయి చైతన్యకు నాలుగు సంవత్సరాల కఠిన కారాగారశిక్ష విధించారు.

అక్కడ డ్యాన్సర్ల వీధి తన స్వరూపాన్ని పూర్తిగా కోల్పోయింది. వీధిలో ఎక్కడా డ్యాన్సు పార్టీల పేరుతో బోర్డులు లేవు. డ్యాన్సు పార్టీలు లేవు.

సినిమాకు వెళ్ళిన దిల్ ఖుష్, రోజాలను పోలీసులు పట్టుకొని వెళ్ళటం, వాళ్ళ జీవి తాలను ధ్వంసంచేసి ఆ అన్యాయాన్ని ప్రతి ఘటించిన పాపానికి చైతన్యను జైలుకు పంపించటం.

ఇక పోలీసులతో వేగలేమన్న నిర్ణయానికి వచ్చారు డ్యాన్సుపార్టీ కాంట్రాక్టర్లు. వ్యాపారం కట్టిపెట్టి పెట్టుబడులు పెట్టి వేరే వ్యాపారాల్లో కుదురుకున్నారు.

వృత్తిని అలా కోల్పోయిన డాన్సర్లు పూట కూడా గడవనిస్థితికి చేరుకుంటే ఆర్కెష్ట్రా వాళ్ళూ వేరే పనులకు వెళ్తున్నారు.

డిఎస్పి ప్రాపకంతో దిల్ ఖుష్ జీవితం నిజంగానే చాలా అద్భుతంగా మారింది. విశాలమైన స్థలంలో స్వంత బంగళా. ఆ బంగళా చుట్టూ పూలతోట. బంగళాలో చాలా ఖరీదైన అలంకరణలూ, ఇంట్లో పని మనుషుల్లా సహాయం చేస్తున్న ఆర్డర్లీలూ, పొద్దునా, సాయంత్రం వచ్చి అమ్మగారికి బజారునుంచి ఏమైనా కావాలేమో అడిగి తెచ్చిపెట్టే పోలీసులూ, అమ్మగారికి ఆభర ణాలూ.

నాలుగు రోజులనుంచి దిల్ ఖుష్‌కు ఎందుకో సుధీరే గుర్తొస్తున్నాడు. అతడ్ని రాత్రి ఎనిమిదిగంటలకల్లా ఒకసారి ఇంటికి వచ్చి వెళ్లమని పనిమనిషితో కబురు పెట్టింది.

రాత్రి ఏడుగంటలు దాటింది. దిల్ ఖుష్ అందంగా అలంకరించుకుని ఎదురుచూ స్తోంది సుధీర్‌కోసం!

ఇంటినుంచి నౌకర్లందర్నీ పంపించింది. చివరికి తల్లిని కూడా భక్తిప్రధానమైన ఏదో సినిమా వుందని దానికి వెళ్ళిరమ్మనీ చెప్పి ఒక కానిస్టేబులును తోడు ఇచ్చి పంపిం చింది.

ఇంట్లో దిల్ ఖుష్ తప్ప ఎవ్వరూ లేరు.

సమయం ఏడు గంటలు కాగానే మోటారు బైక్‌మీద వచ్చి ఇంటిముందు ఆగాడు సుధీర్. బండికి తాళంవేసి గేటు దగ్గరికి వెళ్ళాడు.

నవ్వుతూ ఆహ్వానించి అతడ్ని ఇంట్లోకి తీసుకుని వెళ్లింది దిల్ ఖుష్.

సుధీర్‌కు అంతా అయోమయంగా వుంది. ఆరోజు జరిగిన ఆ సంఘటన తరు వాత అతను ఆమెను పూర్తిగా మర్చిపో యాడు. అయినా మనసులో ఎక్కడో ఒక మూల ఆమె రూపం తరచూ జ్ఞాపకం వస్తూ కలతపెట్టినా ఆమె డిఎస్పీ దొరగారి ఉంపుడుగత్తెగా మారటంతో ఆమెను గురిం చిన ఆలోచనలను పూర్తిగా కట్టిపెట్టాడు.

అలాంటిది ఇప్పుడు ఆమే స్వయంగా తన కోసం కబురుపెట్టింది. నవ్వుతూ ఇంట్లోకి ఆహ్వానించింది.

ఆమెకు తనమీద కోపంలేదు. జరిగిం దంతా ఆమె మర్చిపోయింది అనుకొంటూ ఆమె వెంట నడిచాడు సుధీర్.

ఆమె నేరుగా బెడ్‌రూమ్‌లోకి దారితీ సింది. సుధీర్ లోపలికి వెళ్లేందుకు సంశ యిస్తూ గుమ్మం దగ్గరే నిలబడిపోయాడు.

"లోపలికి రా...! అక్కడే ఆగావేం?" అని నవ్వుతూ వెళ్ళి సుధీర్‌ను చెయ్యి పట్టుకొని తీసుకొని వెళ్లి బెడ్‌మీద కూర్చోబెట్టి తనూ

అతని పక్కనే కూర్చుంది.

ఆమె శరీరంనుంచి వస్తోన్న సుగంధ పరిమళాలకు అతనేదో వివశత్వానికి లోన వుతున్నాడు. అంటీ అంటనట్టు పక్కనే కూర్చున్న ఆమె చిరు స్పర్శకు అతనికి ఏదో మైకం కమ్ముతోంది. కోర్కెలు కలక వేస్తూన్న మనసును బలవంతంగా నిగ్రహించుకుంటూ,

"నామీద కోపం లేదా? " అని అడిగాడు సుధీర్.

"కోపం ఎందుకూ? నువ్వు చేసిన పనివల్లనే కదా నా జీవితం ఇలా మలుపు తిరిగింది! ఈ బంగళా, నగలూ, వైభోగం అంతా నీవల్ల వచ్చినవే!"

"ఎందుకు పిలిపించావు నన్ను? "

"కృతజ్ఞతలు చెప్పుకోటానికి"

"కృతజ్ఞతలా? " ఆశ్చర్యంగా చూశాడు.

"అవును మరి! నా కోసం అంతగా ఆరాటపడి చెయ్యవలసిందంతా చేసింది నువ్వు. కానీ అనుభవించిందీ, అనుభవిస్తున్నదీ డిఎస్పీ. అది నాకే అన్యాయం అనిపించింది. నీమీద జాలివేసింది. కనీసం ఒక్కసారి అయినా నీ కోర్కె తీర్చాలని ఎంతో కాలంగా ఎదురుచూస్తుంటే అవకాశం ఇవ్వాల్టికి కుదిరింది. ఇంట్లో ఎవ్వరూ లేరు. దొరగారు క్యాంపుకు వెళ్ళారు. అందుకే నీకు కబురు చేశాను" అని ఇక మాట్లాడే అవకాశం అతనికి ఇవ్వకుండా లతలా అతడ్ని అల్లుకుపోయింది దిల్ ఖుష్.

సుధీర్ తన అదృష్టానికి అబ్బురపడ్డాడు. ఆనందడోలికల్లో తేలిపోతూ ఆమెను తనివి తీరా ఆస్వాదించాడు. జీవితం ధన్యమైనంతగా అతడి కళ్లు కాంతులీనాయి. అలసిపోయేదాకా అమరసుఖాలు అనుభవించి ఆనందంగా వెళ్ళిపోయాడు.

సుధీర్ మోటారుబైక్ కదిలివెళ్లిన శబ్దం వినిపించగానే దిల్ ఖుష్ విసురుగా మంచం మీంచి లేచింది. జబ్బల దగ్గర జాకెట్టును చించుకుంది. గాజుల చెయ్యిని మంచం పట్టెకు కొట్టింది. చేతిగాజులు భళ్లున పగిలాయి. గాజుముక్కలు గీసుకొని చేతి మణికట్టు దగ్గర రక్తం కార్తోంది. జుట్టురేపుకొని ఇంటికి తాళంవేసి రిక్షాలో పోలీసుస్టేషనుకు వెళ్ళింది దిల్ ఖుష్.

ఆకస్మిక తనిఖీకి వచ్చిన మంత్రిని చూసి నిర్ఘాంతపోయినట్టే దొరసానిని చూసి పోలీసుస్టేషన్లో అందరూ నిర్ఘాంతపోయారు.

ఆరోజు బుడకోళ్ళ ఎస్సై కూడా వున్నాడు స్టేషన్లో. సిఐ, ఎస్సై, హెడ్డూ, రైటరూ చివరికి సెంట్రీతో సహా ఆ స్థితిలో ఆమెను చూసి ఏదో ఘోరం జరిగిందని గ్రహించినవారై అమితంగా కంగారుపడుతూ అమ్మగార్ని కుర్చీలో ఆశీనురాలును చేసి అర్జంటుగా ఒక శీతలపానీయాన్ని తాగించి అప్పుడు అడిగారు "అమ్మగారూ! ఏం జరిగింది? " అని.

"రేప్ జరిగింది" చెప్పింది దిల్ ఖుష్.

అందరూ ఆ దుర్వార్త విని స్థాణువులైపోయారు. డిఎస్పీ దొరగారి దొరసానిగారికే రక్షణ లేదంటే సమాజం ఎంతగా చెడిపోయిందో ఊహించుకొని సిఐ దొరగారు ఉగ్రుడై-

"అంత ఘోరం చేసిన నా కొడుకు ఎవడు? రేప్ చెయ్యటానికే సాహసించాడంటే అలాంటి నా కొడుకుల్ని తుపాకులతో ఎన్ కౌంటర్ చేసి చంపినా పాపం లేదు. చెప్పండి అమ్మగారూ ఎవడా నా కొడుకు? " అని ఉరుము ఉరిమినట్టే అడిగాడు సి.ఐ.

"సుధీర్!" చెప్పింది దిల్ ఖుష్.

బాంబు పేలినట్టు అదిరిపడి అందరూ ఒకళ్ళ ముఖాలు ఒకళ్ళు చూసుకున్నారు.

అప్పటిదాకా మౌనంగా వింటున్న బుడకోళ్ళ ఎస్సైకి కూడా అమ్మగారికి అలా జరిగినందుకు కోపం వచ్చి ఎస్పీ దొరగారి కూడా విందులు చేస్తూ సంపాదించిన ప్రాపకం గుర్తుకువచ్చి "ఈ అన్యాయాన్ని సహించను నేను. కంప్లయింటు రిజిస్టరు చేసి నేరస్తుడ్ని వెంటనే అరెస్టు చేస్తాను.




పైగా ఇది రేప్ కేసు. ఆస్పత్రికి పంపించి వైద్యపరీక్షలు చేయించాలి" అని ఏదో అనుమానం వచ్చి సిఐ దొరగారివైపు చూశాడు బేలకళ్ళతో.

బుడకోళ్ళ ఎస్సై అప్పటిదాకా తన ఆధిక్యాన్ని మర్చిపోయి సర్వం తానే అయినట్టు మాట్లాడినా మధ్యలో తెలివితెచ్చుకొని 'కర్తవ్యం ఏమిటి? ' అన్నట్టు తనవైపు చూసినందుకే అతని ఆగ్రహం పూర్తిగా చల్లారింది.

"ఇంతకూ జరిగిన విషయాన్ని దొరగారికి చెప్పాలికదా! ముందుగా ఆ పని చూడు" అని ఎస్సైని ఆదేశించాడు.

దిల్ ఖుష్ కల్పించుకుంది. ఎవ్వరినీ అడక్కుండానే ఫోన్ అందుకొని డిఎస్పీ దొరగారికి ఫోన్‌చేసి విషయం చెప్పింది.

అరగంటలో దొరగారి వాహనం రొదపెడుతూ వచ్చి పోలీసుస్టేషను ముందు ఆగింది. దొరగారు కిందికిదిగి తన సర్వస్వాన్నీ ఎవరో కొల్లగొట్టినట్టే మెరుపు వేగంతో స్టేషన్లోకి వెళ్ళి సిబ్బంది సెల్యూట్లను కూడా గమనించకుండా దిల్ ఖుష్ దగ్గరికి వెళ్లాడు.

దొరగారిని చూడగానే బావురుమని ఏడ్చింది ఆమె. ఆమెకు జరిగిన అన్యాయం కన్నా తన ప్రాపకంలో వున్న ఆడదాన్ని ఎవరో చెరిచాడన్నది ఆయనకు మరింత బాధాకరంగా వుంది!

"దిల్ ఖుష్ స్టేషనుకు వచ్చి ఎంతసేపైంది? " సిఐని అడిగారు దొరగారు.

"అరగంటైంది సార్"

"లంజాకొడకా! రేప్ కేసులో కంప్లయింట్ వచ్చి అరగంటైనా ముద్దాయిని పట్టుకోకుండా ఏంచేస్తున్నారు? పందుల్లా గవర్నమెంటు జీతాలు తింటంకాదు- పని కూడా చెయ్యాలి" అని గద్దించి స్టేషన్ హౌసాఫీసరైన బుడకోళ్ళ ఎస్సైవైపు చూపు నిలిపి-

"గాడిదలు కాస్తున్నావా... గవర్నమెంటు పనిచేస్తున్నావా? ఇంకా ముద్దాయికోసం పోలీసులను ఎందుకని పంపించలేదు? " అని గద్దించి వాళ్ళకు ఎస్పీ దొరగారితో వున్న అనుబంధం గుర్తొచ్చి ఆవేశాన్ని తగ్గించుకున్నాడు.

"ప్లీజ్! త్వరగా వాడ్ని పట్టుకొచ్చి మెడికల్ ఎగ్జామినేషన్‌కి పంపించండి. దిల్ ఖుష్‌ను ఆస్పత్రికి నేనే తీసుకుని వెళ్తాను. కమాన్... క్విక్!" అని అరిచాడు డిఎస్పి.

బుడకోళ్ళ ఎస్సై కానిస్టేబులు వీరాస్వామికి ఆ పని పురమాయించాడు. అతనికి సహాయంగా నలుగురు కానిస్టేబుళ్ళను ఇచ్చి సుధీర్‌ను పట్టుకొని రమ్మని ఆదేశించి పంపించాడు.

కానిస్టేబులు వీరాస్వామితో కలిసి పోలీసుల బృందం సుధీర్‌కోసం బయలుదేరి వెళ్ళిన వెంటనే డిఎస్పీ దొరగారు దిల్ ఖుష్‌ను వెంటపెట్టుకొని తన వాహనంలో ప్రభుత్వ ఆసుపత్రికి బయలుదేరి వెళ్ళాడు- వైద్యపరీక్షల నిమిత్తం.

పోలీసులు సుధీర్ ఇంటికి వెళ్ళారు. కానిస్టేబుళ్లను ఇంటికి కొంచెం దూరంగా వుంచి వీరాస్వామి వెళ్ళి తలుపుతట్టి పిలిచాడు.

"ఎవరు కావాలి? " తలుపులు తెరచి అడిగారెవరో.

"సుధీర్ వున్నాడా? "

"ఎందుకూ? " డ్రస్సులోనే వున్న కానిస్టేబుల్ని చూసి అడిగాడతను.

"సుధీర్ నా స్నేహితుడు. కానిస్టేబులు వీరాస్వామి వచ్చాడని చెప్పు" సౌమ్యంగానే చెప్పాడు వీరాస్వామి.

అతను తలుపులు దగ్గరికి వేసి లోపలికి వెళ్ళాడు. ఐదు నిమిషాలలో సుధీర్ బైటికి వచ్చి వీరాస్వామిని చూసి పలకరింపుగా నవ్వాడు.

"ప్యాంటూ, షర్టూ వేసుకొనిరా" అన్నాడు వీరాస్వామి.

"ఏమిటి విశేషం? "

"నీతో కొంచెం మాట్లాడాలి. నీ బంగా

రపు వస్తువులు తెచ్చాను"

సుధీర్ లోపలికి వెళ్ళి బట్టలు మార్చుకొని బైటికి వచ్చాడు. వీరాస్వామితో కలిసి కొంచెం దూరం నడిచాడు. ఆ వీధిదాటి మలుపు తిరగగానే "దొరసానిని రేప్ చేసేంత మగాడివిరా నువ్వు! మా చేతుల్లో ఇక నీకు చావు మూడిందిలే- పద" అంటూ సుధీర్ చేతికి తన చేతిని మెలివేసి పట్టుకున్నాడు కానిస్టేబులు వీరాస్వామి.

సుధీర్ నిర్విణ్ణుడయ్యాడు. పథకం ప్రకారం తనను ఊబిలో దించారని అతనికి అర్థమైంది. కన్నీళ్లు గిర్రున తిరిగాయి. వీరాస్వామిని ప్రాధేయపడుతూ, అడిగాడు- "మనం మనం స్నేహితులం. కలిసి తిరుగుతున్నాం. మంచి చెడూ అంతా కలిసే చేస్తున్నాం. స్నేహాన్ని దృష్టిలో పెట్టుకొని అయినా నన్ను విడిచిపెట్టు. యాంటిసిపేటరీ బెయిలు తెచ్చుకుంటాను"

కానిస్టేబులు వీరాస్వామికి బాగా కోపం వచ్చింది. "డ్యూటీలో వున్న కానిస్టేబులుతో ఇలాగేనా మాట్లాడ్డం. తప్పు చెయ్యమని చెప్తావట్రా దొంగనాకొడక" అని ఇంకా కోపం చల్లారక లాఠీతో బెయ్యిబెయ్యిన నాలుగు ఇచ్చుకున్నాడు.

దూరంగా వాళ్ళను అనుసరించి వస్తూన్న కానిస్టేబుళ్లు హడావుడిగా ముందుకు వచ్చారు. సుధీర్‌ను తలా ఒక దెబ్బవేసి దొరసానికి అతను చేసిన అన్యాయానికి ప్రతీకారం తీర్చుకున్నారు.

రిక్షాలో ఎక్కించారు- దెబ్బలకు తట్టుకోలేక ఏడుస్తూన్న సుధీర్‌ను పోలీసులు స్టేషనుకు తీసుకొనివెళ్ళారు.

దిల్ ఖుష్‌ను పరీక్షించి మానభంగానికి గురైనట్టు నిర్ధారించిన ప్రభుత్వ ఆసుపత్రి డాక్టరే సుధీర్‌ను కూడా పరీక్షించాడు. మానభంగం చేసింది అతనే అని నిరూపించేందుకు పోలీసులకు చాలా ఆధారాలు దొరికాయి. డాక్టరు సర్టిఫికేట్లు వాళ్ళకు మరీ బలమైన ఆధారం!

దిల్ ఖుష్‌ను ఇంటికి పంపించి ముద్దాయి సుధీరును స్టేషనుకు తీసుకుని వెళ్ళారు పోలీసులు. డిఎస్పీ కూడా ఇంటికి వెళ్ళలేదు. ఆ రాత్రంతా స్టేషన్లోనే వున్నాడు.

'చిత్రహింసల' గదిలోంచి రాత్రంతా సుధీర్ ఆర్తనాదాలు వినిపిస్తూనే వున్నాయి.

★ ★ ★

దేశసంచారం కోసం వెళ్ళిన పానకాలుకు ఎక్కడా మనశ్శాంతి చిక్కలేదు. ఇక్కడే కాదు, ప్రతిచోటా అవినీతితో, అన్యాయాలతో అక్రమాలతో హింసలతో భారతావని అగ్నిగుండంలా రగులుతోందని గ్రహించాడు. అతను ఆశించిన ప్రశాంతత ఎక్కడా చిక్కక తిరుగుముఖం పట్టివచ్చేశాడు. నేరేడును కలిశాడు.

అతను దేశాటనలో వున్నకాలంలో జరిగిన విషయాలన్నీ వివరంగా అతనికి చెప్పింది నేరేడు.

చైతన్యకు కఠిన కారాగారశిక్ష పడటం, మానభంగం కేసులో సుధీర్ జైలుకు వెళ్ళటం, ఇంకా అడపాదడపా పోలీసులు నేరేడును వేధించటం.

పానకాలు మనసు అల్లకల్లోలంగా మారింది. గుండె బరువెక్కింది. ఆలోచనలు అదేపనిగా మెదడును తొలుస్తూంటే బలంగా ఒకసారి ఊపిరి పీల్చి వదలి-

"రోజా ఎలా వుంది?" అని అడిగాడు పానకాలు.

నేరేడు ముఖంలో రంగులు మారాయి! విషాదం ఏదో అలలా తేలి అంతలోనే అదృశ్యమైంది ఆమె ముఖంలోంచి.

ఆమె సమాధానం చెప్పలేదు. తల వాల్చుకుంది.

రాత్రి ఎనిమిది గంటలైంది. పానకాలు సినిమాహాలు దగ్గరికి వెళ్ళాడు. బీడీ





బంకులో శేషయ్య కూర్చొని కనిపించాడు గానీ ఆంజనేయులు కనిపించలేదు.

అక్కడే కొంచెంసేపు నిల్చున్నాడు. ఆలోచించాడు. రోజా విషయంలో నేరేడు తన దగ్గర ఏదో దాస్తోంది చెప్పకుండా.

ఎందుకో అతనికి రోజాను చూడాలనిపించింది. రిక్షా పిలిచి ఎక్కి కూర్చున్నాడు. "ముందుకు పోనీ...!" అన్నాడు.

"ఎక్కడికి సార్?" కొంచెం దూరం వెళ్ళాక అడిగాడు రిక్షావాలా.

"డ్యాన్సర్ల వీధికి"

రిక్షా తొక్కుతూనే అతను తల వెనక్కు తిప్పి పానకాలు వైపుచూసి అదోలా నవ్వాడు.

రిక్షా డ్యాన్సర్ల వీధికి చేరుకుంది.

"ఏ కంపెనీకి వెళ్తారు సార్?" అడిగాడు రిక్షావాలా.

"కంపెనీనా?"

"అవున్సార్! ఇక్కడ చాలా కంపెనీలుండాయి"

"రోజా...! రోజా...!"

"దానిబొంద! దాని కంపెనీలో అమ్మాయిలు బాగుండరు. ఇంకొక కంపెనీకి తీసుకుపోతాను. కొత్త సరుకు వొచ్చింది సార్! రాత్రికయితే ఐదొందలు...గంటకయితే..."

"రిక్షా వెనక్కు తిప్పు" అని అరిచాడు పానకాలు.

పానకాలు చెవుల్లో ఏదో హోరు వినిపిస్తోంది. భయంకర విస్ఫోటాలు చుట్టూ వినిపిస్తున్నట్టూ, ఆ విస్ఫోటనాల ప్రకంపనలకు గుండె కంపిస్తున్నట్టూ!

ఈ విష పరిణామాలన్నింటికీ కారణం ఎవరు?

ఒక అన్యాయాన్ని ప్రతిఘటించిన నేరానికి చైతన్యను జైలుకు పంపించారు. రోజా, దిల్‌ఖుష్‌ల జీవితాల్లో పెనుతుపాను సృష్టించారు. అంకితమైన నాట్య వృత్తిలో బ్రతుకుతెరువు సాగిస్తున్నవారిని వెంటాడి వేధించి చివరికి డ్యాన్సర్ల వీధిని రసికవాడగా మార్చారు. అశ్లీలం పేరుతో అమాయకులమీద బురదచల్లి వాళ్ళ బతుకులను దుర్భరంగా మార్చారు. వేశ్యావృత్తిని ఆశ్రయించటం అనివార్యం చేశారు.

పానకాలు కళ్ళు విస్ఫులింగాలు కురిపిస్తున్నాయి.

ఒకదశలో పోలీసులను చూస్తేనే గడగడా ఒణికిన ఆనాటి పానకాలేనా ఇతను? రాగింగు పేరుతో రౌడీలు ఆదేశిస్తే నగ్నంగా పుస్తకాలు నెత్తిన పెట్టుకొని కాలేజీ తరగతి గదులకు తిరుగుతూ పెద్దగా ఏడ్చిన ఆనాటి పానకాలేనా ఇతను? పోలీసుస్టేషను ముందు పాపాయిని ఎత్తుకొని అమాయకంగా నిలబడి హెడ్డు లాఠీతో కొట్టి తన జేబు ఖాళీచేసి వెళ్ళినా కిమ్మనకుండా పరుగెత్తిన ఆనాటి పానకాలేనా ఇతను?

రిక్షా దిగాడు. బాడుగ చెల్లించాడు. శేషయ్య బీడీ బంకు దగ్గరికి వెళ్లాడు. ఆంజనేయులుతో గుసగుసలాడాడు. అక్కడ్నించి నడుస్తూ నేరేడు సోడాబండి దగ్గరికి వెళ్ళాడు.

అక్కడ బీడీబంకులో కూర్చున్న ఆంజనేయులు ముఖంలో విప్పారిన ఆశ్చర్యం ఇంకా మాసిపోలేదు. నేరేడు పరిస్థితీ అలాగే వుంది. ఆశ్చర్యంగా, అభిమానంగా అతడ్నే విప్పారిన కళ్లతో చూస్తోంది.

పానకాలు దేనికో ఆయత్తమై వెళుతోన్నట్లు గంభీరంగా నడుస్తూ దూరంగా వెళ్ళిపోయాడు. క్రమంగా భావోద్వేగంనుంచి తేరుకొని గాఢంగా నిట్టూర్చింది నేరేడు.

కాలం చరిత్రకు గాయాలు చేస్తూ కదిలిపోతూనే వుంది.

పానకాలు ఏమైనాడోగానీ ఈ జనారణ్యంలో మాత్రం మళ్ళీ ఎవ్వరికీ కనిపించనే లేదు.

◆

# ఏరిన ముత్యాలు

★ ఎక్కువ విశ్రాంతి బాధాకరం.

—వినోబాభావే

★ మీరు స్నేహితులను పొందాలనుకుంటున్నారా? అయితే మిమ్మల్ని మీరు మరచి స్నేహపూర్వకంగా ఉండండి.

—డేల్‌కార్నెగి

★ దగ్గర్లో వున్న కర్తవ్యమార్గాన్ని వదలి ఎక్కడో దూరంగా ఉన్న మార్గంపై దాన్ని వెతుకుతుంటారు.

—చైనా సామెత

★ ప్రజలకు మేలు చేయడమన్నదే మహత్తర లక్ష్యం.

—పీలె

★ చదువు లేకుండా ఊహించే వ్యక్తికి రెక్కలుంటాయే కానీ కాళ్ళుండవు.

—జోసెఫ్‌జాబర్ట్

★ ముందు ఆలోచన, తరువాత ఆచరణ అనే సూత్రం పాటించేవారికి నిస్పృహ కలుగదు.

—లయెలా

★ తమను ఎన్నుకున్న ప్రజలకూ, దేశానికి తాము సేవకులమనే సంగతి ప్రజాప్రతినిధులు మరచి పోగూడదు.

—జాకీర్‌హుస్సేన్

★ మీ పాత్రను మీరు సక్రమంగా నిర్వహించగలిగినప్పుడే గౌరవమర్యాదలు వాటంతటవే చేకూరుతాయి.

—పోప్

★ మన కష్టాలకు కాస్త నవ్వుకుని ఎదుటివారి కష్టాలను ఎగతాళి చేయకుండా ఉండటం నేర్చుకోవాలి.

—సెనెకా

★ మనం చేస్తున్న మంచిపనుల ద్వారా మన సుగుణం బైటపడుతుందే కానీ తుచ్ఛమైన పనులను చేయకపోవటంవల్ల కాదు.

—అరిస్టాటిల్

★ అందర్నీ ప్రశంసించే వ్యక్తి ఏ ఒక్కర్నీ మెప్పించలేడు.

—ప్లూటార్చ్

★ బద్ధకస్తుడు తినేందుకే జీవిస్తాడు. మంచివాడు జీవించేందుకే తింటాడు.

—సంస్కృత సూక్తి

★ ఒక సైన్యాన్ని అదుపులో పెట్టుకోవడంకన్నా, ఆత్మనిగ్రహాన్ని కలిగివుండడమే మిన్న.

—రాధాకృష్ణన్

సేకరణ: పి.వి.రమణకుమార్

# చతుర ప్రపంచం

## అక్కడ ఇంట్లో కూర్చునే చదువు

టెలివిజన్ వచ్చాక కేబుల్ టెలివిజన్ వచ్చింది. సేటిలైట్ ద్వారా భారీ ట్రాన్స్ పాండర్స్, ఖర్చులేని కేబుల్ టీ.వీ ఇండియాలో కేవలం వినోదానికే పరిమితం అయిపోయింది. కానీ అమెరికాలో ఇది 'దూరవిద్య'కి ఉపయోగిస్తోంది.

యూనివర్శిటీ ఆఫ్ మేరీలాండ్ బేచులర్స్ డిగ్రీని కేబుల్ టీ.వీ ద్వారా అందిస్తోంది.

అమెరికాలో ఈ యూనివర్శిటీ ఈ పద్ధతిలో విద్యని అందించడంలో మొదటిది. విద్యార్థులు ట్యూషన్ ఫీజ్ చెల్లించి, కేబుల్ టీ.వీ లో ఫలానా టైమ్‌లో వచ్చే కార్యక్రమాన్ని తిలకిస్తారు. అందులో టీచర్స్ వివిధ సబ్జెక్ట్స్‌ని క్లాస్ రూంలో లాగే చెప్తారు.

విద్యార్థులు ఈ బోధనలని వీడియో టేప్ చేసుకుని తమకి సందేహం కలిగినపుడల్లా చూడచ్చు

కార్యక్రమం మధ్యలో ఏదైనా అనుమానం వస్తే క్లాస్‌రూంలో అయితే వెంటనే అడిగి సందేహ నివృత్తి చేసుకుంటారు.

కేబుల్ టీ.వీ విద్యార్థులకి అనుమానాలొస్తే వెంటనే ఓ నెంబర్‌కి ఫోన్ చేస్తారు. టీచర్లు రిసీవర్ ఎత్తి వారి సందేహం తెలుసుకుని నివృత్తి చేస్తారు. అంచేత ప్రసారాలు ఎప్పుడూ లైవ్ టెలికాస్ట్ అవుతూ ఉంటాయి.

కేబుల్ టీ.వీ లో ఒక్కో క్లాస్‌రూమ్‌కీ 25 మంది విద్యార్థులు ఉంటారు.

ఇలాంటి క్లాసులు వివిధ సమయాల్లో టెలికాస్ట్ అవుతూ ఉంటాయి. పరీక్షలు ప్రాంతీయ విద్యా సంస్థల్లో నిర్వహిస్తారు.




డిగ్రీ చదవాలనుకునే ఉద్యోగస్థులని దృష్టిలో ఉంచుకుని ఆ సమయాన్ని నిర్ణయిస్తారు. ఇందులోని లాభం, క్లాస్‌రూంలో అయితే బయటకి వచ్చాక మాయమవుతుంది. టేప్ చేసుకుంటారు కాబట్టి కేబుల్ విద్యార్థులు ఒకే క్లాసులోని లెక్చర్‌ని పదేపదే వినచ్చు. కాలేజీలకి వెళ్లి వచ్చే టైము, ఖర్చు కలిసి వస్తాయి. అమెరికాలో కేబుల్ టీ.వీ

క్లాసులకి హాజరయ్యే విద్యార్థుల సంఖ్య క్రమేపీ అధికమౌతోంది.

ఒక్క ఎకడమిక్ కోర్సులే కాక చేతిప నులు, కంప్యూటర్ కోర్సులు, పియానో లాంటి మ్యూజికల్ పరికరాలు వాయించ డంలాంటి ఎన్నో బోధనలు కేబుల్ టీ.వీ ద్వారా నేర్చుకోవచ్చు ఇక్కడ.

---

## టెక్విలా మొదట్లో పేదవాళ్ల డ్రింక్

రుచికరమైన ఓడ్కా కేవలం రష్యాలోనే తయారవుతుంది. స్కాచ్ విస్కీ కేవలంస్కాట్ లాండ్ లోనే తయారవుతుంది. అలాగే మెక్సికో కూడా ఓ డ్రింక్ కి ప్రసిద్ధి. అది టెక్విలా. స్కాట్ లాండ్ నది నీళ్లు స్కాచ్ విస్కీ కి ఎలా రుచినిస్తాయో అలాగే మెక్సికోలో పండే కేక్టస్ జాతికి చెందిన 'ఎగేల్' అనే నీలంరంగు మొక్కని టెక్విలా తయారీకి ఉపయోగించడంతో మెక్సికన్ టెక్విలాకి ఆ రుచి వస్తుంది. ప్రపంచానికి టెక్విలాని మెక్సికోనే ఎగుమతి చేస్తోంది.

ఒకప్పుడు ఇది బీదవాళ్ల డ్రింక్. ఎందు కంటే 'ఎగేల్' తో చేసే ఇది చవకైంది. అయితే దాని రుచి, అదిచ్చే నిషా మర్నాడు పెద్దగా హాంగోవర్ ఉండకపో వడం లాంటి గుణాలవల్ల త్వరలోనే దానికి డిమాండ్ పెరగసాగింది. 20 శాతం టెక్విలా మాత్రమే మెక్సికోలో ఖర్చవుతుంది. 80 శాతం ఎగుమతి అవుతుంది.

మెక్సికోలోని ఎడారిలో పెరిగే 'ఎగేల్' ని ప్రత్యేకంగా పెంచక్కర్లేదు. దానంతట అదే పెరుగుతుంది. అయితే ఓ మొక్క




పుట్టాక పెరిగి టెక్విలా తయారీకి అనువుగా మారడానికి 10 ఏళ్లు పడుతుంది. ఇవి పెరిగే ఎడారి ప్రాంతాల్లో తుపాకులు ధరించిన గార్డ్సు కాపలా ఉంటున్నారిప్పుడు. ఎందుకంటే ఇది సంపదగా మారింది కనుక. ఈ మొక్కను మనిషి పంటగా పెంచాలన్నా కుదరదు. వందేళ్ల క్రితం ఎంత పండేదో ఇప్పుడూ అంతే పండుతుంది.

అప్పట్లో అది మెక్సికోలోని బీద ప్రజలకు సరిపోయేది. కానీ ఇప్పుడది ప్రపంచమంతటా ఎగుమతి చేయాల్సిరావడంతో తయారయ్యే సరుకు సరిపోవడంలేదు. సరిగ్గా ఈ కారణంగానే దాని ధర ఎక్కువ పలుకుతోంది. మెక్సికోకి ఆదాయం తెచ్చే




ఏకైక తయారీ టెక్విలా.

ప్రపంచంలో 'ఎగేవ్' కి బదులుగా ఇతర మొక్కలతో టెక్విలాని తయారు చేస్తున్నారు. కానీ అవి సరైన ప్రత్యామ్నాయాలు కాదు.

తెల్లగా, నీళ్లలా వాసన లేకుండా వుండే టెక్విలాలో ఆరెంజ్ జ్యూస్ కలుపుకుని తాగడం రివాజు. దీన్ని కాక్‌టైల్స్‌లో కూడా రుచి కోసం వాడతారు.

---

## జగ్లింగ్

ఓ బంతిని గాల్లోకి ఎగరేసి పట్టుకోవడం అందరికీ తెలుసుకానీ దానికి ఇంకో బంతిని కలిపి ఎగరేసి రెంటినీ పడిపోకుండా ఒక దాని తర్వాత ఇంకోటి పట్టుకుని ఎగరేయ గలగడం మాత్రం అందరికీ రాదు. ప్రాక్టీస్ చేస్తే తప్ప. దీన్ని ఇంగ్లీషులో 'జగ్లింగ్' అంటారు.

మించి జగ్లింగ్ చేయడం కష్టం. ఇది నేర్చుకోవడానికి కనీసం ఏడాది పాటు అభ్యసించాలి. ఏడు వస్తువులని గాలిలోకి ఎగరేసి పట్టుకొనేవారి సంఖ్య ప్రపంచంలో వందలోపే.

ఇంటర్నేషనల్ జగ్లర్స్ అసోసియేషన్ అని ఒకటి ఉంది. ఏటా ఇది జగ్లింగ్ పోటీలను




ఈ జగ్లింగ్ అతి పురాతనమైన విద్య. సర్కస్‌లో బంతులు, సాసర్లు లేదా రింగులు అయిదారు పైనే గాల్లోకి ఎగరేస్తూ పట్టుకుంటూండడం చూస్తూంటాం. దాన్ని సాధించడానికి వాళ్లు ఎంతో ప్రాక్టీస్ చేస్తారు.

జగ్లింగ్ 4000 సంవత్సరాల క్రితం జన్మించిందని ఈజిప్ట్‌లోని శిల్పాల వల్ల రూఢి అయింది. అయితే జపాన్, చైనా దేశాలలో దాన్ని ప్రజలు అధికంగా నేర్చుకున్నారు.

19 వ శతాబ్దంలో దాన్ని షో బిజినెస్ లా మార్చింది యూరోపియన్స్. సర్కస్‌లో జగ్లింగ్ ఏక్ట్‌ని యూరప్‌లో తొలిసారిగా పరిచయం చేశారు.

ఎంతటి నిపుణుడైనా అయిదు వస్తువులను

నిర్వహిస్తుంది. 1986 లో ఈ సంస్థ నిర్వహించిన పోటీలలో ఒకతను ఏకంగా 9 రింగులని జగిల్ చేసి విజేత అయ్యాడు.

జగ్లింగ్‌కి బంతులు, రింగులే కాక క్యూబ్ పజిల్స్, బౌలింగ్ బాల్స్, పళ్లు, పేకముక్కలు, చిన్ని కర్రలు, మండుతున్న కాగడాలు మొదలైనవి వాడుతున్నారు.

అయితే రింగ్స్ అధికంగా వాడడానికి కారణం అవి గాల్లోకి విసిరాక కింద పడేటైములో తేడాలుండవు. అయిదు మించిన వస్తువులను జగిల్ చేయడానికి రింగులే శరణ్యాం.

# స్నాన ప్రియుల దేశం

జపాన్ పబ్లిక్ స్నానాల గదులకి ప్రసిద్ధి. కొంత రుసుము చెల్లించి ఎవరైనా ఆ స్నానాలగదిని ఉపయోగించుకోవచ్చు అయితే అవి ఒళ్లు శుభ్రం చేసుకోవడానికి కాక, రిలాక్సేషన్ కి ఉపయోగించబడ్డ బాత్‌హౌసెస్. గైషా లన బడే అందమైన అతివలు స్వయంగా శరీరాన్ని మర్దిస్తూ స్నానాలు చేయిస్తారు. ఇది వారి సంస్కృతి. స్టీమ్‌బాత్ అనేది ఈ బాత్ హౌస్‌లలోనే జన్మించింది. అయితే జపాన్ సంపన్న దేశంగా మారిన తరువాత దాదాపు ప్రతీ ఇంట్లో బాత్ హౌసెస్ ఏర్పాటు చేసుకుంటున్నారు. ఇప్పుడు జపాన్‌లో దాదాపు 92 శాతం ఇళ్లల్లో బాత్‌హౌసెస్‌లున్నాయి. టోసు' అనే బాత్‌హౌస్‌లో ప్రతి ఆదివారం నీటికి బదులు పాలని వాడుతున్నారు. దాంతో హాజరు సంఖ్య రెట్టింపయింది. కొన్ని బాత్‌హౌస్‌లు కామెడీ షోలని మరికొన్ని జిమ్ సౌకర్యాలనీ ఉచితంగా అందిస్తున్నాయి. ఇంకొన్ని నీటిలో సువాసనలిచ్చే సుగంధ ద్రవ్యాలని కలుపుతున్నాయి. కొన్ని బాత్‌హౌస్‌లలో సీలింగ్ మీంచి వేలాడే ఫిష్‌టాంకుల్లో తిరిగే రంగురంగుల చేపలని చూస్తుంటే కాలం తెలీకుండానే గడిచిపోతుంది.

ఓ బాత్‌హౌస్ యజమాని వేడి నీటిలో ఏపిల్స్ వేస్తాడు. ఆ వేడికి అవి మగ్గాక ఎవరి బాత్‌టబ్‌లో ఏపిల్‌ని వారు తినచ్చు




దాంతో పబ్లిక్ బాత్‌హౌసెస్ తగ్గిపోతున్నాయి. 1980 నుంచి 87 దాకా ఒక్క టోక్యోలోనే 1000 బాత్‌హౌస్‌లను మూసేశారు. జపాన్‌లో నేడు కేవలం 10,000 బాత్ హౌస్‌లే ఉన్నాయి. జపనీస్ సంస్కృతి అయిన ఈ బాత్ హౌస్‌లు పూర్తిగా అదృశ్యం కాకుండా ఉండడానికి కొందరు ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటున్నారు. వాటిలో భాగంగా బాత్‌టబ్‌లలో నీటికి బదులు పాలు లేదా వైన్‌లను ఉపయోగిస్తున్నారు. టోక్యోలోని హిసమా

బాత్‌హౌస్‌లకి డిమాండ్ తగ్గడానికి కారణం గైషా అమ్మాయిల కొరత. జపాన్‌లో ఉద్యోగాల సంఖ్య అధికం. ఉద్యోగస్థుల సంఖ్య స్వల్పం. కాబట్టి అమ్మాయిలు గైషాలుగా పనిచేసే బదులు ఆఫీసుల్లో పని చేయడానికి ఉత్సాహం చూపడం జపనీస్ స్నానపు గదుల డిమాండ్ తగ్గడానికి ప్రధాన కారణంగా చెప్పుకోవాలి.

స్నానప్రియులైన జపనీస్ టోక్యోలోని ప్రపంచంలోనే అతి పెద్దదయిన స్విమ్మింగ్ పూల్‌కి తరచూ వెడుతూవుంటారు.




# 'యజ్ఞం' పై సమీక్షలు

**మార్చి 'చతుర'లో ప్రచురితమైన కల్లూరి శైలబాల నవల 'యజ్ఞం' పై మాకందిన ఉత్తమ సమీక్షలు**

## సింపుల్‌గా సైన్సు

*(ప్రథమ బహుమతి రూ. 100/- పొందిన సమీక్ష)*

పుట్టగొడుగుల్లా విస్తరిస్తున్న ఖరీదైన ఆస్పత్రులు, నర్సింగ్ హోమ్‌లలో రోగుల సేవ కంటే పెరిగిన వ్యాపార దృష్టి, లాభార్జనలపై చక్కని విశ్లేషణ 'యజ్ఞం' నవల. నీతి, నిజాయితీ, నైతిక పవిత్రతలుగల వైద్యులే 'వైద్యోనారాయణోహరిః' అన్న పెద్దల మాట సార్థకం చేస్తారు. సమాజశ్రేయస్సుకోసం నిస్వార్థంగా పరితపించే వనిత పోరాటం ఒకవైపు, మరియొకవైపు తనకోసం తన అస్థిత్వం, ఆధిక్యత, ధనార్జనకోసం సమాజాన్ని వినాశంవైపు దొరలించే ఘరానా స్వార్థపరుల కుట్రలు, కుతంత్రాల సంఘర్షణల ద్వంద్వాలు కథలో ఎన్నో మలుపులు తిప్పి సాధారణ కథలకు విభిన్నమైన సందేశాన్ని అందించాయి.

ఎందరో అభాగ్యుల కన్నీటి అనుభవాలకు అద్దంపట్టిందీ నవల. మా బంధువుల్లో ఒకరికి 'బ్రెస్ట్ క్యాన్సర్' అని హైద్రాబాద్‌లోని పెద్దపెద్ద ఆస్పత్రుల సొగసులు, సోయగాలకు ఆకర్షింపబడి చికిత్సకు వెళ్ళాం. అనేక రకాల టెస్ట్స్, ఆపరేషన్స్, ట్రీట్‌మెంట్స్ పేరున జలగల్లా రక్తంపీల్చి బిల్లు పెంచుతూ డాక్టర్స్ క్యాన్సర్ వ్యాధి కంటే భయంకరంగా రోగిని చావుకు దగ్గరగా పంపారు. పైమెరుగులు, మీడియా ఖర్చులు ఈ ఆస్పత్రులకు అవసరమా? రోగులపై ఆశక్తి, శ్రద్ధ నవలలోని డాక్టర్ కృష్ణప్రసాద్‌వలె చూపితే ఆదాయం పెరగదా? రోగుల ఆయుష్షు పెరగదా?

తరాలు మారినా స్త్రీలలో చైతన్యం, చేతనత్వం, చేవ, చొరవ రాలేదా? వచ్చింది అనడానికి మగవారికంటె ఎక్కువ తెగువ, మానవత్వం ప్రతిబింబించే తన్మయి, నీహారిక ఉదాహరణలు. పులినోట్లో తలపెట్టినట్లు లక్ష్యసాధనకు మోసపూరిత తంత్రాలను ఎదిరించి నిలబడ్డారు.

యవ్వనరహస్యం ఛేదించే జన్యువుల పరిశోధన, పిజిడిని అధ్యయనంజేసి కోరుకొన్న బిడ్డను ముఖ్యంగా 'మగధీరుని' పొందే సౌకర్యం, టెస్ట్‌ట్యూబ్ బేబీల పేరిట ఎన్నో సంతానసాఫల్య కేంద్రాలు అమాయక దంపతులను ధనార్జనకై మోసం చేస్తున్నాయి. శ్రీధర్‌లాంటి ఘరానా పెద్దమనుషుల 'ఫార్మాస్యూటికల్స్' నకిలీ మందులతో ఆరోగ్యవంతులను 'మరణం శరణం గచ్ఛామి' అన్నట్టు దోచుకొంటున్నారు. "మీరు హంతకులు. నన్ను కూడా ఎప్పుడో మీ మందులకే బలి తీసుకొంటారనే" శ్రీధర్ భార్య కీర్తన మాటలలో కత్తికంటే పదునైన శక్తి ఉంది.

కథాశిల్పం నెమ్మదిగా జాలువారుతూ రాజా భూపతి విచిత్ర సంభాషణ, మగబిడ్డకోసం కోడలిని వేధించే మనసత్త్వం, X, Y క్రోమోజోముల వివరణ సీరియస్ కథా గమనానికి అడ్డంరాలేదు.

*డాక్టర్ యు.కె. శ్రీలత శ్రీనివాస్.*
హైదరాబాద్-500 028.



## విజ్ఞానదాయకం

*(ద్వితీయ బహుమతి రూ. 75/- పొందిన సమీక్ష)*

'గ్లోబలీకరణ', ప్రపంచీకరణ నేపథ్యంలో వ్యాపార దృక్పథం నేడు ప్రపంచవ్యాప్తంగా బాగా పెరిగిపోతోంది. ధన సంపాదనే ధ్యేయం అయింది. ఈ సంపాదనలో మానవత్వం, మానవతావిలువలు హరించి పోతున్నాయి. దీనికి నిదర్శనంగా నిత్యం పత్రికల్లో అమానుష సంఘటనలు కనబ డుతూనే ఉన్నాయి.

సమాజంలో వున్నత వర్గానికి చెందిన వారు డాక్టర్లు. మనిషికి ప్రాణదానం చేసే పవిత్రమైన వృత్తిధర్మాన్ని మరిచి కేవలం కాసుల సంపాదనే జీవిత లక్ష్యమనుకునే వారికి ఎవరేం చెప్పగలరు? రోగి తన రోగాన్ని బాగుచేస్తాడనే నమ్మకంతో డాక్టరు దగ్గరకు వస్తే, ఆ నమ్మకాన్ని వ్యాపార సాధనంగా మార్చుకుంటున్నారు నేటి వైద్యనారాయణలు.

కార్పోరేటు హాస్పిటల్స్ వెలిసిన తర్వాత ఈ ధనదాహం మరీ అధికమైంది. కిడ్నీల భాగోతాలు, శరీరావయవ అమ్మకాలవంటి వార్తలు వచ్చాయి, వస్తున్నాయి. నకలీ మందులు, నకిలీ డాక్టర్లు వారి వైద్యాలు మనిషి ప్రాణాలతో చెలగాటమాడుతున్నాయి. వారడిగినంతా యిచ్చి చికిత్స చేయించుకుంటున్నా వారి ధనదాహం తీరడం లేదు!

'యజ్ఞం' నవలలోని నీహారికలాంటి వ్యక్తులు ఎందరుంటారు? ప్రాణాలకు తెగించి ఓ హాస్పిటల్లో జరుగుతున్న మోసాన్ని బహిర్గతం చెయ్యడం సాహస క్రియ. సేవాభావం కల్గిన కృష్ణప్రసాద్ లాంటి డాక్టర్ల అంకిత భావంగల హాస్పిటల్ ఎక్కడయినా కనబడుతుందా?

హాస్పిటల్స్‌లో జరిగే అకృత్యాల్ని ప్రభుత్వం అరికట్టటంలేదు. వైద్యసేవలు తాను అందించలేకపోయినా, అందించే ఏర్పాట్లు చేయాలి. కాని ప్రభుత్వం కూడా వ్యాపారిగా మారి ఆ పని తనది కానట్లు చేతులు ముడుచుకుని వ్యవహరిస్తోంది. ఇక ప్రజలకు దిక్కెవ్వరు?

సమాజాన్ని దోచుకునే యిలాంటి వైద్యాలయాల్ని, వైద్యులను, మందుల కంపెనీలపై చర్యకు ప్రజలే పూనుకోవాలి. ఈ నవల అందుకు ప్రజల్ని చైతన్యవంతుల్ని చేయగల్గితే బాగుంటుంది.

కథాకథనం, విషయవివరణ, నీహారిక తన్మయిల పాత్రల రూపకల్పన, సంభాషణాశైలి నవలను బాగా నడిపించాయి. ముఖ్యంగా 'సంతాన సాఫల్యత'కు సంబంధించిన విషయ విపులీకరణ బాగుంది. పాఠకునిలో కర్తవ్యాన్ని ఉద్బోధించే శక్తి నవలకుందనడంలో అతిశయోక్తిలేదు.

*డి. శ్రీధరాచార్య,*

ఆశిఫాబాద్- 504 293

## మృత్యు కోన కాకూడదు!

*(తృతీయ బహుమతి రూ.50/- పొందిన సమీక్ష)*

కల్లూరి శైలబాలగారి 'యజ్ఞం' ప్రచురించినందుకు హృదయ పూర్వక అభినందనలు. నేటి సమాజానికి అనుగుణంగా నవలను చక్కగా, అందరూ చదివేవిధంగా అందించారు. ప్రజల పాలిట దేవుళ్ళులా, ఆపద సమయంలో ప్రాణం పోసేవారు డాక్టర్లు. అటువంటి వృత్తిలో వుంటూ మానవ సేవయే మాధవసేవగా 'సురక్ష' హాస్పిటల్‌ను మురళీకృష్ణ అభివృద్ధి





పథంలో నడిపిస్తే, ప్రజల జీవితాలతో ఆడుకుంటూ, తన వృత్తికే అన్యాయం చేస్తూ, కేవలం ధన లాభం, సమాజంలో పేరుప్రతిష్టకోసం ప్రాకులాడే వ్యక్తిగా డాక్టర్ మణి నవలలో దర్శనమిచ్చారు. ఏ రంగంలోనయినా పోటీ వుండాలే కానీ, అది ప్రజల పాలిట శాపం కాకూడదు. కథానాయిక నీహారిక తన కుటుంబానికి జరిగిన అన్యాయం ఇతరులకు జరగకూడదనే పట్టుదలతో, తన ప్రాణానికి ముప్పు ఉందని తెలిసి కూడా పట్టుదల వదలకుండా ఆత్మవిశ్వాసంతో, హాస్పిటల్‌లో జరిగే అక్రమాలను వెలికితీసింది. తన్మయి, నీహారిక వంటివారు ప్రజలకు, సమాజానికి మేలుచేసే వైద్యరంగంలో గెలుపొందడం ప్రశంసనీయం, వైద్య పరిభాషలో వుండే పదాలను సామాన్య ప్రజలకు అర్థమయ్యే రీతిలో రచయిత్రి బాగా వివరించారు. పవన్, విశాల్, తన్మయి మొ॥గు వారు ఈ యజ్ఞంలో తమవంతు కర్తవ్యాన్ని నిర్వర్తించి నీహారిక విజయానికి తోడ్పడ్డారు. నవలలోని ప్రతి పాత్రకు రచయిత్రి న్యాయం చేకూర్చారు. ఎక్కడా కథను సాగదీయకుండా, అనవసర ప్రస్తావనలు లేకుండా కథను ముందుకు నడిపించారు శైలబాలగారు. తమ రచనద్వారా సమాజానికి చెప్పకనే చెబుతున్న సందేశం ప్రజలకు హాస్పిటల్ అంటే దేవాలయంగా కనిపించాలి గాని మృత్యుకోన కాకూడదు.

–వసంతకుమారి

అనంతపూర్

## దిక్సూచి

*(నాలుగవ బహుమతి రు: 50/– పొందిన సమీక్ష)*

**'యజ్ఞం'** నవలలో వైద్యవృత్తిలో జరిగే అమానుషాల్ని, మందుల తయారీ, అమ్మకాల్లో జరిగే దుర్మార్గాల్ని రచయిత్రి చక్కగా చర్చించారు. "వైద్యో నారాయణో హరిః" అనుకుంటూ వెళ్లే రోగికి "హరీ" అన్పించే పరిస్థితుల్ని కూలంకషంగా వివరించారు. రచన ఆద్యంతం రసభరితంగా, ఇవన్నీ మనకు తెలిసినవేగా అని డాక్టర్లు, "ఔరా! ఎంత ఘోరం" అని పాఠకులూ అనుకునేలా చేసింది.

'మెడిసిన్ అనేది ఓ వృత్తికాదు... అదో ధర్మం. ఈ నినాదాన్ని హరింపచేసే 'మణి' లాటి చెదపురుగులు ఈనాటి సమాజంలో వైద్యరంగంలో పుట్టల్లో పాముల్లా లెక్కకు మిక్కిలిగా పుట్టుకొస్తున్నాయి. తస్మాత్ జాగ్రత్త... అనే సందేశం ఈ నవల్లో మిళితమై వుంది.

పి.జి.డి. ప్రయోగం, ఐ.వి.యఫ్. ప్రయోగం... మొదలైనవి తేలికగా అర్థమయ్యేలా చేసి పాఠకుడి విజ్ఞాన తృష్ణను తీర్చారు. కొన్ని ప్రయోగాలు మన సంస్కృతీ, సాంప్రదాయాల్ని ఎలా దెబ్బతీస్తున్నాయో కూడా చక్కగా రాశారు రచయిత్రి. అధునాతన సాంకేతిక ప్రక్రియలు గర్భస్థశిశువుల వ్యాధిని నిర్ధారించాలేగాని లైంగిక నిర్ధారణ చేసి ప్రకృతిలో సమతౌల్యాన్ని దెబ్బతీసేలా వుండకూడదు.

ఈ నవల్లో సిసలైన హీరోయిన్... నీహారిక. ఆమె ఇన్‌వెస్టిగేషన్ పాఠకుల్ని ఉత్కంఠకు గురిచేసింది. తన్మయిలాటి విజ్ఞానపిపాసి పాత్ర చిత్రణ ఎంతో బావుంది. 'యౌవనరహస్యాన్ని ఛేదించారామె' అని రాయటం సరిగాదు. ప్రపంచవ్యాప్తంగా అది ఇంకా శైశవదశలోనే వుంది. సంతాన సాఫల్యకేంద్రాల మోసాలు, వైఫల్యాలు మాత్రం కళ్లకు కట్టినట్లు రాసి ఔరా! అన్పించారు.

రచయిత్రి శైలి అద్భుతంగా వుంది. అక్కడక్కడ కొన్ని కవితలు బాగా అలరించాయి. ఇది నవ్యసమాజానికి దిక్సూచి

కాదగ్గ నవల.

–డాక్టర్ కె. శివసుబ్బారావు
గుంటూరు

## చాలా బాగుంది

**(అయిదవ బహుమతి రు: 50/– పొందిన సమీక్ష)**

మార్చి నెల 'చతుర'లో ప్రచురించిన 'శైలబాల'గారి 'యజ్ఞం' నవల ఆద్యంతం ఉత్కంఠతో సాగి చదివించింది. మానవసౌభాగ్యానికి ఉపయోగించవలసిన శాస్త్రవిజ్ఞానాన్ని డబ్బుకోసం ఆశపడి మానవ వినాశనానికి ఉపయోగించే స్వార్థపరుల వృత్తాంతమే ఈ నవల సారాంశం. పిల్లలు పుట్టకపోవటానికి ఎన్నో కారణాలుంటాయి. ఆ కారణాలను తెలుసుకోవటానికి అన్నిరకాల పరీక్షలు ఒకే చోట చేస్తామని చెబుతూ నేడు అనేక హాస్పటల్స్, సంతాన సాఫల్యకేంద్రాలు ఎన్నోరకాలుగా ప్రకటనలిచ్చి ప్రజల్ని ఆకట్టుకొంటూ మనుగడ సాగిస్తున్నాయి. ఈమధ్య అలాంటి కొన్నింటిమీద దాడులు, అరెస్టులు కూడా జరిగాయి. ఇలాంటి కేంద్రాలు నేడు ప్రతీ పట్టణంలోనూ వెలుస్తున్నాయి. ఈ నవల చదువుతుంటే అటువంటి ఆస్పత్రులమీద నమ్మకం సన్నగిల్లుతుంది. కృత్రిమ గర్భధారణను సామాన్య విషయంగా ఊహించుకొనేవారు ఈ నవల చదివిన తరువాత అదో మహా'యజ్ఞం'గా అంగీకరించవలసిందే.

కృత్రిమ గర్భధారణ విషయంలో లోటుపాట్లను, డాక్టర్లు పడే కష్టాలను, అది సక్సెస్ అయితే డాక్టర్లు పొందే ఆనందాన్ని తన్మయి పాత్ర ద్వారా కళ్లకు కట్టినట్టు వర్ణించారు.

ప్రజల అమాయకత్వాన్ని, బలహీనతను సొమ్ము చేసుకుంటున్న అమృత క్లినిక్ వంటి ఆసుపత్రులు సంతానం కోసం గంపెడాశతో వచ్చిన దంపతులిద్దరిలో కేవలం మగవారిలోనే లోపముందని నమ్మబలికి మోసం చేయటం బాధాకరం, ఘోరం! రెండు విభిన్న తరహా క్లినిక్‌లతో కథను సృష్టించిన 'రచయిత్రి కొన్ని అనవసర సన్నివేశాలను చేర్చటం విచారకరం. ఆ సన్నివేశాలు పాఠకునికి కాస్త విసుగును కలిగించాయి. 'మరి కొన్ని సంఘటనలు సినిమా ఫక్కీలో సాగాయి. ఉదాహరణకు పవన్ జయరాం అడ్రస్ సంపాదించడం, నీహారిక జయరాం ఇంటికివెళ్ళి వచ్చేటప్పుడు మారువేషం, అంకితను అడ్డుపెట్టుకుని కంప్యూటర్ రూములోనికి చొరబడడం వంటివి ఈ కోవలోకి వస్తాయి.

ఇంక్యుబేటర్‌లో ఉండాల్సిన పెట్రిపాత్ర బయటకు మార్చడం వంటి సన్నివేశాలు, దీనికి కారకుడయిన డాక్టర్ సుబ్రహ్మణ్యం పాత్ర సృష్టి పాఠకులను థ్రిల్ లో ముంచెత్తడానికి, కథను సాగదీయడానికి మాత్రమే... పవన్ పాత్ర పరిధి తక్కువ. తన్మయికి తోడుకావాలి కాబట్టి పవన్ పాత్ర సృష్టించినట్టుంది. డాక్టర్ మణి, సునీల్, భార్గవ్‌లను చట్టానికి పట్టించి తన కుటుంబానికి జరిగిన అన్యాయానికి పగతీర్చుకునే డాక్టర్ నీహారిక పాత్రను చక్కగా మలిచారు. రాజా భూపతి పాత్ర అనవసరం. తన్మయి, నీహారిక వంటి డాక్టర్లు ఒక్కరున్నా డాక్టర్లు దేవుళ్ళుగా పూజింపబడతారు. మొత్తానికి చక్కని నవల అందించిన 'శైలబాల'గారికి, ప్రచురించిన 'చతుర'కు ధన్యవాదాలు.

–సి.యస్.సి. మూర్తి,
నడకుదురు-533 016

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications, Printed at Colorama Printers Pvt. Ltd., Hyderabad, Tel: 3730328. Office Address: CHATURA Telugu Monthly, Eenadu Complex, Somajiguda, Hyderabad. Tel: Hyderabad: 3318181, 3398787; Madras: 8270434, 8251044; Vijayawada: 476685; Visakhapatnam: 552211; Tirupati: 75757; Anantapur: 33777; Rajahmundry: 79170; Karimnagar: 23216; Suryapet: 21146; Guntur: 512149; Nellore: 338734; Kurnool: 52122; Srikakulam: 26060; Cuddapah: 70011; Tadepalli gudem: 28881; Warangal: 59933.

CHATURA Telugu Monthly Hyderabad- 500 482 Regd. No. H/HD/402-RNI/32186/78

# కొందరికి కారం అంటే మమకారం!

అౌను... ఇప్పుడు కారం కారంగా, తియ్య తియ్యగా, పుల్ల పుల్లగా, ఘాటు ఘాటుగా, మీకు నచ్చే మీరు మెచ్చే ఏ రుచి కావాలన్నా అందిస్తోంది 'ప్రియ'. 23 రకాల 'ప్రియ' పచ్చళ్ళు...
మీ ముందు సిద్ధం.

నోరూరించే, మైమరిపించే 'ప్రియ' ఘుమ ఘుమలు పసందైన విందును ప్రేమించే మీ కోసమే ప్రత్యేకం సుమా!

- వెల్లుల్లితోనూ, వెల్లుల్లి లేకుండానూ, ఆవనూనెతోనూ, నువ్వుల నూనెతోనూ కూడా సంసిద్ధమై లభిస్తోంది. సాటిలేని 'ప్రియ' మాధుర్యం... 300, 500 గ్రాముల సీసాల్లోనూ, 1 కే.జి., 5 కేజీలు, 20 కేజీల ప్యాకింగులలోనూ లభించును.










**priya**

**Pickles**

**ఏ పచ్చడంటే**
**ఆ పచ్చడి సంసి**

ఉషోదయ ఎంటర్‌ప్రైజెస్ లిమిటెడ్ (ప్రియ ఫుడ్స్ డివిజన్), ఈనాడు కాంప్లెక్స్, సోమాజిగూడ, హైదరాబాద్ 500 482